శ్రీ కళాభిలాషక కావ్యమాలిక. ౯ *

శ్రీ

# చిత్రహరిశ్చంద్రీయము.

(నాటకము.)

సెట్టి లక్ష్మీనరసింహాము,
బి. ఏ., ఎల్. టీ.,

విశాఖపట్టణము.





విజయరామచంద్ర ముద్రాక్షరశాల,

విశాఖపట్టణము.

1913.

వెల రు 1—0—0.

# పీఠిక.

'చిత్రహరిశ్చంద్రీయము' మా కావ్యమాలికలోని ౯ వ పుష్పము. నక్షత్రకుని జననము మొదలగు చిత్రములచేత గ్రంథనామము సార్థకము. హరిశ్చంద్రకథను ఇంతకు పూర్వమే పలువురు నాటకరూపమున రచించి యున్నను మరల ఇది వెలువడుటకు కారణము దాని గౌరవమే.

ఇది నామిత్రులును, మిసెస్. ఏ. వి. నరసింగరావు కాలేజీలో ఉపాధ్యాయులునగు మ॥రా॥ సెట్టి లక్ష్మీనరసింహము నాయుఁడు బి.ఏ., ఎల్.టి., గారు తమ మిత్రులు కొందఱు కోరఁగా రచించిరి. నామిత్రుల గ్రంథములు అవకాశమున్నంతవఱకు మాకావ్యమాలికలో చేర్పఁదలఁచి నాఅభిప్రాయము తెలిపితిని; నాకోరికకు అంగీకరించి ఆయనయు ఈనాటకము సిద్ధమై ఉండుటచే మా మాలికలో చేర్చి, నాకానందము సమకూర్చిరి. ఇందులకు నేనాయన నెంతయు నభినందించెద.

భాషాభిమానులును, సత్కథాసక్తచిత్తులునగు తెలుఁగువారి ఆదరమునకు పాత్రమై ఈనాటకము సదా రాణించుఁగాక! భగవచ్చరితము గావున భగవదాదరమునకును పాత్రమగుఁగాక!

మారేపల్లి రామచంద్రశాస్త్రి,
సంపాదకుఁడు.

## నాటకపాత్రములు.



### పురుషులు.

సూత్రధారుఁడు.

మారిషుఁడు.

విశ్వామిత్రుఁడు—ముని.

నక్షత్రకుఁడు—విశ్వామిత్రుని శిష్యుఁడు.

హరిశ్చంద్రుఁడు—అయోధ్యకు రాజు.

సత్యకీర్తి—హరిశ్చంద్రుని మంత్రి.

గణపతి—విదూషకుఁడు.

త్రిశంకుఁడు—హరిశ్చంద్రుని తండ్రి.

భటులు.

లోహితాశ్వుఁడు, లోహితాస్యుఁడు — హరిశ్చంద్రుని కొడుకు.

దంతఘాతుఁడు—రాక్షసుఁడు; మునిగాను బ్రాహ్మణుఁడుగాను వచ్చినవాఁడు.

శేఖరుఁడు.

కాశీపౌరులు.

కాలకౌశికుఁడు—విశ్వామిత్రుని మాఱురూపము.

వీరబాహుఁడు—కాశిలో కాటికాఁపరి.

వీరబాహుని వెంబడి గాల కుఱ్ఱవాఁడు.

కుమారభట్టు, రుద్రభట్టు, వినాయకభట్టు —కాశిలోని పిల్లలు.

రాజభటులు.

వసిష్ఠుఁడు—మహర్షి.

దేవతలు.

మఱికొందఱు కాశీపౌరులు.

### స్త్రీలు.

చంద్ర, మతి —మాలెతలు.

కాకి, సరస —అంతఃపురపు సఖికత్తెలు.

చంద్రమతి—హరిశ్చంద్రుని భార్య.

కలహకంటకి—దంతఘాతుని మాఱురూపము.

శ్రీ

# చిత్రహరిశ్చంద్రీయము.

## అవతారిక.

శ్రీగౌరీమృదునీలబాహులయుగశ్లేషాన్వితగ్రీవుఁడై
తాగారామున నామె మోవిసుధ నిత్యంబున్ మనోవాంఛితం-
బేఁగం ద్రాగుటఁ జేసి నీలగళుఁడై మృత్యుంజయుండౌ శివున్
నేఁగీర్తింతునకాలమృత్యుభయముందీర్పన్ ధృతింగూర్పఁగన్.

గీ. “గిరిధరుఁడవయ్యు గిరిధరధరుఁడవు, మృగ-
ధరుఁడవయ్యును మృగధరధరుఁడవు, విష-
ధరుఁడవయ్యును విషధరధరుఁడ,” వను భ-
వాని మాటకు మెచ్చునీశ్వరు భజింతు. 2

చ. తనకొక యడ్డుగా నిలిచి దారినొసంగని విఘ్ననాథునిం
దనయుఁ డటం చెఱుంగ కసిధారను చంపియు, క్రమ్మఱంగ నా-
ళనికిని జీవనంబులు యథావిధిగాఁగ నొసంగినట్టి యా-
యనితరసాధ్యదివ్యమహిమాకరు శంకరు సంస్మరించెదన్.

# చిత్రహరిశ్చంద్రీయము.

గీ. ప్రాణిసముదాయమున కెల్లభయముఁగొల్పు మృత్యువును జయించినయట్టి మేటి వేల్పు
కన్న మేటి వేల్పులు లేరటంచు, నతని కంకితం బిత్తు నీకృతి నభిమతమున. 4

గీ. అంకితంబు నిచ్చినందున మృత్యుంజయుఁడు దయార్ద్రహృదయయుక్తుఁ డగుచు
చావు లేకయుండ సతతంబు నాకృతి వసుధలోన నిలుప వచ్చుఁ గాదె? 5

శా. ఈయుద్దేశముతోడ నే వెదకినన్ మృత్యుంజయస్వామి నా-
కేయూరన్ గుడులందుఁ గన్పడమి కెంతేనిన్ విచారించి, ''కా-
నీ, యేచోటున లేఁడు శంకరుఁడు? లేఁడే నాదు చిత్తస్థలిన్?
నాయాత్మం గల వేల్పె నాదుకృతికిన్ నాథుం,'' డటంచున్ మదిన్, 6

వ. కృతనిశ్చయుండనై శ్రీచిత్రహరిశ్చంద్రీయకృతిముఖంబున కాభరణాయమా
నంబుగా కృతినాయకుండైన శ్రీమృత్యుంజయుని ప్రభావ మభివర్ణించెద. 7

గీ. మున్ను గాముపుచెలి మున్నుగాఁ గలసురలెన్నఁగా దివమున నన్నగారి
పన్నగారివాహనన్నగారికిఁ దగియున్న గారవమున దిన్నగాను, 8

క. స్వారి వెడలి చనుచో, దుర్వారమహిమ నపరకృత్తివాసుఁ డనంగా
పేరుపడిన దుర్వాసుఁడు చేరి, తనకు వినతుఁడగు శచీపతితోడన్: 9

గీ. ''వేయినోరులవాఁడును వినుతిచేయ లేని సిరి, వేయికరములవాని కాంతి
కలుగు వేయికన్నులవాఁడ, కైకొను,'' మని వేయిరేకులవిరిని దీవించి యిచ్చె.

క. ఆ విరి తానెక్కిన యైరావతకుంభద్వయిన్ పురందరుఁడునుపం-
గా, వెలిమలగుట్టలపై వేవెలుఁగు తెలుంగున నది వెలుఁగఁ దొడంగెన్. 11

గీ. పద్మనాళంబు తనకుంభములనడుమ నిముడఁగా, అవిజవరాంద్రయిలుకుగబ్బి
గుబ్బలకు సాటిరావను గుట్టు బట్ట బయలగునటంచు నాకుంభి భయము చెంది,

గీ. కుసుమమునుతుండమునఁ నందుకొని పదములక్రిందఁ జిందరలను జేయ, అందువెడలి
త్రెందుకొని సందడించె నిందిందిరంబు, లిందిరాగేహభృత్యుల చందమునను.

ఉ. క్రొన్ననైన పాట్లు కనుఁగొన్న క్షణంబున బగ్గుబగ్గునన్
కన్నులనుండి యగ్గిరెయులుకొంగను దుర్వసుఁ ''డోరి యింద్ర, వేఁ-
గన్నులు కల్గినన్ విభవగర్వముచే కనుఁ గాన లేవె? నీ-
కున్న సమస్తసంపద పయోనిధి పాలగు,'' నంచు తిట్టినన్,

క. దుర్వాసుని కోపాగ్ని కఖర్వముగా బొంగినట్లు కడలి బడలి, యా
గీర్వాణపురిని ముంచుచు సర్వస్వముఁ దుడుచుకొనుచు జని యవ్వేళన్. 15

సీ. ధవళదేహమును నాల్గుదంతంబులును గల యైరావతంబను హస్తి యొకటి,
అచ్చంబుగా తెల్లనై మచ్చలేని యుచ్చైశ్శ్రవంబనెడి యశ్వం బొకటియు,
అఖిలదేవతలకు నమరత్వము ఘటింపఁ గలిగిన యమృతంపు ఘటమొకటియు,
కోరిన వారి కోర్కెల నెల్ల సమకూర్పఁ జాలిన దేవవృక్షంబు నైదు,
కలిసి యుండినట్టైశ్వర్యములును వార్ధిఁ గలిసిపోయినట్టైశ్వర్యములగుకతన,
"చీ! ఇఁకేటికీయింద్రునిసేవ?" యంచుసంద్రమునఁబడిపోయి రచ్చరలుకూడ.

క. తన విభవ మబ్ధి మునుఁగఁగ, అనిమిషకులనాయకుఁడు మహాశోకాబ్ధిన్
మునిఁగి, "దరిఁ జేరఁగా వనధినివాసుని చేయియూఁతె దిక్కగుఁగ," ననుచున్:

మ. "కడలిన్ వేదము లెల్ల మగ్నములు కాఁగా మీనవై వాని వె-
ల్వడఁగాఁ జేసి, విధాతకున్ ముదము కల్గం జేయఁగా లేదె? ఇ-
య్యెడ నా సంపద లెల్ల వార్ధిఁ బడిపోయెన్; వాని నేరీతిగా
పడయం జేసెదొ? నీదు చిత్తమును నా భాగ్యంబు లక్ష్మీవరా," 18

మ. అని ప్రార్థించినయంత నాబ్ధిశయనుం డాలించి వేంచేసి యి-
ట్లనె: "క్షీరాంబునిధిన్ మథించునెడ నీయైశ్వర్యముల్ క్రమ్మఱం-
గను నీవొందెద, వందు మందరగిరిన్ కవ్వంబుగా, వాసుకిం
బెనుసూత్రంబుగ నిల్పు; రాక్షసులతో మిత్రత్వమున్ సల్పుమా." 19

క. హరి యిటులుపదేశింపఁగ, హరిహయుఁడు సురాసురులసహాయముతో మం-
దర మబ్ధి నిల్పి, వాసుకిఁ దరిత్రాడుగ చుట్టఁబెట్టి తరిచెడి వేళన్, 20

గీ. నగరిపునకు మేలొనర్ప నిష్టము లేని భంగి వార్ధిలో మునింగె నగము:
"ఇక్కట్ల లూడనతిక్కి యిక్కొండ తేలమి కకట! నేనె మూల," మనుచు వజ్రి:

శా. "ఈమాటున్ మము ప్రోవఁగా శరణమీవే, అన్యథా నాస్తి, ఓ
స్వామీ, మామక కామితప్రద, కృపావారాశి, వారాశి నీ-
వే మీనంబవొ లేక కూర్మమవొ యై యియ్యాది తేలింపు, కు-
య్యో! మొఱ్ఱో!" అనునట్టి యార్తనినదమ్మైకుంఠుఁ డంత విన్నంతనే, 22

గీ. కామజనకుఁ డతఁడు నా మేటి తామరాఖ్యుఁ దార్చి, తనదు వీఁపుమీఁద
అబ్ధినుండి మందరాగంబు రాగంబుతోడ మీఁదికెత్తి సుదిగరిని. 23

క. అతలము నీటను తేలిన విచిత్రము ఘటిల్లినంత, విబుధులు దైత్య-
ప్రతతియుతో సామంబులు పచియించుచు క్రమ్మఱ తరువంగఁ దొడంగన్,

క. కడలికి నడుమను కడలను కుడిగొడమల నెడమునిడక కూడికొనుచు తోడిం-
దోడిపాడముచు తొడఁబడ బుడబుడలడరెడివడువున కడుబుడగలు వెడలెన్.

గీ. వెండికాటుక కాయల విధమునఁ దగు అబుడగ లొక్కొక్కటి గాఁబగులఁగ,
కాలకూటంబు కాటుక గఱిని ముద్దముద్దలుగ దానిలోనుండి పొడమి వెడలె.

క. ఔర్వానలంపు పొగయో, దుర్వను కొంపొక్కఁ బొడము ధూమమొ, యన నా
దుర్విషపుంజము మీఁదికి పర్వుచు నలుదిక్కులకును ప్రాఁకఁగ సాగెన్. 27

గీ. నడకగలనల్లనిప్పుకొండయొయనంగ, మింటికంటుకొనఁగ పెనుమంటలు వెడఁ-
గ్రక్కుచున్నట్టి యా ఘోరకాలకూటవిషము జగములకెల్లను వెఱపు గొలిపె.

క. ఈలీల మహాభీలజ్వాలాజాలంబుతోడ జగములఁ జాలన్
హాలాహలము దహింపఁగ, కోలాహలరవము క్రందుకొనఁగా నమరుల్, 29

గీ. పరుగుపరుగున నరిగను తిరిగి చూడక రిగి, కైలాసగిరిమీఁద వరఁగుచున్న
ఉరగభూషణుపదములకెఱఁగి, తమదు తెఱఁగు నెఱిఁగించి, యాయనమఱుగుచొచ్చి:

మ. "భవ, గౌరీరమణీధవా, అభవ, భవ్యప్రాభవా, దివ్యవై-
భవ, ఫాలానలదగ్ధభావభవ, విధ్వస్తస్వభక్తావళీ-
భవ, గోసైంధవ, దానబాంధవ, జటాబంధస్థితాంభోధినం-
భవ, పేర్మార్ణవ, దారుకావిపినభామావల్లవా, ఓ శివా, 31

మ. అలికస్థానలనేత్రముఁ దెఱచి నీవ 'ట్లార్ణము న్పేన శీ-
తలమున్' చేసెదవో, జటస్థితనదీధారల్ దారఁగించి మం-
టల చల్లార్తో, గణాహిచేత విషముం దార్గింతువో, ఈహాలా-
హలపుంజంపుహాహాకారిన్ తొలఁగఁ జేయఁగ దేవ, నీభారమే. 32

గీ. పాలనము సేయు మము జగత్పాల, ఓ కృపాలవాల, నీ పాలను బడుట పాల
ముంతువో, లేక నీళ్లను ముంతువో, విషజనితతాపంబుఁబోవుమానేశ్వర ముగ.

గీ. మంచుకొండపుత్రిక తాళి మసక నీకు, గంగ రెండవ పెండ్లాము గాన నీదు
పల్లదనమున కేమి సంశయము? గరళ జనిత తాపంబుఁ బాపుమా సత్వరముగ.

గీ. నీవు లయకర్తవనఁగను, నిన్ను మించి లయమొనర్పంగఁ జూచ్చె హాలాహలంబు;
అధికులమదంబణంచుట విధి గదా? విషజనిత తాపంబుఁ బాపుమా సత్వరముగ.''

క. అనువిబుధుల యార్తధ్వని విని, బగబగ నుడుకు లెత్తు విశ్వముల కనుం-
గొని, యనుకంప మనంబున జనియింప నిలింపతతుల, ''జడియకుఁ,'' డనుచున్,

గీ. ఎగుడు కణకణమను నగ్గి, దిగుడు నల్లముద్దయును గల్గు నా విషమును పయోధి-
నీళ్ల నుండి హుక్కా కరణిగ నపుడె గఁ బీల్చె మహేశ్వరుఁడు సుఖలీల నహహ!

చ. జగముల కత్యుపద్రవము నల్పుచునున్న హాలాహలంబు ని-
ట్లుగ కబళించుచున్, కడుపులోపలి లోకములన్ దహింపకుం-
డఁగ గళమందె నిల్పుకొనినన్, హరుకంఠము మాఁడిపోయి య-
య్యగజగాత్రార్ధభాగమున నైక్యము చెందెను వర్ణసామ్యతన్. 38

గీ. నీలకంఠత్వ మిటులుగ నిటలనయనునకు ఘటిల్లినన్, గళమునందలి భుజంగ-
ములు భుజంబులకున్ కరంబులకు భయము వడి తొలఁగె, మెడమచ్చ విస్పష్టముగను.

గీ. స్మరహరునికిట్లు మెడ ముందు మాఁడిపోయె; వదనమాపిదప నొకింత వాడిపోయె;
వెనుక నెత్తినునంగల వేఁడి పోయె; చూడఁగా చూడఁగా చేరి నాడి పోయె.

శా. ''ఆహా! ఆహా! ఇదేమి? ఏమిది? సమస్తాధీశుఁడౌ ఈశ్వరుం-
డే హానిం గన, లోకముల్ నడుపువారెవ్వార లీమీఁద? ఆ-
హా! హాలాహలమేల పుట్టె? హరుఁ డేలా మ్రింగె?'' నంచున్ మహా-
హాహాకారము లుద్భవిల్లఁగ హరప్రాణంబుపై శంక చే, 41

గీ. నిద్ర నాహారమును మాని నిఖిలభువనముల జనంబులు కదలక నిలిచియుండి;-
రభవు ప్రక్కఁ బాయనిసతి యమృతకరసుదృష్టు లీశు మోమున నుండి త్రిప్పకుండె.

గీ. భవుఁడు మూర్ఛనిట్లు పదుమూఁడు యామములు మునిఁగియుండి, అంత మూర్ఛఁ దెలిసి
మేలుకొంచు లేచె మృత్యుంజయుండౌచు, జగదవనధురీణుఁడగుచు, నగుచు. 43

గీ. అంతవఱకును బహుళశోకాంధకారమందు మునిఁగిన లోకంబు, లిందుధరుఁడు
తనదు దక్షిణాక్షిని విప్పి కనుఁగొనఁగనై తెలివిఁ బొందె మనంబులు దిగులుఁ బాసి.

ఉ. "జీవుల జీవముల్ గొలఁగఁ జేయుట చావు స్వభావమే కదా?
దేవతలైనఁ, జావునకు దెవ్వరవుఁ భయమొందుదుఁ సుధా-
సేవన మెల్లకాలమును జేయుదురే కద? ఇంక, నీవలెన్
చావును జావఁ జేయుటకుఁ జాలిన వారెవరయ్య? ఈశ్వరా, 45

మ. జయ సర్వప్రియ, సర్పహారనిచయా, సంప్రీతనైజాంగనా-
జయ, పాపప్రచయక్షయా, త్రిపురరక్షఃకాననానీధనం-
జయ, హాలాహలకీలజాలవిలయా, శైలాలయా, శైరిదుర్-
జయ, గోరాజహయా, దయామయ, మమున్ రక్షింపుమృత్యుంజయా," 46

గీ. అనుచు పదునాల్గు లోకంబులందుఁ గలుగువారు హాలాహలవిషంబు వలని బాధ
దొలఁచి రక్షించినట్టి మృత్యుంజయునకు జయజయధ్వనుల్ చేసి సంతసమున.

క. ఏవంవిధబహుకరుణాభావునకున్, నిస్తులప్రభావునకుఁ, గౌ-
రీవారిజాతవదనాభావప్రియజీవునకు, మహాదేవునకున్, 48

క. దైత్యసమూహక్షయునకు, నిత్యనిరామయున, కఖిలనిర్జరసందో-
హాత్యంతప్రియునకు, శ్రీమృత్యుంజయునకు, మదీయహృన్నిలయునకున్, 49

వ. సమర్పణంబుగా నాచే నొనర్పం బడిన శ్రీచిత్రహరిశ్చంద్రీయము: 50



శ్రీ

# చిత్రహరిశ్చంద్రీయము.

## ప్రథమాంకము.

శ్రీతాఁ గంగనె నీలకంధరత వాసింగాంచెఁ గానన్ ఘనుం
డై త్రైలోక్యజనాళి కింపొదవఁ జేయన్ సత్కృపావృష్టితో
ధాత్రిన్నించి, లయంబుచేయునను నిందంబాసి చెల్వౌ జగ-
న్మిత్రున్ శ్రీగిరిజాకళత్రున్ భయభక్తిశ్రద్ధలన్ గొల్చెదన్.

సూత్రధారుఁడు—

తే. గీ. హరుని కంఠార్థమును పట్టు గరళపువడి
తొలఁగఁ జేయుచు సర్వమంగళగళమున
మహితమహిమలన్ వెలసిన మణులతోడి
సూత్రము ధరిత్రి కెల్లఁ గూర్చుత శుభంబు. 2

మఱియు,

శా. "సత్యాసక్తుఁడు మున్ సతీరమణుఁడౌ శంభుండు; ఈమీఁదట
న్సత్యానాథుఁడుగాఁగ పుట్టఁగల శ్రీనారాయణుండుం గదా?
ప్రత్యక్షంబుగ నేఁ డెవండొ?" అనునింద్రప్రశ్న కుప్పొంగు నా
నిత్యస్తుత్యుల, ఈశకేశవుల, ధ్యానింతున్ మిమున్ బ్రోవఁగన్. 3

అతి విస్తరమేల? హరిహరులను వేఱువేఱుగా పేరుకొనుట ఏల? హరిహరులిద్దఱు అన్నివిధములను అభేదము కదా? సత్యము, సత్యము.

[తెరలో—"ఇదిగో, వచ్చుచున్నాను".]

సూత్ర—పిలువని పేరంటముగా ఎవరీవచ్చువారు?

[మారిషుఁడు ప్రవేశించును.]

మారిషుఁడు—అయ్యా, నన్నెందుకు పిలిచినారు?

సూత్ర—నేనా? నిన్ను పిలిచితినా? ఓయీ మారిషా, ఎంత చెప్పినను అసత్యములు పలుకుట మానుకొనకున్నావు గదా?

మారిష—కోడలికి బుద్ధి చెప్పిన అత్త వలె, నన్నసత్యములు పలుక వద్దని చెప్పి మీరే అసత్యములాడుచున్నారేమి? మీరు నన్నిప్పుడు "సత్యమూ, సత్యమూ" అని పిలిచియు లేదనుచున్నారు.

సూత్ర—"సత్యము, సత్యము," అని నేనన్న మాట నిశ్చయమే; కాని అది నిన్ను పిలుచుట ఎట్లగును?

మారిష—ఎట్లా? నా పేరు సత్యనారాయణ గనుక.

సూత్ర—నీ పేరదే అయినను, అసత్యపరాయణుఁడవైన నిన్ను "నారాయణా" అని పిలుతును గాని "సత్యమూ" అని పిలుతునా? "సత్యమూ" అని పిలిపించుకొనుటకు నీవా తగినవాఁడవు?

మారిష—అయ్యా, ఒక్క అబద్ధమాడిననేమి? పుట్టెఁడబద్ధములాడిననేమి? "సత్యమూ" అని పిలిపించుకొన తగినవాడు ఒక్క అసత్యమును ఆడని పుణ్యాత్ముఁడే. అట్టి మహాపురుషుఁడు నభూతో నభవిష్యతి.

సూత్ర—ఇదేమోయి, విశ్వామిత్రుని లాగున పలుకుచున్నావు?

మారిష—జగన్మిత్రుఁడను, నేను విశ్వామిత్రుఁడ నెట్లగుదును?

సూత్ర—విశ్వామిత్రుఁడనఁగా గాధిపుత్రుఁడు, కుశికవంశసంభూతుఁడు, క్షత్రియుఁడై పుట్టి బ్రహ్మర్షి అయిన మహానుభావుఁడు. అతని మహత్త్వమును సంగ్రహముగా చెప్పెదను, వినుము.

తే. గీ. సృష్టికిని ప్రతిసృష్టిని చేయ బ్రహ్మ,
జగములను మాయయందు ముంచంగ విష్ణు,-
వెదురు లేని రౌద్రమున మహేశ్వరుఁడు: త్రి-
మూర్తినిభుఁడు విశ్వామిత్రమునివిభుండు. 4

మారిష—ఓహో! ఈ ప్రచండమునిని గురించియా పలుకుచున్నారు? ఇతని సం

గతి నేను వినియే ఉన్నాను. వశిష్ఠునిమీఁది కోపముచేత అతని సుతశతమును హతము గావించిన మహానుభావుఁడు ఇతఁడే కదా?

సూత్ర—ఇతఁడే. ఇతనికిని నీకును పోలిక ఎట్లో చెప్పెదను, వినుము. ఒకనాఁడు స్వర్గలోకమునందు దేవేంద్రుఁడు తన్ను దిక్పాలకులును దేవతలును సేవించుండగా సుధర్మాసనాధిష్ఠుఁడై నిండుకొలువుండి తన చుట్టును ఉన్న ఆసనములందు ఉన్న దేవర్షులను బ్రహ్మర్షులను ఉద్దేశించి, "ఓ మహర్షులారా, ఏలోకమందైనను భూతభవిష్యద్వర్తమానపురుషులలో ఒక్కప్పుడును మాటతప్పనివాఁడు కలుగుట మీరెఱుఁగుదురా?" అని ప్రశ్న వేసెను. అప్పుడు విశ్వామిత్రుఁడు నివ్వెఱనే; "అట్టి మహాపురుషుఁడు నభూతో నభవిష్యతి" అనిచెప్పెను.

మారిష—చూచినారా మఱి? నేను చెప్పిన సంగతి ఇంద్రసభలోనే సిద్ధాంతమైనది.

సూత్ర—సిద్ధాంతమెక్కడ నైనది? ఆ మాట విని వశిష్ఠుఁడు లేచి ఇంద్రుని దిక్కు మొగమై, "ఓ మహేంద్రా,

మ. సకలాశాగతకీర్తిసాంద్రుఁడు హరిశ్చంద్రుం డయోధ్యాధినా-
యకుఁడై, ఆపయి చక్రవర్తియయి, యొప్పారుం గదా ధాత్రిపై?
ఒకవేళన్ నిజవంశకర్తయగు సూర్యుండున్ గతిన్ తప్పఁగా-
క, కలన్ సైతము మాట తప్పుట యెఱుంగండా నృపుండెన్నఁడున్."

అని గొంతెత్తి చెప్పగా, విశ్వామిత్రవశిష్ఠులకు "త్వమ్ శుంఠః, త్వమ్ శుంఠః" అని పెద్ద వాగ్వాదము జరిగినది. విశ్వామిత్రుఁడు నిప్పుకొండవలె మంటలను గ్రక్కుచు, హరిశ్చంద్రునిచేత ఎట్లయినను బొంకింతుననియు, బొంకింపలేకున్నచో హరిశ్చంద్రుని విషయమై తన తపస్సులో సగము వ్యయపఱతుననియు, ప్రతిజ్ఞ చేసెను.

మారిష—వహవ్వా! వహవ్వా! మంచి రద్దిగా ఉన్నది. ఈ గుద్దులాటలో ఎవరు కూలఁబడినారో?

సూత్ర—ఈ కథ నీకు చెప్పుచు కూరుచున్న యెడల మాటల సందడిని మనువు మఱచినట్లే అగును. అదిగో, నాటకము చూడ వచ్చిన వారప్పుడే చప్పట్లభ్యాయమును ఉపక్రమింపనై ఉన్నారు.

మారిష—ఏ నాటకము నాడుచున్నారు?

సూత్ర—నీకు కావలసిన కథయే; చిత్రహరిశ్చంద్రీయము.

మారిష—సత్యహరిశ్చంద్రీయ నాటకమన్న పేరెదో విన్న జ్ఞాపకమైనను ఉన్నది. ఈ చిత్రహరిశ్చంద్రీయమును గురించి వినియు ఉండ లేదు. అది రచించిన కవి ఎవరు? ఇది వ్రాసినతఁడెవఁడు?

సూత్ర—సత్యహరిశ్చంద్రనాటకగ్రంథకర్త జగద్విఖ్యాతుఁడు.

సీ. తెనుఁగుబాసాడెడు జనులు కల్గిన దేశ-
ములనెల్లనున్ పేరు మ్రోసె నెతఁడు?
సంఘసంస్కరణంబు సల్పుటకెన్ని యా-
పదలైన పొంకుచు ముదిసె నెతఁడు?
కోరి దొరతనంబువారియ రావుబ-
హద్దరు బిరుదంబు నందె నెతఁడు?
జగమెఱింగినయట్టి జన్నిగట్టగుట సూ-
చించి జందెము విసర్జించె నెతఁడు?
మోడు మ్రోఁకులు మొలకెత్తు పోల్కి కావ్య-
ములు రచించుటయే కాక, బోడితలలు
మఱల మొలకెత్తఁ జేసిన మాన్యుఁడెతఁడు?
కందుకూరివి రేశలింగంబతండు. 6

ఆమహాకవి నామోచ్చారణమైనవెనుక, ఈ రెండవవాని పేరెత్తుటకైనను వీలులేదు.

సీ. స్నేహితుల్ కృతులు రచింపుమందురు, నాకు
కవిత అల్లెడు శక్తి కలిగ నేల?
దొరలు తెల్గింపమందురు తమబాసగ్రం-
థములు, బి. ఏ. అయినాడ నేల?
నాటకంబులు వ్రాయ నాటకులడిగెద,-
రేల వేషములకే నిష్టపడితి?
బడిపుస్తకముల నుపాధ్యాయులొనరింపు
మందు, రెల్. టీ. పట్టికైతి నేను?

కడుపులో చల్ల కదలని కరణి హాయి-
గాఁగ నుండనీయక "ఇట్టికష్టముల ఘ-
టించితే ఈశ్వరా, నా?" కటంచు వెతను
చెందు సెట్టిలక్ష్మీనరసింహమితఁడు. 7

మారిష—బద్ధకములో నా పెద్దన్న. ఇతడు తన నాటకమునకు "చిత్రహరిశ్చంద్రీయ" మని ఎందుచేత పేరు పెట్టినాఁడు? ఇందలి చిత్రములేమి?

సూత్ర—ఇది అతనినడిగి నేను తెలిసికొన్నాను. బద్ధకులలో బద్ధకుఁడగు తాను ఒళ్లు వంచి వ్రాయుటయే చిత్రములలో చిత్రమఁట! అందుచేత తన నాటకము చిత్రహరిశ్చంద్రీయమఁట!

మారిష—బాగున్నది. సరే కాని వీరిద్దఱి కవిత్వములను సరిపోల్చి చెప్పండి. ఈ ఇరువురి కవులలో ఎవరధికులు?

సూత్ర—"సెట్టి సేరు, లింగము పదిసేరు" లన్న సామెతను బట్టి వీరి పేరులే తారతమ్యమును నిర్ణయించును. శూద్రుఁడైన లక్ష్మీనరసింహము బ్రాహ్మణాగ్రగణ్యుఁడైన వీరేశలింగముగారి పాదసేవకే అర్హుఁడు.

మారిష—ఏమండోయి, మీరెంత సూత్రధారులైనను ప్రకృతకవిని ఇట్లు చులుకచేయ వచ్చునా?

సూత్ర—నేను కారణము లేక ఇట్లనుట లేదు. మన సెట్టి వీరేశలింగముగారికి ఆఱు నెలలు శిష్యుఁడయ్యెను.

మారిష—ఆఱు నెలల సాము మూలనున్న ముసలి మీఁదకా? వీరేశలింగముగారి గ్రంథముకంటె తాను చక్కఁగా రచింతుననియేనా ఇతని ఉద్దేశము? మీ అభిప్రాయమేమి?

సూత్ర—గురువుగారి గ్రంథము నీతులు బోధించుచుండును; శిష్యుని గ్రంథమేడ్చినట్లే ఉండును.

మారిష—అట్లయిన, ఏడ్చినట్లే ఉన్న నాటకమునే మీరాడుచున్నారేల?

సూత్ర—గ్రంథకర్త జగన్మిత్రుఁడగుటవలన?

మారిష—ఇతఁడు జగన్మిత్రుఁడెట్లు?

సూత్ర—ఇదియు అతనివల్ల తెలిసికొన్న సంగతియే, వినుము.

తే. గీ. అన్యకవులు విశ్వామిత్రులై యపూర్వ
సృష్టిఁ బెక్కు గ్రంథముల రచింప, ఈతఁ-
డుబుసు పోవని గ్రంథబాహుళ్యమునను
ధాత్రికార్తి పెట్టఁడు జగన్మిత్రుఁడగుచు. 8

మారిష—అయ్యా, మీరు పదేపదే విశ్వామిత్రుని అపూర్వసృష్టిని గురించి చెప్పుచున్నారు. ఏవీ? అట్టి సృష్టికి కొన్ని దృష్టాంతములను చెప్పండి. విని సంతోషించెదను.

సూత్ర—అట్లయిన, ఇదిగో చెప్పెదను వినుము.

సీ. పల్లవారుణజటాపటలమూలమున ద్వి-
జాగిమనంబు తానుపుపణిచె,
మధురగీతపమేతమధుపాంగనల ప్రతి
పదమున నుద్భవింపంగఁ జేసె,
ఆధారరహితుఁడై యల్లాడును బయల
నుండు మందుని పయినుండి తెచ్చె,
పండ్లను కోటికి కోపము మోమునసె పూను
వానియడావుడి వఱలఁ జేసె,
బ్రహ్మకును వ్యతిరేకపు బ్రహ్మయగుట
కాక, మాధవునికి వ్యతిరేకమాధ-
వుండగుచు, ఇట్టి మాయలు పుట్టఁ జేసె
అపరరుద్రుండయిన కుశికాత్మజుండు. 9

మారిష—ఈవిధముగా అయినను వసంతవర్ణనమైనది. ఇక సంగీతమే మిగిలినది.

సూత్ర—మీ చెల్లెలు రా లేదు. నీవే అంగునకు కుదురవలెను.

మారిష—బావగారిని తిత్తి యూఁదుమనుటకు నాకు గుండెలున్నవా? అయ్యా, మగవాని పాట మెచ్చువారెవ్వరు? అది గాక, ఇందఱిలో ఎట్లు పాడఁ గలను? నన్ను క్షమించండి.

సూత్ర—అవునోయి అవును. నీకు తగిన అల్లరి మూక యెదుట పాడుదువు గాని ఇట్టి మనీషాప్రకాశాధికులైన బుధాగ్రణులయెదుట పాడుటకు నీకు మనస్సు గొలువునా?

తే. గీ. అంధకారంబు నలుదిక్కులావరించి
యున్నపుడె గ్రుడ్డగూబ తానన్ని దిశల-
కరిగి రాత్రుల సంతోషమందు; పగలు
కౌశికాంధత చాల జగత్ప్రసిద్ధి. 10

[తెరలో-"ఎవఁడురా వశిష్ఠుని వలె ప్రేలుచు మాయందు గ్రుడ్డితనమారోపించుచున్నాఁడు?"]

మారిష—బావగారూ, నన్ను మీరు చీవాట్లు పెట్టినారని మిమ్ము ఎవ్వరో కసరుచున్నారు.

సూత్ర—మఱెవ్వరు? విశ్వామిత్రుఁడే., "కౌశికాంధత" అని గ్రుడ్లగూబ గ్రుడ్డితనమును గుఱించి నేను చెప్పఁగా, కౌశికుఁడగు తన సంగతి అనుకొని అట్లనుచున్నాఁడు. రా. రా, ఇట్టి కోపసమయమున ఇతని కంటను పడితిమా, ఏమి కొంప మునుఁగునో!

[ఇద్దఱును నిష్క్రమింతురు.]

---

[ప్రథమరంగము—విశ్వామిత్రాశ్రమము.
విశ్వామిత్రుఁడు ప్రవేశించును.]

విశ్వామిత్రుఁడు—ఎవఁడురా, వశిష్ఠుని వలె ప్రేలుచు మాయందు గర్హితనమారోపించుచున్నాఁడు?...ఏమీ, ఈ వశిష్ఠుని కండకావరము! ఇంద్రసమక్షమందు కూడ నేను క్రోధాంధుఁడననియు, అందుచేత హరిశ్చంద్రుని సత్యసంధత కనిపెట్టలేక పోతిననియు కాఱులు ప్రేలినాఁడు...బాగుగా ఆలోచింపక కాని, వాఁడు కూడ గ్రుడ్డివాఁడు కాఁడా?

ఉ. బంధురమత్క్రుధాగ్ని సులభంబుగ వాని శతాత్మజుల్ విశు-
ష్కేంధనవృత్తి మ్రగ్గ, సుతు లెందును తోచమి ఏనికబ్బె శో-
కాంధత; ఇంక చంపుదునటన్నను తోచమి నాకు కల్గె క్రో-
ధాంధత: అక్కటా! సుతసహస్రము వానికి కల్గ కూడదా? 11

నిత్యసుమంగళి వీని పెండ్లా, మరుంధతి మంగళసూత్రమహిమ వీనిని కాచుచున్నది కాని లేనియెడల వీఁడు మాత్రము నాకొక లెక్కా?

క. కొడుకులు నూర్గురు చచ్చి మొ-
రడు మ్రానుం బోలె మొండి బ్రదుకు బ్రదుకునీ-
తఁడు నా కోపానలమున
పడి, అప్పుడె యింధనమయి భస్మము కాఁడే? 12

........ఛీ! ఈలాగు ఒక్క మాఱుగా చంపుటవలన నా కోపమేమి తీఱును? వాఁడు బ్రదికియే ఉండవలెను; వీలైనప్పుడెల్ల నేను వానిపై కసి తీర్చుకొనుచునే ఉండవలెను......ఈ సారి నా మనసు తీర కసి తీర్చుకొను సాధనము కలిగెను. హరిశ్చంద్రునిచే బొంకించి, శపథము చొప్పున వాని నెత్తి గొఱిగించి, గాడిదమీఁద తోఁకవైపుగా కూరుచుండఁ బెట్టి దక్షిణదిశకూరేగించినప్పుడు కదా ఉత్సవము!

చ. చలిమిడిముద్ద భంగిగ నెసంగెడు నున్నని నెత్తిమీఁద ఈఁ-
గలు పెనుకోమలున్ ముసరఁగా, పసరమ్ము విధమ్మునన్ తలన్

పలుమఱు ద్రిప్పు వాని వెత పాపఁగ గాడిద తోఁక వానికిన్
చెలువపు చామరంబగు విచిత్రము కన్నులపండుగాఁ గదా! 13

........బ్రహ్మసృష్టిని మించినది లేదను ప్రపంచమంతటిని అసత్యవంతముగా చేసిన నాకు, ఈ హరిశ్చంద్రుని చేత కల్లలాడించుట ఒక కష్టకార్యమా?...... “సత్యవచోధురంధరుఁడైన మాహరిశ్చంద్రవసుంధరావరుఁడు నీవంటి సామాన్యక్షత్రియుఁడనుకొంటివా?” అని దెప్పిపొడిచి వాఁడు నాకు మఱియు రోషము తెప్పించెను. ఆహా! ఏమి, మూలదానిని కట్టుకొన్న ఈ బ్రాహ్మణ చండాలుని కండకొవ్వు! బ్రహ్మాదిదేవతల సమక్షమందు బ్రాహ్మణాగ్రగణ్యుఁడ ననుకొను తనచేత కూడ బ్రహ్మాండమంతయు ఎఱుఁగునట్లు బ్రహ్మర్షిననిపించుకొన్న నేను బ్రాహ్మణుఁడను కానను టకు వీని బ్రాహ్మణ్యమెక్కడ తగులఁబడినది?...... గురువు వీఁడే ఇట్టి అబద్ధములకు తగులుకొనగా, వీని శిష్యుఁడు తన సత్యసంధతను నిలుపుకొనునఁట! వీనిదా గ్రుడ్డితనము? నాదా గ్రుడ్డితనము? ... “కౌశికాంధత చాల జగత్ప్రసిద్ధి” అని ప్రేలి తెగించిన ఈ కూళ ఎవ్వఁడు?...... వీఁడెవ్వఁడో వశిష్ఠుని శిష్యుఁడు; గురువు ప్రేరేపఁగా నన్ను వెక్కిరించుటకు వచ్చినాఁడు... ఆహా! ఏమి! పులి మీసములు పట్టి ఉయ్యాల యూఁగుటే?.....నా క్రోధమునకు జడిసి నాకెవ్వరును శిష్యులు కాని అనర్థమిట్లు పరిణమించినది. చేఁదోడు వాఁదోడుగా శిష్యుఁడే ఉన్నయెడల ఈ దుండగపు వటువు కాళ్లను వెంటనే విఱుగఁ గొట్టించియుండనా?...పిచ్చుకమీఁద బ్రహ్మాయుధము వచ్చుగా ఇట్టి తుచ్ఛునియెడల నా కోపమును వినియోగింపనేల?... ఇట్టి పనులకెల్ల శిష్యుఁడావశ్యకము......ఆ వెనుక హరిశ్చంద్రుని విషయమునందు కూడ పనికి వచ్చును. (నేలను జడలువేసి కొట్టి)

ఆ. వె. మునుపు దక్షయజ్ఞమును చెఱుచుటకయి
రుద్రు జడల వీరభద్రుఁ డవత-
రించినట్లుగా హరిశ్చంద్రు సత్యత
చెఱుప నాదు జడల శిష్య! పుట్టు. 14

[ ఒక శిష్యుఁడు పుట్టును. ]

శిష్యుఁడు—స్వామీ, పుట్టినాను.

విశ్వా—ఓరీ శిష్యా, నీకు సంపూర్ణజ్ఞానము కలుగును గాక! ఓరీ, క్షత్రియులకు తగిన పౌరుషకార్యములయందు నిన్ను వినియోగించుటకు నిశ్చయించినాను గనుక నీకు క్షత్రకుఁడని పేరు పెట్టెదను.

శిష్య—స్వామీ, క్షమించెదమన్నయెడల, మనవి చేసికొనెదను.

విశ్వా—భయము లేదు, చెప్పు.

శిష్య—స్వామీ. నేను నక్షత్రకుఁడను.

విశ్వా—ఏమీ, నీవు క్షత్రకుఁడవు కావా?

శిష్య—ఎట్లగుదును? జ్ఞానస్థానమైన శిరస్సునుండి పుట్టిన నేను బ్రాహ్మణుఁడను; గనుక నక్షత్రకుఁడను. క్షత్రియునే పుట్టింప వలెనన్నయెడల, భుజములనుండి ఏల పుట్టించినారు కారు?...ఇంకొక్క సంగతి కూడ ఉన్నది....మీకు కోపము వచ్చునేమో?

విశ్వా—సంశయింపకు; చెప్పు.

శిష్య—స్వామీ, మీవలన పుట్టిన నేను క్షత్రకుఁడనగుదునేని, మీరింకను క్షత్రియులని కిట్టని వారందురేమో?

విశ్వా—ఏమీ, నేనింకను క్షత్రియుఁడనా?...ఓరీ శిష్యా, ఇటు వినరా,

తే. గీ. అతితరోష్ణత గల మత్తపోగ్నివలన
కనకగర్భుని పెనుబొజ్జ కరఁగిపోవు-
చుండ, తండ్రీ కష్టము చూడనోడి యావ-
సిష్ఠుఁడే నన్ను బ్రహ్మర్షి చేసె సుమ్ము. 15

శిష్య—స్వామీ, అవును; అందుచేతనే తమవలన పుట్టిన నేను నక్షత్రకుఁడను. తమ శిష్యుఁడనైన నేనును మీవలెనే మొదట క్షత్రియుఁడననిపించుకొని వెనుక బ్రాహ్మణుఁడనైతిని. ఇది ఉచితమే కదా?

విశ్వా—ఓరీ నక్షత్రకా, నీ బుద్ధికి చాల సంతోషించినాను. ఇట్టి బుద్ధిశాలివి నీవు నా కార్యములను తప్పక సాధింపఁ జాలుదువు.

నక్షత్రకుఁడు—స్వామీ; హరిశ్చంద్రునిచేత బొంకించుటకు కదా నన్ను పుట్టించినారు? విధివశమున బ్రాహ్మణుఁడనై దయాదాక్షిణ్యాదిదుర్గుణములు కలిగి నేను పాడైనాను. కాబట్టి నేనంత ఉపకరించక పోవచ్చును. ఒక్క ఉపాయము

చెప్పెదను, వినుఁడు: పురుషులను బొంకించుటకు స్త్రీలను మించినవారు లేరు. ఎట్టి నియమములైనను వారి ఎదుట నిలువవు.

సీ. కిసలయపాణి మిక్కిలి పచ్చికాయ చే-
పట్టి చూపింపంగ పండె యనుచు,
భృంగాక్షి కాటుక దృష్టులతో చూప
నున్నంపు ముద్ద కస్తూరి యనుచు,
చంద్రికాహాస హాసంబొనర్చుచు కాకి-
నైనను చూపగా హంస యనుచు,
చంపకసమగాత్రి సరస నిలిచి చూపఁ-
గా వెండియైన బంగారమనుచు,
ఆఁడువారల గాలి రవ్వంత సోక
పురుషు లెప్పుడున్ తడఁబడి బొంకుచుంద్రు;
వలపు తలకెక్కఁ జేయుజవ్వని కనఁబడ,
నరకమే స్వర్గమనని యజ్ఞాని కలఁడె? 16

మీకీసంగతి తెలియనిదా?

విశ్వా—అన్నా! శిష్యా, మేనకావృత్తాంతము ఎత్తిపొడుచుచున్నావా?

నక్ష—స్వామీ, ఇది ఎత్తిపొడుపెట్లగును? మేనకాపరిగ్రహణమువలన చంద్రవంశమును నిలిపిన వారిలో ఒకరైనారు; అది ఎత్తిపొడుపునకు తగినదా?

విశ్వా—అది నిశ్చయమే కాని, అంతకు ముందు నేను పడిన పాట్లు ఎవ్వరెఱుఁగనివి? నేను బ్రహ్మర్షిత్వము సాధించుటకొఱకు చేయుచున్న తపస్సునకు తాళలేక దేవతలు మేనకను పంపగా, అప్పుడు నా తపము వేఱు విధముగా పరిణమింప లేదా?

మ. సతి శృంగారరసప్రవాహమున నే స్నానంబు గావించి, స-
మ్మతి నమ్మాసవతీవిలాసమునకున్ మానంబునున్ దాల్చి, ఆ
యతివన్ బొందఁగఁ గల్గుటెల్లొ యనుచున్ ధ్యానంబునున్ జేసితిన్:
లతికాంగీమణి యబ్బినంత తపమెల్లన్ బండె నాకయ్యెడన్. 17

నక్ష—అంతుచేతనే ఆ మేనకవంటి సొగసులాడిని పుట్టింపుఁడు. మీవంటి వృద్ధవిప్రుల నియమములచే నీళ్లు కాఱఁగా, ఇఁక హరిశ్చంద్రుఁడెంత?

విశ్వా—ఏ జాతి నాతిని పుట్టింపవలెను?

నక్ష—మీ యెడమ కాలి మడమతో నేలమీఁద తన్నుఁడు; మాల జాతి నాతి పుట్టును.

విశ్వా—మాలెతయే యేల కావలెను?

నక్ష—సద్యో మనకు లాభము. కాక రానిదైనయెడల, మఱల మేనకోపాఖ్యానమునకు వీలు కలుగదు.

విశ్వా—గడుసువాఁడవు...కానీ, అట్లే చేసెదను. (ఎడమ కాలి మడమతో నేల మీఁద తన్ని)

ఆ. వె. శివుని దాసుఁగాఁగ చేసికొనఁగ విష్ణు
కాల పుట్టినట్టి గంగ భంగి
నాదు కాల పుట్టు, నాతి! హరిశ్చంద్రు
దాసుగాఁగ నీకు చేసికొనఁగ. 18

(మఱల నేలమీఁద తన్నును.)

[ ఇద్దఱు మాలెతలు పుట్టుదురు. ]

మాలెతలు—స్వామీ, పుట్టినాము.

విశ్వా—ఇదేమి? ఇద్దఱు పుట్టినారు?

నక్ష—స్వామీ, మీరు కాలితో నేలను ఒక మాఱు తన్నుటకు మాఱు రెండు మాఱులు తన్నినారు. అందుచేత ఇద్దఱు పుట్టినారు. అయినను పోయినది లేదు. హరిశ్చంద్రునిమీదికి రెండు గుండ్లబారు ప్రయోగింప వచ్చును. మఱి వీరికి నామకరణము చేయింపుఁడు.

విశ్వా—అదియు నీవే కానిమ్ము...కాని, వీరెట్లున్నారు? హరిశ్చంద్రుని లోఁబఱచుకొనఁ గలరా?

నక్ష—నామకరణపు బాధ్యత నామీఁదనే వేసినారా? కానిండు...వీరు హరిశ్చంద్రునిమీఁదికి విడువవలసిన సమ్మోహనాస్త్రములు కదా? హరిశ్చంద్రుని పట్టమహిషి నామము చంద్రమతి కదా?......స్వామీ, వీ రెట్లున్నారని అడుగుచున్నారా? నేను మనవి చేయలేదా? వీరి బాహువులవలె వీరును ముట్టరాని మాలలగుటచేత మన పరువు దక్కినది.

తే. గీ. సుమనసులు మధురాధరసుధను గ్రోలు
చున్న కొలఁదిని కళలు తగ్గొందకుండ,-
నధికమౌ నీ నెలంతలయాననములు
చంద్రునకు మతి కలిగింపఁ జాలుఁ గాదె? 19

అందుచే పెద్దదానికి చంద్ర అనియు, చిన్నదానికి మతి అనియు పేరులు పెట్టుచున్నాను.

విశ్వా—ఇద్దఱి పేరులును కలిసి హరిశ్చంద్రుని భార్య పేరు కూడ తెలుసు. రానున్నది. ఓసీ చంద్రా, ఓసీ మతీ,

చంద్ర, మతి—స్వామీ, ఏమి సెలవు?

విశ్వా—మీకు సకలకళలును కరతలామలకములుగా కలుగునట్లు అనుగ్రహించుచున్నాను.

చంద్ర, మతి—మహాప్రసాదము.

నక్ష—మహాప్రసాదమనఁగానే సంబరము కాదు.

సీ. చూడంగ వలయును, శుకుఁడేనియును కచ్చ
వీడుదునట్లుగా వెంటఁ బడఁగ;
ఆడంగ వలయు నేర్పైన మాటల, నపుం-
సకుఁడు లొట్టలు వేయు చాడ్పుగాఁగ;
పాడంగ వలయును పాట, సంగీతపు
గొడ్డలియున్ చెవి కోసికొనఁగ;
ఆడంగ వలయు నాట్యము, మేళములు కూడ-
వనువారు కూడ వెంటాడి తిరుగ;
అభినయింప వలయు, సభికులు చిత్రంపు
బొమ్మలోలెను అట్టె సొమ్మసిల్ల;
నవ్వ వలయు జాజిపువ్వుటమ్ములు చిత్త-
జల్లుగాఁగ కురియు చందమునను. 20

చంద్ర } —చిత్తము.
మతి }

విశ్వా—ఓసీ చంద్రా, ఓసీ మతీ, మీకు మా ఆశ్రమమునకును అయోధ్యకును నడుమ నందనవనము వంటి ఒక ఉద్యానమును సృజించితిని: పోయి దానిలో ముద్దుముచ్చటల పొద్దు పుచ్చుచుండుఁడు. పని పడినప్పుడు తెలుపుడు చేసెదను.

చంద్ర } —చిత్తము. (నిష్క్రమింతురు.)
మతి }

విశ్వా—నక్షత్రకా, అయోధ్యకు పోయి హరిశ్చంద్రుని పరీక్షింతము, రమ్ము. అతఁడు యజ్ఞమును పరిసమాప్తి నొందించి ఉన్నాఁడు.

నక్ష—చిత్తము.

(విశ్వామిత్రనక్షత్రకులు నిష్క్రమింతురు.)

---

[ ద్వితీయరంగము—అయోధ్య: యజ్ఞశాల. హరిశ్చంద్రుఁడు, సత్యకీర్తి, గణపతి, మొదలగు వారు ప్రవేశింతురు. ]

సత్యకీర్తి—హరిశ్చంద్రసార్వభౌమా, మొదట చేసిన దిగ్విజయమువలనను, వెనుక కావించిన రాజసూయయజ్ఞమువలనను, ఏలినవారి పేరు ఎల్ల విధములను సార్థకమైనది.

తే. గీ. హరి కరణి దుర్నిరీక్ష్యమైనట్టి తేజ-
ముననుఁ పరరాజకాంతులన్ పోనణంచి,
చంద్రుగతి నాశ్రితద్విజసంఘమునకు
కడుపు నిండించితిరి తృప్తి కలుగునట్లు.

హరిశ్చంద్రుఁడు—మంత్రీ, సత్యకీర్తీ, యజ్ఞము పరిసమాప్తి అగుటచేత నా మనస్సు ఎంతో నిర్మలముగా ఉన్నది సుమా,

తే. గీ. జీవనముల నాశించి నన్ చేరినట్టి
ద్విజతతిని పూర్తిగాఁగ సంతృప్తి పఱచి,
మలినత దొలంగి, నేను నిర్మలత వడయఁ
గలిగినాఁడ సుమీ శరద్ఘనుని సరణి. 22

గణపతి—మిత్రమా, హరిశ్చంద్రా, ఎంత తెలివితక్కువవాఁడవయ్యా! వద్దు వద్దంటూ నేనెంత చెవినిల్లుకట్టుకొని పోరుతూ ఉన్నా వినక ఉన్న ధనమంతా దానాలక్రింద చేతులారా పాడు చేసుకొన్నావు. అందుచేత నీ కోశము కళవిశా వ్యం లాగు నిరర్థకమైంది. నీవూ నా లాగే దరిద్రుఁడవయిపోయావు.

హరి—చెలికాఁడా, గణపతీ, అట్లు కాదు.——

గణ—అట్లు కాదు ఒబ్బట్లు, నీ డబ్బంతా దిగమింగినవి. అబ్బా! అవేం సంతర్పణలు! ఏం దానాలు! ముందు చూపే కాని వెనుక చూపు లేనే లేను కదా? అంత సివమా?

హరి—గణపతీ, నేను దరిద్రుఁడ నెట్లగుదును? అస్థిరమును హేయమును అయిన ధనమును దానము చేసి స్థిరమును దివ్యమును అయిన పుణ్యధనమును ఆర్జించిన నేను ఎంతో భాగ్యవంతుఁడను.

గణ—వహవ్వా! వహవ్వా! ఏం భాగ్యం! ఈ పుణ్యధనం ఎందుకు పనికి వస్తుంది? కట్టనా? కుడువనా? ఈ ధనంతో రెండు సేర్ల లాడూలయినా రావు. ఓయీ మిత్రమా, నామాట ఇప్పుడైనా విను. నిష్కారణంగా చెడిపోకు. నిర్ధనుఁడే నిరర్థకుఁడు. కాఁబట్టి ఈ యజ్ఞంలో జరిగిన దానాలు నీ ఆజ్ఞ లేనిదీ మంత్రి పొరపాటు చేత జరిగాయని చెప్పి ఆ డబ్బు తిరిగి రాఁబట్టు.

హరి—ఓయీ గణపతీ, నా సంగతి తెలియని వాని వలెనే మాటలాడుచున్నావేమి?

క. ఇనచంద్రులు గతులన్ త-
ప్పినను, కులాచలములెల్ల బిట్టుగ చలియిం-
చినను, జలధి కదలిక మా-
నినను, హరిశ్చంద్రుఁ డాడునే యనృతంబున్? 23

సత్య—మహారాజా, ఏలినవారి దర్శనమునకై అదిగో, విశ్వామిత్రమహర్షి శిష్యసమేతముగా వచ్చుచున్నట్లున్నది.

హరి—సత్యకీర్తీ, నీవు ఎదురుగా వెళ్లి వారిని భక్తితాత్పర్యములతో తీసికొని రమ్ము.

సత్య—చిత్తము. (నిష్క్రమించును.)

హరి—గణపతీ, ఆ అర్ఘ్యపాద్యములను ఇటు కొని వచ్చి సిద్ధముగా ఉండుము. మునీశ్వరుని పూజింతము.

గణ—అల్లే తీసుకు వస్తాను. (అర్ఘ్యపాద్యాదులను తెచ్చును.)

[సత్యకీర్తి విశ్వామిత్రనక్షత్రకులతో ప్రవేశించును.]

విశ్వా—నక్షత్రకా, ఈ చక్రవర్తిని చూడుము.

తే. గీ. అధ్వరంబొనరించినయపుడు తాల్చి-
నట్టి పసుపుపచ్చని పట్టు బట్టతోడ,
ఒప్పుచున్న వాఁడీపురుషోత్తముండు:
యజ్ఞశాల వైకుంఠంబునట్లు తనర. 24

నక్ష—స్వామీ, ఏమో కాని ఈ మహనీయుని సౌమ్యరూపమును చూడఁగా నాకీతనియందు మితి లేని వాత్సల్యము కలుగుచున్నది.

విశ్వా—ఓహోహో! దీని వలన ముందు కార్యమునకు భంగము. కాఁబట్టి అట్టి బుద్ధి నీ మనస్సునుండి తొలఁగింపుము.

[విశ్వామిత్ర నక్షత్రకులు సమీపింతురు.]

హరి—విశ్వామిత్రమునీశ్వరా, త్రిశంకుపుత్రుఁడు హరిశ్చంద్రుఁడు మ్రొక్కుచున్నాఁడు.

విశ్వా—నీకు జయమగును గాక! రాజా, నే జాగు చేయుటకు వీలు లేదు. నీకడకు ఒక కార్యార్థినై వచ్చితిని. నా కోరిక తప్పక తీర్చెదనని మాట ఇయ్యవలెను.

గణ—నీటిలో గేదెను పెట్టి బేరమేనా?

విశ్వా—అడ్డుగా ఇతఁడెవ్వఁడు?

గణ—అడ్డుగా ఎవ్వఁడుంటాఁడో ఆ పేరింటిగాణ్నే నేను. నా లంబోదరాన్ని చూచి కూడా నేను గణపతినని పోల్చుకో లేని త్రికాలజ్ఞత్వం, హాస్యం చేత కాని నా విదూషకత్వం లాగే హాస్యాస్పదం.

హరి—గణపతీ, ఊరకుండుము. అందఱయొద్దను ఒక్కవిధపు స్వాతంత్ర్యమేనా? అయ్యా, మునీశ్వరా, మీరు నాకసాధ్యములైన కోరికలు కోరరు కాఁబట్టి మీ కోరిక ఎట్టిదైనను తీర్చెదను.

విశ్వా—రాజా, నీ ఔదార్యము ప్రశంసనీయము. నాకు యాగార్థము అర్థము కావలసివచ్చినది. ఏనుఁగు మీఁద మనుష్యుఁడు నిలువఁబడి రత్నమును గోటితో మీటినంత పొడుగు బంగారు నాణెముల కుప్ప ఉన్నయెడల నా యజ్ఞము సాగిపోవును. ఇది నీ వలన కోరిన సహాయము.

గణ—మహానుభావా, నా కొక్క చిన్న సందేహం కలుగుతూ ఉంది. ఎగమిటి నంత పొడుగా? దిగమిటినంత పొడుగా?

విశ్వా—(కన్ను లెఱ్ఱచేసి) ఏమీ, మా మాట నీకు నవ్వులాటగా ఉన్నదా?

గణ—స్వామీ, నవ్వులాటగానే ఉంది. రాజసూయయజ్ఞంలో కొవ్వి పోతరించి ఉన్న ఎక్కడ లేని బాపన పెయ్యలను మేపడం లోనూ దానం చెయ్యడం లోనూ తన ధనాన్ని ఎల్లా వెచ్చించి, చేతులు కడుగుకొని ఉన్న ఈయన ధనాగారం ఇప్పుడయ్యవారి నట్టిల్లయింది. ఇట్టి దశలో ఈయన మిమ్మల్ని శూన్యహస్తాలతోనూ శుష్కప్రియాలతోనూ మాత్రమే గౌరవించఁ గలఁడు కాని అంత ధనం ఎక్కడనుంచి తేఁ గలఁడు?

విశ్వా—ఏమీ, ఈయన తన ద్రవ్యమునంతయు దానము చేసి రిక్తుఁ డయ్యెనా?

క. దానంబుచే దరిద్రుఁ-
డైన నరుఁడు తొంటి కంటె నతితరశోభన్
పూనును: కొమ్మలు నఱికిన
పైనే చందనపు మ్రాను పరిమళ మూనున్. 25

నేనీసంగతి ఎఱుఁగక అసమయమందు వచ్చినాను. ఓయీ హరిశ్చంద్రా, సాటి లేని నెఱదాతవు. నీ వంటి వానికి నిష్కారణముగా బాధ కలిగించుట నా ఉద్దేశము కాదు. కావున నిన్ను ధనము నేను అడుగను లేదు; నీవు ఇచ్చెదనని అనను లేదు. నేను పోయి వచ్చెదను. (పోఁ బోవును.)

హరి—తాపసేంద్రా, అట్లు కాదు. ఆగుఁ డాగుఁడు. మాట జాఱినది; ఇఁక ఎట్లు తప్పును?

విశ్వా—తప్పుట కేమున్నది? నీవన లేదని నేనే ఒప్పుకొనుచున్నాను కానా?

హరి—మీరు నామీఁది దయచేత అట్లు ఒప్పుకొనినను నేనబద్ధమెట్లాడఁ గలను?

తే. గీ. ఇచ్చెదనటంచు భువినెల్ల నిచ్చెను బలి;
ఇచ్చెదనటంచు దేహంబు నిచ్చెను శిబి;
ఇచ్చెదనటంచు ప్రాణంబు నిచ్చె ఖేచ-
రుండు: మాట తప్పుదునె నే రూకలకయి? 26

విశ్వా—ఓయీ హరిశ్చంద్రా, ఇందులో మాట తప్పుట ఎక్కడిది? నీవు పొర

పడుచున్నావేమో కాని నీవు నాకెప్పుడును రూకలనిచ్చుటకు ఒడంబడ లేదు. ఏమి గణపతీ, ఈయన నాకు ధనము నిచ్చుటకు ఒప్పుకొనెనా?

గణ—ధనం లేని రిక్తదశలో ఆయన అలాంటి మాట ఎట్లా అని ఉంటాఁడు? అంటే అది వెఱ్ఱివాఁడి మాటకిందే లెక్క? అన లేదు సరే కదా, అన తలఁచు కోనూ లేదు. ఆయనను మఱి బాధ పెట్టక మీ దారిని మీరు నడవండి.

విశ్వా—హరిశ్చంద్రా, వినుచున్నావా? మీ వాఁడే ఏలాగనుచున్నాఁడో? నీవు నిశ్చయముగా నాకు ధనమునిచ్చెదనని అన లేదు. జ్ఞాపకము తక్కువ చేత ఆలాగు అనుకొనుచున్నావు?

హరి—ఋషిసత్తమా, నేను ధనమునిచ్చెదనని అన లేదు కాని మీ కోరిక ఎట్టిదయినను తీర్చెదనని అన్నాను; మీరు నన్ను ధనము కోరినారు.

విశ్వా—నేను కోర లేదు. ఏమి నక్షత్రకా?

నక్ష—సర్వసంగపరిత్యాగులు మీరు ధనము ఏమి చేసికొందురు?

విశ్వా—గణపతీ, నీవేమందువు?

గణ—మీరు కోరిక లేని వాళ్లు; ఆయన ధనం లేని వాఁడు. ఇక ఏలాగు కోరి ఉంటారు? గొడ్డుది నపుంసకుడి వల్ల సంతానం పొంద కోరినట్టే ఉంది.

విశ్వా—రాజా, నీ అనుమానము తీఱినదా?

హరి—మునీశ్వరా, నాయందలి కృపవలన మీరును, ప్రేమవలన గణపతియు, ఇట్లు లేదనుచున్నను నేనేలాగున ఒప్పుకొనఁగలను? మీరు యాగముకొఱకు నన్ను ధనము అడుగ లేదా?

విశ్వా—ఆహాహా! నేనడుగ లేదు. ఓయీ రాజా, నాకు నిష్కారణముగా ఏల కోపము తెప్పించెదవు? నీ మేలు కోరి చెప్పిన మాటలును నీకు రుచింపని ఈ పైత్యమేల? నా మాట విని నీవు నాకు ధనమీయనక్కఱ లేదనుము.

హరి—స్వామీ, మీరు నా మేలు కోరియే చెప్పుచున్నారు కాని నేనబద్ధమునకు ఒడిగట్టఁ లేను.

విశ్వా—(కన్నులెఱ్ఱఁజేసి) ఆఁ! ఏమీ?...ఓ రాజా, మఱల చెప్పుచున్నాను. చెడిపోక నా మాట విను. నాకు కోపము తెప్పించుట నీకు ముప్పు.

హరి—స్వామీ, మీకు కోపము వచ్చినను సరే; నా నాలుక అసత్యమునకు ఒడంబడదు. మీకు నేను ధనము ఈయ వలసి ఉన్నది; కొద్ది దినములలో ఇచ్చెదను.

విశ్వా—(పండ్లు పటపటఁ గొఱుకుచు) ఆహా! ఏమి నీమూరకము? నా క్రోధ మెట్టి దో ఎఱుఁగకున్నావు!

చ. అలుకను చెందినట్టి మదనాంతకు మూడవ కంటియందె మం-
టలు జనియించి భస్మమొనర్చును వైరి, నదేమి గొప్ప? పే-
రలుకను చెందినట్టి కుశికాత్మజు కన్నుల రెంటియందు మం-
టలు జనియించి భస్మమొనర్చు త్రిలోకములన్ క్షణంబులో.

రాజా, మొదటినుండియు నీ వంశపు మేలు కోరిన వాఁడను గనుక ఇంత దూరము చెప్పుచున్నాను. లేకున్న యెడల, ఇట్టి మూర్ఖపాశమును ఇంత సేపు సహింతునా?

హరి—స్వామీ, మీ రిట్లు కినుక చూపిన నేనేమి చేయఁ గలను? సర్వధర్మములను ఉపదేశించు తమవంటి పెద్దలే నన్నబద్ధములాడుమనియెదరా?

ఆ. వె. తండ్రి మాటకంటె తద్దయు గురువుల
పలుకె పెద్ద; గురుల పలుకు కంటె
నిజమె హెచ్చు; కాన నిజము నిమిత్తము
గురుల పలుకు మీఱఁ గూడఁ గాదె? 28

మీరు మా వంశపు మేలు కోరిన వారు గనుకనే నా సత్యమును నిలువఁబెట్ట ప్రార్థించుచున్నాను. అదియే మీరు నాకు చేసెడు గొప్ప మేలు.

విశ్వా—(హుంకరించుచు) ఓరీ మూర్ఖుఁడా, ఎంత కృతఘ్నుఁడవురా! మీ వంశమునకు మేలు చేసిన వాఁడననఁగా, ఆ మేలెట్టిదో జ్ఞప్తికి తెచ్చుకొనకున్నావు. నీ తండ్రికి గతి లేక పోఁగా బొందితో స్వర్గమిచ్చిన దెవ్వరు? ఆ ఉపకారమైనను తలఁచి, నీ మేలు కోరి నేననుమన్న మాట అన కూడదా?

హరి—మహాత్మా, మాతండ్రిగారి ననుగ్రహించినట్లే నాయందును కరుణచూప ప్రార్థించుచున్నాను.

తే. గీ. స్వర్గసోపానములలోన సత్యగుణమె
మొదటి; దదియె నశించిన పిదప, మిగిలి-

నట్టి మెట్టు లెట్టులు నిల్వ ననువుపడును?
సత్యమును నిల్పి నాకును స్వర్గ మిమ్ము. 29

విశ్వా—మీ తండ్రికి స్వర్గమిచ్చిన దానికి ఇంత కృతజ్ఞత చూపించుచున్నావు కదా? ఇఁక నీకీయవలెను. ఓరీ మదాంధా, నా మాట నిర్లక్ష్య పెట్టినావు గనుక, ఇదిగో నీ వంశమునకు నేను చేసిన మేలును త్రిప్పివేయుచున్నాను...(మీఁదికి చూచి) ఓ త్రిశంకూ, నీకు స్వర్గభ్రష్టత కలుగును గాక!

అందఱు—హా హా హా హా!

నక్ష—స్వామీ, అదెవ్వఁడో ఒక మాలవాఁడు తల క్రిందికిని కాళ్లు మీఁదికిని పెట్టి పైనుండి నేలకు పడుచున్నాఁడు.

విశ్వా—వాఁడే ఈ కృతఘ్నుని తండ్రి, త్రిశంకుఁడు; పూర్వము నాచేత క్రొత్త స్వర్గమున నిలుపఁబడిన వాఁడు. ఇప్పుడు తన పుత్రుని సత్యసంధతవల్ల అధోగతి పాలగుచున్నాఁడు.

హరి—దైవమా, నిరపరాధినైన నావలన తండ్రిగారికి ఎట్టి ఇక్కట్టు సంభవించుచున్నది!

[పూర్వోక్తప్రకారము త్రిశంకుఁడు నేల పడుచున్నాఁడు.]

త్రిశంకుఁడు—ఓహో విశ్వామిత్రభగవానులవారు! స్వామీ, త్రిశంకుఁడు నమస్కరించుచున్నాఁడు.

హరి—(తనలో) అహా! మాటల స్వచ్ఛత ఒక్కటియే నా మాలతనము పొందకుండినది? తండ్రిగారగుటచేత ఏ అవస్థలోనైనను వీరు నాకు వందనీయులే. (ప్రకాశముగా) తండ్రీ, మందభాగ్యుఁడు నీ కుమారుఁడు హరిశ్చంద్రుఁడు మ్రొక్కుచున్నాఁడు.

త్రిశంకు—నాయనా, దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము. నీవు కూడ ఇక్కడనే ఉన్నావా?...ఓహో! ఇది మన అయోధ్యయే...ఇదిగో, మంత్రి పుత్రుఁడు సత్యకీర్తి......అబ్బాయీ, హరిశ్చంద్రా, నీకు ఏమైనను సంతానమా?

హరి—తండ్రీ, దేవతల కరుణ వలన రోహితాశ్వుఁడను పౌత్రుఁడు మీకొకఁడు కలఁడు.

త్రిశంకు—అట్లయిన, మేము నీటి బొట్టులకు భయపడ వలసిన అవసరము లేదు.

విశ్వా—ఓయీ త్రిశంకూ, వెఱ్ఱి పడుచున్నావు. ఈ కొడుకు వలన స్వర్గభ్రష్టత కలిగినదా? ఇఁక వీని కొడుకు వలన ఏమి కలుగునో!

త్రిశంకు—ఏమి, నాకు స్వర్గభ్రష్టత కలిగినదా? దానికి నా కొడుకే కారణమా? ఏదో పని ఉండి, మీరు నన్నుదించితిరనుకొనుచున్నాను.

విశ్వా—నిన్నుదించినది నా మహిమ కాదు; నీ కుమారుని సత్యసంధత. తన మేలు కోరి నేననుమన్న మాట ఇతఁడనక పోయినందుకు ఫలము. ఇంకను అనక భీష్మించి కూర్చుండినయెడల నీకధోలోకప్రాప్తి తప్పదు.

త్రిశంకు—అబ్బాయీ, హరిశ్చంద్రా, వశిష్ఠపుత్రులవలన మాలతనమును పొందిన నాచేత ఎవ్వరును యజ్ఞము చేయించని కాలమున ఈ మహామహుఁడు నామీఁద కరుణించి బొందితో స్వర్గమునకు పంపి, మాలతనమున్నదని దేవతలు నన్నచ్చటినుండి త్రోసి వేయగా ఈయన క్రొత్తస్వర్గమొకటి కల్పించి, అందు నన్ను నిల్పెను. ఇట్టి పరమోపకారిమాట త్రోసి వేయక నాకు స్వర్గమును నిలువఁ బెట్టుము.

విశ్వా—అబ్బో! నీ కొడుకు కొఱుకరాని కొయ్య. నిజము కంటె గురువు పలుకు తక్కువని నా ఆజ్ఞ అతిక్రమించినాఁడు; గురువు పలుకు కంటె తండ్రి మాట తక్కువే అఁట.

త్రిశంకు—అబ్బాయీ, ఏమి, మాటాడవు? నన్నధోలోకమునకు పొమ్మందువా? ఒక్కమాటకోసమే ఇంత ఆలోచించుచున్నావేల? మాట అనగా ఏమి? వట్టి గాలి. అట్టి గాలి పాపపుణ్యములకు ఎట్లు మూలమగును? ఊపిరి విడుచుచున్నపుడును, ఆవులించినపుడును, నిద్రయపుడును ఎంత గాలి పోవుట లేదు? మాట వలన నీకు పోవునవి వట్టి తుంపురులే కదా? అది గాక గురువుగారు అనుమన్నది అబద్ధమేల అగును? నీవే పొరపడి ఉందువు. తండ్రి అడుగుకొనుచున్నాడని అయినను ఆలోచింపుము......ఇదిగో, నా దిగువ భూమి బ్రద్దలగుచున్నది. అయ్యో! అమ్మో! నేను నరకమునకు పోవలసినదేనా?

హరి—(తనలో) ఆహా! భగవంతుఁడా, ఎట్టి అవస్థ తెచ్చి పెట్టితివి!

మ. తనువున్ ప్రాణము నాకు కల్గుటకు నాధారంబె యైనట్టి తం-
డ్రి నధోలోకమునందు చేయుమని ఈ రీతిన్ విసర్జింతునా?
తనువున్ ప్రాణముకంటె ఎక్కుడగు సత్యంబున్ విసర్జింతునా?
వెనుకన్ నూయియు ముందు గోయియు నుత్రవ్వెన్ కౌశికుండయ్యయో!

ఏమి చేయుదును? ఆహా దైవమా! అదిగో, తండ్రిగారప్పుడే అథోలోకమున కు పోవుచున్నారు.

త్రిశంకు—హరిశ్చంద్రా, హరిశ్చంద్రా, నన్నీగతికి విడిచిపెట్టనే విడిచి పెట్టితి వా? తండ్రి అని అయినను జాలి లేదా? కనుకొన్నందుకు ఈ మాత్రము మాట నిలువఁ బెట్టవా?

విశ్వా—ఓయీ హరిశ్చంద్రా, నేను మఱి చెప్పఁ దలఁచుకొనక పోయినను నీ తండ్రి అవస్థ నన్నూరకుండనీయకున్నది; నీవు నాకు ధనము ఇయ్యనక్కఱ లేదనుము. నీ తండ్రికి అథోలోకము తప్పించుటయే కాక నిజస్వర్గమును ఇప్పించెదను; నీకును స్వర్గము కలిగించెదను.

గణ—మిత్రమా, బాగుంది. నీవు దేని కోసం సత్యం పలకడం మాననంటూ ఉన్నావో ఆ స్వర్గమే వస్తూ ఉండగా, ఇఁక ఈ అనుమానం ఎందుకు?

హరి—గణపతీ, నేను ఫలాపేక్షతో సత్యనియమమును పూన లేదు. సత్యము పలుకుటయే స్వర్గము.

త్రిశంకు—ఓరీ మూర్ఖుఁడా, అట్లయిన యెడల నన్ను త్యజించెదవా? నీ పేరు చెప్పుకొని ఏడ్చుచు నేను నరకములో పడి ఉండవలెనా? నిన్ను బదులుగా నేనొక మంటి ముద్దనో, కఱ్ఱ చెక్కనో, రాతి బండనో, కనియుండిన యెడల ఇంతకంటె నయము...అయినను నీ దుర్మార్గత ఊరకే విడువఁ కూడదు. ఇదిగో శాపము. నా వలెనే నీవును మాలవాఁడవై కొడుకు మూలమున దుఃఖింతువు గాక!

హరి—తండ్రీ, నేనసమర్థుడను; ఏమైనను అసత్యమాడ లేను. మాలతనము వచ్చిన కారణముచేత మీస్వభావము మాఱినది గాని మీరు మాత్రము సత్యమును మానుమన వలసిన వారా? సత్యమే వ్రతముగా పూని సత్యవ్రతుఁడని మొదట ప్రసిద్ధి చెందిన వారు కారా? బొందితో స్వర్గమునకేగెదనన్న మాట నిలువఁ బెట్టుకొనుటకే కదా మీరు మాలతనమును పొందినారు. మీకొడుకునై నేను మాత్రము మాట ఎట్లు తప్పఁగలను? తండ్రీ, మాట వినక పోయినందుకు నన్ను క్షమించుఁడు. మీకు మఱల స్వర్గము కలిగించుటకు నా చేతనైనన్ని పాట్లు పడెదను.

అందఱు—హా హా హా హా! [త్రిశంకుఁడు క్రిందికి అదృశ్యమగును.]

నక్ష—(తనలో) ఓహో! ఇది గదా నియమము! ఇట్టి స్థిరచిత్తున కేల అపజయము కలుగును.

విశ్వా—ఛీ! ఇట్టి చండాలుని యూర ఉండ రాదు. నక్షత్రకా, రమ్ము పోవుదము.

[విశ్వామిత్ర నక్షత్రకులు నిష్క్రమింతురు.]

హరి—సత్యకీర్తీ, అయ్యో! ఎంత పని జరిగినది! వశిష్ఠభగవానులవారి యొద్దకు వెళ్లుటకు తగిన ప్రయత్నములను చేయుము. గణపతీ, రమ్ము. దేవికి ఇది నివేదింతము.

[అందఱు నిష్క్రమింతురు.]

ప్రథమాంకము సంపూర్ణము.



శ్రీ

# చిత్రహరిశ్చంద్రీయము.

## ద్వితీయాంకము.

[ప్రథమరంగము—అయోధ్య; రాజాంతఃపుర బహిర్ద్వారము.
కాకి అను ముసలి దాసి ప్రవేశించును.]

కాకి—(తలుపు తట్టుచు) తలుపు, తలుపు; తలుపోయి, తలుపు; తలుపు తియ్యండి......అదిగో, ఎవరో తిరుగుతున్న సవ్వడౌతుంది; తలుపు తియ్యరేటి?......తలుపు, తలుపు.

[తెరలో—"ఎవరది?"]

ఎవరా? ఎవరైతే ఏటి? తలుపు తియ్య రాదా? తెల్లారుతుందే, ఇప్పుడే దొంగలొస్తారు?

[తెరలో—"అంతఃపురం తలుపు, పేరు సెప్పకుండా తీస్తారా?"]

అంతఃపురం తలుపైతే మాత్రం? ఆడోళ్లు కాకుండా ఇలాగ గబగబ గుస్తారా ఏటి?...పేరెందుకు సెప్తంటున్నారో నాకు తెలుసు. ఎక్కిరిస్తే గాని దూసుపోదు గావాల?

[తెరలో—"హుష్ హుష్? తెల్లారుగట్లా ఈ కాకి అలుపు ఏటి?"]

అదిగో, తెల్లారుగట్లా కాకి అలుపంట! నా పేరు కాకైతే నీకేం? పడుస్తనం ఉంటే వరాసికాలకి ఒయిసుకాళ్లని సూసుకోవాల. ఒలే సరసా, అట్టె అట్టేలు పెట్టక తలుపు తియ్యి.

[తలుపు తీసి సరస పైకి వచ్చును.]

సరస—కాకమ్మవ్వా, నువ్వా? ఇంత పొద్దున్నే ఎక్కడ కాడినుంచి ఒస్తున్నావు? రేతిరి అంతఃపురంలో పడుకోలేదూ?

కాకి—లేదే. ఒనంతం పండుగొచ్చింది గదా? మా అమ్మిని అల్లుణ్ణి తీసుకొద్దాం అని ఊరికెళ్లాను.

సరస—మా నేస్తం కోకిల ఒచ్చిందా?......అయితే అవ్వా, నిన్ను ఒక్కటడగాలని శానాళ్లనుంచీ ఉంది; కోం పడక సెప్పు: నీ పేరు కాకి గదా, దానికి కోకిలని ఎందుకు పేరెట్టావు?

కాకి—తప్పంటే?

సరస—తప్పని కాదు. ఆ పేరెట్టక పోతే మన గణపతయ్య ఆ అష్టదిక్షప్పద్దాం సెప్పక పోనా?

కాకి—ఏటి ఆ పద్దెం?

సరస—ఇను మఱి:

“ తే. గీ. కాకి పెంచఁగా పెరిగిన కారణమున
కోకిలపటన్న మాటయే కాక, మధుర
కాకలీస్వరమ్మున కూడ కోకిలమవు;
ప్రియుల మోవి చిగుళ్లకు ప్రీతి పడవె? ” 81

కాకి—ఆ శ్లాకోళప్పంతులు ఆస్యాసికి అద్దెక్కడిది? రాజుగార్నే నోటి కొంతోస్తే అంతంటాడు....దాని కేం గాని ఈయేళ నగరా వాఁగడం లేదేమి?

సరస—అయ్యో! నా నవ్వులాట కాలిపోనూ! ఇది ఇసార సమయం అన్నమాటే మఱిసి పోయాను. నిన్న మనసెక్కరవర్తిగోరి తండ్రిగోరు సొర్గం నుంచి పడిపోయారంట; అందుకు ఊరల్లా దుక్కంలో మునిగి ఉండాలని రాజుగోరి ఆగ్న. మళ్లీ తండ్రిగోరికి సొర్గం ఎలాగొస్తుందో అ మార్గం కనుక్కోడానికి సెక్కరవర్తిగోరు ఆరి గురువులు ఒసిష్ట దగ్గిర కియేలే ఎల్తారంట.

కాకి—మఱి ఇలాంటి ఇసారసమయంలో ఈ బగ్గుండ ఒసంతకం కలపడానికి పట్టుకొన్నావేటోలే? మొగోళ్లు ఎవ్వరైనా నూస్తే ఒయిస్సెక్కలాగిస్తారు సుమా.

సరస—ఇది బగ్గుండ కాదవ్వా, కానీకుంకం. మన సెక్కరవర్తిగోరి రాణీగోరున్నారే సెందరమతమ్మ, ఆ అమ్మగోరికి కొన్ని రోజులమంచీ మా సెడ్డ కలలొస్తున్నాయి. అటి నుంచి సెక్కరవర్తిగోరికి ఏదైనా ఆపద జరుగుతాదేమో అని అమ్మగోరు కూడా ఒసిసు ఉన్న అడివికెళ్లి, అక్కడ ఆ మునీస్సొరుడి బారియా ఉండే అరుంజోతి, ఆవిడను పూజ్చేస్తారంట. అందుకోసం కుంకం, పసుపూ, పళ్లూ, జాగర్తెట్టున్నాను.

కాశి—మంత్రి ఎల్తాడంటే?

సరస—మంత్రి మాత్రం ఎళ్లఁడు. ఎవఁడో కోవగొట్టు మునికి సెక్కరవర్తిగోరు వదేలో ఎన్నో బంగారం కాసులు ఇయ్యడానికి ఒప్పుకున్నారు. సరుకులమ్మి సొమ్ము పోగు సెయ్యడానికి మంత్రి ఊళ్లోనే ఉంటాఁడు.

కాశి—అయితే మళ్లి మారాజుగోరు ఎప్పుడొస్తారు? గురువులున్న అడివి ఎన్నాళ్ల పయానం?

సరస—అబ్బే! ఎన్నాళ్లో ఎందుకు? కోవగొట్టు ముని అన్నానే, అతగాఁడి అడివి దాటఁగానే ఒసిస్తుది. ఇంకొక్క గడెకో గడెకో బైల్దేర్తారా, మద్దాన్నగట్ల ఎండపూట మద్దిలోవను ఒండుకు తిని పొద్దోగట్లకు అక్కడికి సేరుకొంటారు. మళ్లి రేపు రేతిరికో ఎల్లుండి పొద్దుటికో ఇక్కడుంటారు.

కాశి—రదాల మీఁదెక్కి ఎల్తారా, సవారీల మీఁద ఎల్తారా?

సరస—అమ్మగోరూ, అబ్బాయిగోరూ, సవారే ఎక్కుతారు. రాజుగోరు రదం ఎక్కుతారు. పొద్దుట మాత్రం రాజుగోరు ఏమీ ఎక్కరు; కాల్నడకనే ఎల్తారు. ఆరికి బైటి పల్లెలు ఎలాగు ఉన్నారయో సూడాలని ఉందంట......బాబూ! ఆరి ఎనకాతల నడ లేక గణపతయ్య కడుపు కరుఁగుతాది. (విఱుగఁబడి నవ్వును.)

కాశి—ఏం ఇఱగఁబడి నవ్వుతావే! అతగోఁడు సూడఁగలఁడు సుమా. నువ్వు తన్ని ఒలిసావనుకుంటాఁడు, మా ఒల్లమాలిన సరసుఁడు; దాసీలందరితోనూ సరసాలే ఆడ్తుంటాఁడు.

సరస—ఎంతాడినా నోటి సరసాలే కదూ. పెద్ద బావగోరు ఆడంగులలోనే జమ అన్నట్టు అతగోడికెవరు బయపడ్తారు?

కాశి—మాటలు కాక బావనయ్యా, బమ్మసారీ, అతగోఁడు నిన్ను సెల్లాడుతాఁడే? పద పద.

[ఇద్దఱును నిష్క్రమింతురు.]

---

[ద్వితీయరంగము—త్రోవలో ఉద్యానవనపు వయిభాగము. హరిశ్చంద్రుఁడు, గణపతి, భటులు మొదలైన వారు ప్రవేశింతురు. దూరమున రథములును పల్లకీలును.]

గణ—మిత్రమా, హరిశ్చంద్రా, మీఁద నెత్తి, నడుమ కడుపూ, క్రింద కాళ్లూ ఒక్కలాగు మండుతూ ఉండడంచేత మధ్యాహ్నం అయిందని తెలుస్తూ ఉంది.

పొద్దుట కడుపున పడ్డ చద్ది ముద్ద, కాళ్లతో పాటు అరిగి పోయింది. సూర్యుడూ ఆకాశవు వెన్నంటుకొన్నలాగే నాకు కడుపు వెన్నంటుకొంటూ ఉంది. ఇక జన చేసి భోజనవదుపాయం జరిగిస్తేనే తప్ప మాటదక్కదు.

హరి—అవును; వేడికిరణములవేల్పు మింటి నడుమకే చేరెను. అందుచేతనే,

ఉ. రాతిరి తన్ను పాయుట కరంబును గుంది, ప్రభాతవేళ సం-
ప్రీతి తలిర్ప తన్ననుసరించి క్రమంబుగ చేర వచ్చు ఛా-
యాతరుణీమణిన్ రవి ప్రియంబున డెందము చేర్చుకొన్నయ-
ట్లీతతి ఛాయ యెల్లెడ నదృశ్యత చెందె దినార్ధమాటచే. 32

గణ—చద్ది ముద్ద సత్తువ చేత ఏపుగా ఎదిగిన నీడ ఇప్పుడు తిండి లేక కృశించిపోయి కనబడడం మాని వేసింది. ఇప్పుడు కొద్దిగా అన్నరసం చేరినట్టాయెనా, కొంచెం కొంచెం తేలుకొని సాయంకాలానికి తిరిగి ఎప్పటి ఏపూ తేలుతుంది.

హరి—ఓయీ, ఇదిగో బస చేయుదము......ఆహా! ఏమి ఈపిల్లగాలి చల్లదనము! ప్రాణము లేచి వచ్చుచున్నట్లు వీచినది.

క. పుష్పధూళిలో పొరలి, కా-
లువ నీళ్ల తుళ్లిచున్ కడున్ మందుండై
పవమాన బాలుడొక్కిం-
త వినోదము నొదవ జేసె నా మనమునకున్. 33

గణ—మిత్రమా, ఇక్కడ ఏదో ఉద్యానం ఉందయో; అందులోనిదే ఈ గాలి.

హరి—అవును; నేనును అదే చూచుచున్నాను. ఈ పుష్పోద్యోట ఇంతకు ముందు ఇక్కడ చూచిన జ్ఞాపకము లేదు. ఇంతలో ఇది ఏలాగు పుట్టి ఉండును?

గణ—విశ్వామిత్రసృష్టి ఏమో?

హరి—కావచ్చును......భటులారా, పల్లకీలు ఈ తోటలో దింపించుడు.

భటులు—చిత్తం. (నిష్క్రమింతురు.)

హరి—గణపతీ, ఇక తోటలో ప్రవేశింతము, రమ్ము......ఆహా! ఇదేమి, ఎడమకన్ను అదరుచున్నదే?......ఏమో అననేల? ఇప్పుడున్న శుభమేమి?

తే. గీ. కనులయెదుట నా తండ్రి స్వర్గంబు వీడి
నరకమేగ, ఏమొనరించినాఁడ? నేను
సత్యమున్ మాన, అతనికి స్వర్గమబ్బు;
నా కసత్యబు పల్కుటే నరకమగును. 34

గణ—అబద్ధం ఆడినా నీకు స్వర్గమిస్తానని విశ్వామిత్రుఁడంటే, అతని మాట వినిపించుకోకుండా, ఇప్పుడు విచారిస్తే ఏం లాభం?

హరి—ఓయీ, నేను చేసినది పొరపాటని నేను విచారించుట లేదు.

తే. గీ. కల్లలాడుటన్ కలుగు స్వర్గంబుకంటె
సత్యమున కల్గు నరకమే చాల మేలు;
స్వర్గనరకములను గూర్చి చర్చ ఏల?
నరుని మనసె స్వర్గంబును నరకము నగు. 35

నేను విచారించుటకు కారణము తండ్రికి కలిగిన ఆపద తీర్ప లేక పోతిని కదా అని.

గణ—అందు కోసమే కదా వశిష్ఠుడి వద్దకు వెళ్లుతూ ఉన్నాము......మిత్రమా, ఒక వేళ వశిష్ఠుఁడు కూడా విశ్వామిత్రుఁడి లాగే అనమంటేనో?

హరి—వారాలాగు చెప్పరు. సత్యవ్రతమును వారి ఉపదేశముమీఁదనే మొదటినుండియు నేను పూనికొనినాను.

గణ—......మిత్రమా, పూర్వం నీతండ్రి ఈ వశిష్ఠుడికి కోపం తెప్పించాఁడు కదా? అట్టి వాఁడి విషయంలో ఈయన సాయం చేస్తాఁడా?

హరి—ఓయీ వెఱ్ఱివాఁడా, మహనీయు లెప్పుడును దీర్ఘక్రోధులు కారు.

గణ—ఆఁకలిదేవుఁడు మాత్రం మహనీయుఁడు కాఁడని నాకిప్పుడు బోధపడ్డది. జాామై నన్ను పీడిస్తూనే ఉన్నాఁడు.

హరి—వంటలిఁక అగును.........ఈ మామిడిచెట్టుక్రింద అరుఁగులున్నట్లు కనఁబడుచున్నవి...రమ్ము, కూరచుందుము.

[ఇద్దఱును కూరుచుందురు.]

గణపతీ, మామిడిచెట్టది ఎంతటి సార్థకజన్మమో ఆలోచించినావా?

గుణ—ఏదీ, ఈ ఆఁకలి నాకే ఆలోచనా తోఁచనిస్తేనా?

హరి—

మ. శుకముల్ తియ్యనిపండ్ల నొక్కి యొడ తించున్ మాధురిన్ మెచ్చఁగా,
పికముల్ క్రొంజిగురుల్ మెతొక్కి యొడ తృప్తిన్ మెక్కుచున్ పాడ, భృం-
గకులంబుల్ మకరంద మానుచును ఝుంకారంబు చేయంగ, సా-
ర్థకజన్మంబు రసాలమొందె సుముఖత్వంబూని వృక్షంబులన్. 36

గణ—రసాలంగ సుముఖత్వం పూనడం అనఁగా సురసాలం అనా నీఅభిప్రాయం? సురసాలమే అయితే నా ఆఁకలి తీర్చదేం?

హరి—తీర్చకేమి? అరముగ్గిన పండ్లు నేలను పడియే ఉన్నవి.

గణ—ఆహా! ఆఁకలి నిజంగానే ఆలోచన తోఁచనీయ లేదు. (వడివడిగా పండ్లు ఏరుకొని తిన మొదలు పెట్టును.)

హరి—...............మిత్రమా, అదేదో మధురనాదము వినవచ్చుచున్నది.

గణ—రసం నేను నోటలోకి పిండుకొంటూ ఉన్నప్పుడు పుట్టినది; ఓహో! బహుమధురంగా ఉంది.

హరి—ఆ నాదము కాదు.

గణ—అయితే ఆఁకలికి చెవిలో పుట్టిన హోరేమో?

హరి—ఉండుండు; జాగ్రతతో విందము.

[దూరమున చంద్ర, మతి, అను మాలెతలు ప్రవేశింతురు.]

చంద్ర, మతి— ద్విరదగతి రగడ.

సంతసము కొలిపెడి వసంతశోభలు హెచ్చె:
అంతటను వనమున లతాంతనిచయము విచ్చె;
కామ బాణాలన పికస్వనమ్ములు మ్రోఁగె;
ఆమని ఘటించు దండన తుమ్మెదలు మూఁగె;
చిలుక ముత్తముల తేజీలకు కదము విచ్చె;
ఎలగాలి దూత ముందేగి వేగును తెచ్చె;
చిగురు కత్తులను మనసిజుఁడు వాఁడిగ నూరె;

నిగనిగని తోఁచె తేనెను తూపులన్ సారె;
విరహులను విరహిణుల వెతఁ గొల్ప దండెత్తె;
కరుణ చూపక పడుచు కన్నెలను పడ మొత్తె;
పగలెల్ల అరవింద బాణంబులను దాల్చె;
తొఁగతూపుగముల రాత్రుల పూనుచును నిల్చె.—

చంద్ర—ఓసీ మతీ, అదిగో, మనకిప్పుడిప్పుడే విశ్వామిత్రులవారు చెప్పినట్లు హరిశ్చంద్రచక్రవర్తి వచ్చినాఁడు. మనమాతని సమీపించి, బొంకింప ప్రయత్నింతము రమ్ము.

మతి—చంద్రా, విశ్వామిత్రులవారు ఎక్కడకు వెళ్లినారే?

చంద్ర—ఈ చేరువనే ఉన్నారు. మన ప్రయత్నమెట్లు ఫలించునో తెలిసికొనవలెనని వారికి తొందరగా ఉన్నది.

హరి—గణపతీ, అది ఎవరిదో స్త్రీల కంఠనాదము; పంచమస్వరమును అనుసరించి పాడుచున్నారు. ఒక్కమాఱుగా ఆ పాట ఎందుచేతనో కాని ఆఁగిపోయినది.

గణ—నేను పళ్లు తింటూ ఉండడం చూచి నోరూరి కాఁబోలు!

హరి—ఉండుండు. మరల పాడుచున్నట్లున్నారు. ధ్వని కూడ దగ్గఱ పడుచున్నట్లున్నది.

చంద్ర }
మతి } —

నిండు చంద్రుఁడు కామునికి రాత్రి పడ తోఁడు,
పండు వెన్నెల మీఁద పడిన దేహము మాఁడు;
ప్రియురాండ్రు ప్రియులు కూరిమితో కలిసి యున్న,
భయమొంది యోడు దర్పకుఁడు వారలఁ గన్న. 37

[చంద్రయు మతియు సమీపింతురు.]

ఓ హరిశ్చంద్రసార్వభౌమా, వసంతుని రాకకును కంతుని ఢాకకును ఆఁగలేక పెనుకాఁకల వడి వేఁగుచున్న మమ్ము శీతలకృపావలోకనముల సేదఁదేర్ప వచ్చిన నీ దర్శనముచే మేము ధన్యలము.

గణ—అమ్మనోయ్, పెద్ద పెద విసూర్లు విసురుతూ ఉన్నారే!

హరి—ఓ కాంతలారా, మీరెవ్వరు? ఇచ్చటకు ఏల వచ్చినారు? నన్నెట్లు తెలిసికొనఁ గలిగినారు?

చంద్ర—మీ పరిచారకుల వలన మీపుణ్యనామమును విననోఁచి మా చెవులు కృతార్థములైనవి.

మతి—ఇది మేము మృదుసుమముల చిదుముచు, తుమ్మెదకొదమల నదుముచు, మదకోకిలముల గదుముచు, సదా విహరించు లీలోద్యానము. అపరవసంతుఁడవగు నీ ఆగమనముచే దీని శోభ ఇనుమడించినది.

గణ—అబ్బో! గుబగుబ గబగబ లాడిస్తున్నారే! నేనే చేఁత కాని వాఁడనా?

చంద్ర—అయ్యా, మేము మధుపకన్యకలము.

గణ—అనఁగా?

మతి—మాతంగకన్యలము.

గణ—ఈ సంగతులు చెప్పకుండానే స్పష్టంగా తెలుస్తూ ఉన్నవే.

తే. గీ. పరవశము కల్గఁ జేయు మీ పాట కొంత
వినిన, మధుపకన్యకలంచు విశదము గద?
నీటు గోటును కల్గిన నెన్నడలను
కనిన, తెలియదె మాతంగకన్యలంచు?. 38

చంద్ర—ఆహా! ఏమి మీ చమత్కారము! ఈ మాటు స్పష్టముగా తేట మాటలతో చెప్పెదను; మేము మాలలము.

గణ—అదీ స్పష్టమే.

సీ. మేల్ పసిమిం గల మెయిచాయ కన్న చం-
పకసుమమాలలే భామలార!
కడు మెత్తనైన యంగములను కన, శిరీ-
షలతాంతమాలలే చానలార!
నెమ్మనము హరించు నెత్తావి నరయ, పా-
టలపుష్పమాలలే లలనలార!

వాడు లేని యవయవములను చూడ, క-
ల్పనసూనమాలలే బాలలార!
పురుషులను మోహపెట్టెడి బుద్ధితోడ
తమ్ములు, నశోకములును, చూతమ్ములు, నవ-
మల్లికలును, నీలోత్పలము, ల్ల తాంత
శరుఁడు కొని కూర్చు మాలలౌదురహా! మీరు. 39

మరి—ఆహా, రాజేంద్రుని నర్మసచివుఁడు కాఁబోలు ఈయన! ఇతఁడే ఇంతటి రసికుఁడుగదా, ఇఁక రాజేంద్రుఁ డెంతటి రసికుఁడో.

చంద్ర—చెల్లెలా. రాజేంద్రుఁడు రసికజనచక్రవర్తి అని రూపము వల్లనే తెలియుచున్నది కాదటే?

సీ. మెప్పులాఁడుల మెప్పు మెచ్చి ముచ్చటలాడ-
నేగు చెవులకడ కితని కనులు;
పలుకులాఁడుల సొంపుఁ గూర్చి నాలుక వచి-
యింప రాగంబూను నితని మోవి;
వన్నెలాఁడుల నెల్ల వలపింపఁ గలుగుట-
నే కలకలలాడు నితని మోము;
ఒప్పులాఁడులఁ గూర్చి యోచించు యోచన-
లిముడక వెడఁదయౌ నితని యురము;
నేర్పులాఁడుల కరఁగింప నేర్చు రసిక-
తకు మిగుల పైకి పొంగు నీతని భుజములు;
ముద్దులాఁడుల పేరిట మోహలేఖ-
లెపుడు వ్రాయుచుండుట కందు నితని వ్రేళ్లు. 40

గణ—ఆ మాత్రానికే వేళ్లు కందుతవా? వేళ్లు కందుతవనే కాఁబోలు మీ పేరులు తిన్నగా చెప్పకుండా ఉన్నారు?

చంద్ర—మేము చిన్నగానే చెప్పుచున్నాము. అట్లుగా రెండవ అక్షరము లాగిన మేము చేయఁగలము? మేము చండాలురము. దీనికి కూడ మఱియొక అక్షరము లాగరు కదా? లాగిన మొదల, నాలుగు శబ్దములు అప్పుడే అయినవి గనుక, ఇఁక పంచమ శబ్దమే మాకు దిక్కు.

గణ—మీరు పంచములా? అయితే మాలలమని ఎందుకన్నారు? మాలెతలమని చెప్పి ఉంటే ఈచిక్కు లేక పోవునే. మీకు లింగభేదం తెలియదు కాఁబోలు.

మతి—తెలియక పోవుట ఏమి? పుల్లింగమునకు నిదర్శనము రాజేంద్రుఁడు; స్త్రీలింగమునకు మేమిద్దఱము;——నపుంసకలింగమునకు మీరు.

గణ—మిత్రమా, చూచవయ్యా, ఈ పడుచులు నన్నేలాగు అగౌరవిస్తున్నారో! బ్రహ్మచారినైనంత మాత్రం చేతనే నేను నపుంసకుఁడనా?

చంద్ర—మీరు బ్రహ్మచారులా? అట్లయినచో మిమ్ములను అనుట మాదే పొరపాటు; క్షమించుఁడు. శతసంఖ్యవఱకును గోతులు మీకు జత కదా!

గణ—ఏమీ, నేను బ్రహ్మచారిని గనుక శతమర్కటసమానుఁడనా? అదే నిజమైతే, వళ్లయిపోయినవి కదా, చెట్టెక్కకుండా ఈలాగు కూర్చుంటానా?

చంద్ర—అయ్యా, ఇప్పుడు మీరు పొరపడినారు. ''కోఁతు'' లని అనలేదు; ''గోతు,'' లన్నాను. ''గోతు'' లనఁగా స్త్రీలు. మీవంటి వారిమొదల సరళముగానే పలుకుదుము గాని పరుషములు పలుకుదుమా? ''శతసంఖ్యవఱకును గోతులు మీకు జత'' అనఁగా, మీకు నూఱుగురు స్త్రీలు అవసరమని నా ఉద్దేశము.

గణ—అమ్మయ్యో! నూఱుగురేల? నేనేమి రాజునా, ఎందఱో భార్యలను కట్టుకోవడానికి?

చంద్ర—రాజున కెందఱు భార్యలు?

గణ—ఇరువదిరెండుగురు కారా?

చంద్ర—ఏమీ, మీ హరిశ్చంద్రరాజునకు భార్యలు ఇరువదిరెండుగురే! ఇంతకు పూర్వము పాతికమందియు, ఇఁక కాఁబోవు వారు ఇద్దఱునా? సరసములకు మీరు దిగి, ఆయన ఉలుకక పలుకక కూరుచుండుట చూచి ఏమో కచ్చకట్టిన ఏకపత్నీవ్రతస్థుఁడేమో అనుకొంటిమి.

గణ—నా మిత్రుఁడు ఏకపత్నీవ్రతస్థుఁడే; చంద్రమతీదేవి తప్ప తక్కిన స్త్రీలను కన్నెత్తి అయినా చూడఁడు.

చంద్ర—మీ రాజునకు ఇరువదిరెండుగురు భార్యలని మఱి మీరెందుకు చెప్పినారు?

గణ—మా రాజుకు కాదు. "రాజు" కనే అన్నాను. మీరు పాండిత్యం ఊరకే వెలిగిస్తూ ఉండడం చూచి, "రాజు" అన్నమాటకు "చంద్రుఁ" డని అర్థం చేసుకోఁగలరనుకొన్నాను.

చంద్ర—అలాగా?......పోనిండు. చంద్రుని మీఁది ఈ సమస్య పూర్తి చేయఁడు:

"చంద్రుం బొడగాంచి, అంబుజంబులు విచ్చెన్."

గణ—ఓహో! ఏమి అవకతవక సమస్య!

క. తంద్ర కలిగించు మధువును
చంద్రవదనలార, మీరు చండాలులు కా-
నం గ్రోలితిరో? లేకెటు
చంద్రుం బొడగాంచి, అంబుజంబులు విచ్చెన్?. 41

చంద్ర—ఆహా! ఏమి అవకతవక పూర్తి! అయినను, "చండ" మైన "అలి" అనఁగా "తుమ్మెద" అని చక్కఁగా "చండాలి" శబ్దమును శ్లేషించినారు... ఆహా! పంతము పట్టినట్లు ఈ శబ్దమునకును రెండవ అర్థము లాగినారు...... అవును, రాని చోటనైనను అర్థాకర్షణ చేయు సమర్థత మీ శాస్త్రులదే కదా?

గణ—ఓహో! నేను శ్లేషించానని నీవూ ప్రయత్నించావా?

చంద్ర—అవ్వ! శ్లేషించు నేర్పు మాకెక్కడిది? కావలసిన యెడల ఆశ్లేషించు నేర్పు కలదు. రసిక చక్రవర్తుల కొప్పుదల ఉన్నయెడల చూపింతుము.

గణ—ఆహా! మీ పడుచుందనపు కొవ్వు మిమ్మలిని తింటూ ఉన్నది.

చంద్ర—స్వామీ, నిశ్చయము. మా జవ్వనము ఈ అడవిఁ గాచిన వెన్నెల అయినది. మా సల్లాపములును చిఱునవ్వులును కౌఁగిలింతలును ఈ అడవి చెట్ల పాలే అయినవి..

సీ. బలువావి తాతకు గిలిగింత గొలిపి, నం-
పఁగె మామకొక్కింత మొగము చూపి,
వావిలి బావకై వలచి ఉస్సురుమని,
గోరంట మగని అక్కున గదించి,

గోఁగు మిండనితోడ కొంత మాటాడి, ప్రి-
యాళుప్రియుఁడు మెచ్చునట్లు పాడి,
తిలకరసికు వంక తిలకించి కనుగీఁటి,
సురపొన్న మఱఁదిని చూచి నవ్వి,
పొగడయల్లునికిన్ కల్లు బుక్కఁడిచ్చి,
పొలయలుక పూనుచు నశోకపున్ మనుమని
తన్నె: తీఁగెబోఁడులనైతి మన్నిగతుల;
మానుదుమె ఘనతరుసంగమంబు దొరక? 42

మతి—అక్కా, ఈ రాజచంద్రుఁడెట్లీ సమస్యను పూర్తి చేయునో?

హరి—గణపతి కంటె నాకెక్కువ శక్తి లేదు. అయినను నాకొక విధముగా తోఁచినది, వినుఁడు.

క. ఇంద్రదిశ తెల్లనయ్యెను,
చంద్రికలున్ మాసె, ఉడులు చనె, పడమటిలో
సంద్రంబునం బడన్ చను
చంద్రుం బొడగాంచి, అంబుజంబులు విచ్చెన్. 43

చంద్ర—కిట్టింపుగా ఉన్నదే కాని మీ రసికతకు తగినట్లుగా లేదు. చెల్లెలా, నీవు పూర్తి చేయవే.

మతి—

క. సాంద్రముదశ్రుమరంద-
మ్ముం దొరయుచు మూడునేత్రముల నెదు మిన ఛా
యేంద్రనిభ తేజుని హరి-
శ్చంద్రుం బొడగాంచి, అంబుజంబులు విచ్చెన్. 44

గణ—భేషా!......మాటలు గదా, మీకీ పాండిత్యం ఎక్కడ కుదిరింది?

చంద్ర—మేము జగదేకవివేకి అగు వాల్మీకికి మనుమరాండ్రము; ఆయన వలన సకలకళలను నేర్చినాము.

గణ—మీ పేరులు—?

చంద్ర—మావా?...మావి బంగారు తీఁగెలతో గుచ్చిన ముత్యాల పేరులు.

గణ—ఇది తాతల నాఁటి హాస్యం. దానికేం గాని సమస్యకు మాఱు సమస్య ఇస్తాను; మీరు పూర్తి చేయండి:

"దారము లేని హారము నితంబిని ఎట్లెటుగా ఘటిల్లెనో?"

చంద్ర—ఇది అవ్వల నాఁటి సమస్య. ఇది కష్టమని మీరేల అనుకొన్నారు?

గణ—దీని పూర్వోత్తరసందర్భం చాలా ఉంది; చెప్తాను వినండి: నేను మొదట కాశీదేశపువాడను; కాశీరాజు ఆస్థానకవిని. అక్కడకు అన్యదేశం నుంచి ఒక విద్వాంసుఁడు వచ్చి నాకు ఈ సమస్యను పూర్తి చేయమని సభలో ఇచ్చాఁడు. నాకేమీ తోఁచక నెల దినాలు గడువడిగాను.

మతి—అప్పటికైనను పూర్తి చేసినారా?

గణ—ఓ, అడలేసి మఱి. ఆ రాత్రే ఎవరికీ చెప్పకుండా అయోధ్యకు బయలుదేఱి పరుగుపరుగున నడచి నెల దినాలూ అయే సరికెల్లా ప్రయాణమంతా పూర్తి చేసాను.

మతి—అయినయెడల, ఆ సమస్య ఇప్పటికిని పూర్తి కానే లేదా?

గణ—అయింది. అయోధ్యకు వచ్చి ఇక్కడి ఆస్థానకవికి ఆ సమస్య నేను ఇచ్చాను. అతఁడు ఏలాగో గింజుకొని ఈలాగు పూర్తి చేసాఁడు:

"ఉ. దూరమునందు నున్నపుడు తోఁచిన నీ మెడలోని హారమే-
నారసి, పెద్దముత్యములదంచు భ్రమించితి; పట్టి చూడఁగా
చారులతాంతమాల యని స్పష్టమె: ఇందలి పువ్వులెల్ల మం-
దారము లేని, హారము నితంబిని, ఎట్లెటుగా ఘటిల్లెనో?" 45

చంద్ర—శైలి బాగుగా ఉన్నదే కాని సమస్యాపూర్తి తప్పు. "హార" శబ్దము ముత్యాలపేరునకే కాని పువ్వులదండకు చెల్లదు. చెల్లెలా, నీవు పూర్తి చేయవే.

మతి—అక్క,

ఉ. చేరువకీవు రాక మును చిత్రపు వర్ణము కల్గినట్టి నీ
హారములోన నీలమణులా కలవంచు భ్రమించి, వర్తులా-

కారముఁ బట్టి ముత్యములె గా యని పోల్చితి: అవ్వి నిక్కపుం
దారములేని, హారము నితంబిని, ఎట్లిటుగా ఘటిల్లెనో? 46

చంద్ర—చెల్లెలా,

ఉ. మారసమానరూపసుకుమారు త్రిశంకుకుమారు సుందరా-
కారము కాంచి తాపమున కాఁగెడు నాయెదకాఁక సోఁకుటన్
మాఱెను తారహారమున మౌక్తికముల్ హరినీలముల్ బలెం;
దారము లేని హారము నితంబిని, ఎట్లిటుగా ఘటిల్లెనో! 47

గణ—సమస్యాపూర్తి బాగుంది గాని శైలి తప్పు.

చంద్ర—శైలి ఏలాగున తప్పు.

గణ—"శైలి" అంటే శీలసంబంధమైనది గదా. పరసతీవిముఖుఁడైన హరిశ్చంద్రుఁడి శీలానికి ఈ పద్యం విరుద్ధంగా ఉంది. "త్రిశంకుకుమారు" అనడానికి బదులు "నృపాలకుమారు" అన వలసింది.

చంద్ర—మీ రాజుగారు రసికచక్రవర్తి అనుకొన్నాము.

గణ—రసికత్వానికి పరసతీసుముఖత్వమే ముఖ్యమా? భార్య విషయంలో రసికత్వం కూడదూ?

చంద్ర—బ్రహ్మచారులు, మీకు భార్య అన్న ఇంకను అపురూపముగానే ఉండును.

క. అతిభక్తికతమునను 'తా
ప్రతివచనం బీదు, మాఱు పని సల్పదు, క-
ల్పితకోప మూన; దేగతి
పతి రసికత చూపఁ గలఁడు భార్యయెడ నిఁకన్? 48

మరి—

క. ఊరింపులు బెదరింపులు
తాఱింపులు వగలు బిగులు తక్కులు మొక్కుల్
నేరుపులున్ చూపని నిజ
దారయెడల, ఎట్లు రసికత చూపవగున్? 49

గణ—మీరు చెప్పినలాంటి రసికుడు మాత్రం ఇతఁడు కాఁడు. మీ శృంగారపద్యాలు ఇతని మీద కుమ్మరించక ఇతఁడిని ఈలాగు బ్రతుకనియ్యండి.

చంద్ర—వీలైనంత వఱకు ప్రతిపద్యమును సభాపతిపరముగా వర్తింపఁ జేయక తప్పునా? అది సాంప్రదాయము గదా?

గణ—అలాగైతే మఱి పద్యాలే వద్దు. కావలసినంత కవిత్వచర్చ జరిగింది. ఇఁక సంగీతం లోనూ, నాట్యంలోనూ, అభినయంలోనూ, మీకున్న నేర్పు చూపించండి.

చంద్ర, మతి—చిత్తము. ఇదిగో, పాడుచు నాట్యము చేసెదము:

సురట — ఆది.

కను- పండుగ అయ్యెను వగకాఁడ,।
రసి- కుండవు కావున నిను చూడ॥ కను॥
నిండుచందురు వంటి- నీ మొగము కన।
నిండెను నా మది తమితోడ॥ కను॥
మదనుం డదయత- పదనగు శరముల।
ఇదె వేసెను- నా మెదఁ గాఁడ॥ కను॥
క్రొత్త జవ్వనము- కొను హరిశ్చంద్ర,।
ఇత్తతి అర్పించెద కూడ॥ కను॥

గణ—పాట కూడా సభాపతి పరమేనా?...మిత్రమా, క్రొత్తజవ్వనం వీళ్లను ఈలాగు చేస్తూ ఉంది కాఁబోలు. వీళ్లకు ఏదో బహుమానం ఇచ్చి త్వరగా పంపి వేయి.

హరి—మాలెతలారా, ఇదిగో నా ముద్దుటుంగరము. ఇది చూపించినయెడల నా ధనాగారాధికారులు మీకు నూటపదాఱులు ఇచ్చెదరు. వెళ్లి పుచ్చుకొనుఁడు.

చంద్ర—సుందరీకందర్పా, ఉంగరముతో మాకు ప్రయోజనము లేదు; అది నీవే ఉంచుకొనుము.

హరి—మీ యుద్దేశమేమి?

చంద్ర—రసజ్ఞుఁడవు, ఈ మాత్రము మా ఉద్దేశము పోల్చుకొన లేవా? ముద్దుటుంగరము ఇచ్చెదనని నీవనఁగా ఉంగరమును నిన్నే ఉంచుకొమ్మంటిమి?

గణ—అన్నా, మీ పోతరం! మీకు ముద్దు కావలెనా? ఉంగరం రాజే ఉంచు కొంటే, ఇక మిగిలే "టుగాగమం" నాకాలు కాఁబోలు!......ఏకపత్నీవ్రతస్థుఁడైన మా రాజును ఈ లాగు అడగడానికి మీకు భయం లేక పోయిందా?

చంద్ర—అయ్యా, రాజుగారి ఏకపత్నీవ్రతమునకు భంగము కలిగించు మాట ఏదియును మేమన లేదే. అగ్నిసాక్షికముగా వివాహము చేసికొనినయామె తప్ప తక్కిన మా వంటివారు పత్ను లెట్లగుదురు?

గణ—చాలు, చాలు; ఇఁక మీ చనువు కట్టించండి...రాజా పరకాంతావిముఖుఁడు; మీరా మాలకన్నెలు. మీకే మాత్రం జ్ఞానం లేక పోయిందేం?

చంద్ర—మాకు జ్ఞానము లేక పో లేదు. మీరన్నట్లు మేము కన్నెలము కాని పరకాంతలము కాము. రాజుగారి పరకాంతావిముఖత్వము మాయెడల బాధించదు. ఇఁక మాలవారమని కదా సంశయము? అదియు ఒక బాధకము కాదు. మీ రాజుగారికి కూడ కొంత మాల సంబంధమున్నది. మాల అయిన త్రిశంకుమహారాజుగారి కుమారుఁడే కదా ఈయన? వారికి పుట్టిన ఈయనయు మాలవాఁడే. కాఁబట్టి ఈయన మాసంపర్కమునకు జడియనవసరము లేదు.

గణ—ఈ నా దండం కొమ్మనుండి పుట్టింది. మీరూ కొమ్మలే. దీని సంపర్కానికి మీరూ జడియనవసరం లేదు......మిత్రమా, ప్రయోగింపుమని సెలవా?

హరి—గణపతీ, కోపింపకు. అజ్ఞానము చేత కదా వీరిట్లనుచున్నారు? అందు వలన వీరికి జ్ఞానము కలిగింప ప్రయత్నింపుము......ఓమాలెతలారా, మీరిట్టి అసందర్భపు కోరికల కోరుట న్యాయమా?

మతి—ఓ భూమీశ్వరా, మేము కోరిన కోరిక అసందర్భమైనది కాదు.

శా. నా పేరిమన్ కని, పంచబాణములచే నన్ కొట్టి, మారుండు పం-
చప్రాణంబులు పోవఁ జేసి నను పంచత్వంబు నొందించు; ఓ-
హోహారిణేశ్వర, రాజశేఖరుఁడవై యున్నట్టి నీ వింక ర-
క్షా ప్రోవంగ; ద్వితీయగాఁగ కయికొమ్మా సద్రసజ్ఞన్ ననున్.

గణ—ఈయన రాజశేఖరుఁడైతే మీ అప్ప గారిన్ని నీవు గంగవున్నా, [illegible] క్కి కూర్చోవలెననుకున్నావు కాఁబోలు!...మన్మథుఁడు అయిదు [illegible]లతో ను కొడ్తాడేం? అతఁడి అయిదు బాణాలకంటె దుబ్బుమని తగులుతవి నా అయిదు వేళ్లన్ను, భద్రం. ముట్టరాని వాళ్లమని మహా తెగనీల్గుతూ ఉన్నారు.

మన్మథుఁడి పంచబాణాలకు రెండింతలైన సాధనం ఈ దుడ్డుకఱ్ఱ: "దండమ్ దశగుణమ్ భవేత్" అన్నాఁడు.

చంద్ర—ఓ భూలోకమన్మథా, మా కోరిక అసందర్భమైనదా? ఎంత సందర్భమైనదో చిత్తగించుఁడు.

మ. శరముల్ వేయఁ దొడంగి యంగభవుఁడేచంగం గడంగెన్ మముం
గరుణన్ మాని; అనంగుఁడౌ నతఁడు చిక్కంబోఁడు మాకెప్పుడున్:
సరిగాఁ జూపున మన్మథుండవగు నో సామీ, ఇటుల్ నీవిటు-
న్దూరకన్, కౌఁగిట కట్టి పెట్టకయె నిన్నున్ కూడ పోనిత్తుమే? 51

అయ్యా గణపతిశాస్త్రిగారూ, నహేతుకములు కాని మాటలు మేము ఏమైనను పలుకుచున్నామేమో మీరే చెప్పుఁడు. కోరినదనని నెదరించుట ఏమి న్యాయము? చేతనైనయెడల మా కోరిక తప్పని యుక్తిచేత నొప్పింపుఁడు.

గణ—ఒప్పించాలనా? రాజు ఒప్పుకోకుండా ఉన్నాఁడు గాని లేక పోతే ఒప్పించడం ఎంతసేపు? మీలాంటి వాళ్లను శిక్షించడానికే నేను దండధరుఁడనయాను, జాగ్రత్త.

హరి—ఓ మాలెతలారా, నేను మీమాటలను విన సహించ లేకున్నాను.

చంద్ర—ఓ రాజా, నీకు విన సహ్యమైన మాటయే చెప్పెదను, విను: చంద్రమతి నేలుకొనుటలో నీకేమియు అభ్యంతరము లేదు గదా?

హరి—అభ్యంతరము లేదు.

చంద్ర—ఓ సత్యవ్రతా, అట్లయినచో మమ్ము ఏలుకో. నేను చంద్రను; అది మతి. మమ్ము ఇద్దఱిని చేపట్టి చంద్ర, మతి, నేలుకొన్నవాఁడవు కమ్ము.

గణ—అబ్బా; మీనిగలు తఱుగ! ఇందుకా ఇంతసేపై పేరులు చెప్పకుండా కాలక్షేపం చేసారు? ...ఓ మాలెతరారా, ఇది వినండి: మీ బుగ్గ లెంప; పొషం పాత్రం నూతి నూతి నా చేతిమీఁద కాసిన వీటిని కాయలంటారు. ఇవి రెండూ కలిస్తే లెంపకాయలవుతవి. కలువనుంటారేమో చూడండి.

మతి—ఓ సత్యహరిశ్చంద్రా, ఊరకున్నావేమి? చంద్రమతి నేలుకొందునని చెప్పినావు; మాట నిలువఁ బెట్టుకొమ్ము.

హరి—నా సత్యనియమమునకు ఇప్పుడు భంగమేల కలుగును? మిమ్ము చేపట్ట వలసిన అవసరము లేకుండనే, నేను మీరు చెప్పిన పేరు గల పత్నిని ఏలుకొను

చునే ఉన్నాను. నా ఉదేశము కూడ అదే. ఉద్దేశమునకు తప్పుగా నడిచినచో కదా సత్యనియమము తప్పును?

గణ—మిత్రమా, పూర్వపక్షం సిద్ధాంతం ఇవన్నీ పెంచి వీళ్లతో ఈ అనవసర తర్కం అంతా ఎందుకు? అలాగు తర్కించఁబడ వలసిన వాళ్లు కారు. వ్యవహారం ముదురుతూ ఉంది. చెంపపళ్లు తింటేనే కాని వీళ్లు కాళ్లు నడిపించే జాడ కనఁబడదు.

మతి—తినుటకు పండ్లు లేక చెట్టెక్క వలెననుకొన్నారే; ఇవెక్కడి పండ్లు?

గణ—చెంపకాయలే ముదిరితే చెంపపళ్లు అవుతవి; అవి తగిలితే చెంపపళ్లు ఊడుతవి.

హరి—ఓ మాలెతలారా, చివరి మాట వినుఁడు; ఎంత సంపద అయినను ఇచ్చెదను. కావలసినయెడల కోరుకొండు; లేకున్న యెడల మీ దారిని మీరు పొండు.

చంద్ర—రాజా, అతనురాజ్యసంపద తప్ప తక్కిన తక్కువ సంపదలు మే మొల్లము.

గణ—ఆఁ, అలాగా?..."అతనురాజ్యసంపద" అంటే తనువు లేని రాజ్యసంపద గదా? మీకు తనువులు లేనట్లు చేసి, అతనురాజ్యసంపద కలిగిస్తాను, ఇదిగో. (కొట్టును.)

మతి—(ఏడ్చుచు) ఓ రాజా, పుష్పకోమలలమైన మమ్ము ఈ లాగున కొట్టించెదగునా?

చ. మదనుఁడు వేయునట్టి కుసుమంబుల తాఁకునకైన నిల్వ నో-
పదు, చిగురాకుపానుపులపైని పరున్నను గందు, గట్టిగా
అదుముచు కౌఁగిలించిన రవంతయు తాళఁగఁ జాల, దట్టినా
మృదువగు మేను దెబ్బలకు నేగతి నోరుచు? ఓరి కూ్రరుఁడా. 52

చంద్ర—(ఏడ్చుచు)

చ. ఒడలిని చేతితో నిమురుటో, ప్రియమారఁగ కౌఁగిలించుటో,
జడుపును తీర్చి ప్రేముడి మెసంగ కవుంగిట నిల్పుకొంటో, ము-
ద్దిడుటో, ప్రియోక్తులన్ పలికియిష్టము కొల్పుటో,—అంతె కాకిటుల్
పడఁతుల గొడ్డులన్ బలెన బాఁదఁగ చెల్లునె? ఓరి కూ్రరుఁడా. 53

చెల్లెలా, రావే. సరసమెఱుఁగని ఇట్టి మోటు వసరములయొద్ద నిలువ కూడ

డు. మునిఁగచెట్టుకు పండు వలె ఈ నపుంసకునకు ఇంత సురూపము పెట్టిన ఆ తలకొట్లమారి బ్రహ్మను తిట్ట వలెను......మనము పోయి మన పెంపకపు తండ్రి అగు విశ్వామిత్రునితో మొఱ్ఱ పెట్టుకొందము.

[చంద్రయు మఱియు నిష్క్రమింతురు.]

హరి—ఆహా! వీరు విశ్వామిత్రుఁడు పెంచుకొనిన కూఁతులఁట. ఇప్పటికే ఆయనకు కోపము తెప్పించి ఉన్నాను. ఇంకను ఏమి చిక్కులు తెచ్చునో!

గణ—వీళ్ల కాఱుకూఁతల గుఱించి విన్న వెనుక కూడా కోపగిస్తే వీళ్లకయిన ప్రాయశ్చిత్తం ఆయనకూ కావలసిందే.

హరి—గణపతీ, ఆఁడువారిమీఁద చేయి చేసికొనుట పొరపాటు సుమా.

గణ—పొరపాటు కాదా మఱి? మూఁడింతలు కానై ఉన్న నీసౌభాగ్యసంపదకు అడ్డుగా వచ్చి నీనోటి దగ్గఱి ముద్దు దఁ గొట్టినవాడనయాను. వాళ్లు నీమీఁద పడుతూ ఉంటే చూచి ఊరుకో వలసింది. మీకు బ్రహ్మముడులు పడితే నాకు రెండు కాసులైనా దొరకి ఉండును.

హరి—ఓయీ, నీవు నాకు చేసినది మేలు కాకపో లేదు. కాని విశ్వాసపు తొందరచేత చేయవలసినదానికంటె ఎక్కువ చేసినావేమో?......ఉండుండు, విశ్వామిత్రుని మాటవలె విన వచ్చుచున్నది.

[తెరలో]

శా. ఓరీ రాజ్యమదాంధ, ఓరి శఠ, ఓరోరీ హరిశ్చంద్ర, ఏ
రా? రవ్వంతయు జాలి లేక సుకుమారాకారలౌ వీరి నొ
రా! రాపులొనర్తువా? ఇఁక మదీయాత్యుగ్రరౌద్రంబు క
న్గోరా, నీఱయి పోక తప్పుదువె తద్ఘోరాగ్నిలో దగ్ధమై? 54

గణ—మిత్రమా, ఈ విశ్వామిత్రుఁడు క్రోధాంధుఁడు సుమీ. అతఁడి క్రోధాగ్నిలో నీరయిపోతే క్రోధాగ్నే కదా ఆఱి పోతుంది?

[విశ్వామిత్రుఁడు, నక్షత్రకుఁడు, చంద్రయు, మఱియు ప్రవేశింతురు.]

విశ్వా—(కోపముతో) " శా. ఓరీ రాజ్యమదాంధ " (మొదలగు పద్యము చదువును.)

హరి—మునీశ్వరా, నా వలన అపరాధలేశమును లేదు; ఉన్నయెడల క్షమింపుఁడు. (కాళ్లమీఁద పడును.)

విశ్వా—(కాలితో హరిశ్చంద్రుని త్రోసి వేసి) ఏమీ, నీ వలన అపరాధలేశము ను లేదా? దెబ్బలు తినుట వీరి దోషమేనా?

గణ—స్వామీ, అవును. వీళ్లు పేలిన కాఱుకూఁతలు విని ఉంటే మీరూ అలాగే అంటారు.

విశ్వా—ఓ హరిశ్చంద్రా, నా ప్రాణసమానలగా పెంచుకొనుచున్న వీరిని కొట్టించినావఁట. అదుష్టత్వమునకు ప్రతిఫలముగా ఇదిగో శాపము ప్రతిగ్రహింపుము.

హరి—స్వామీ, మీరు నా దోషమేమో స్థాపించకుండ తొందర పడి శపించుట న్యాయము కాదు.

విశ్వా—(కన్నులెఱ్ఱ చేసి) ఏమీ? నీవు తొందర పడినయెడల న్యాయమును నేను తొందర పడిన యెడల అన్యాయమునా? (పండ్లు కొఱుకుచు) నీ దుశ్చరితము నకు నాకు ఒళ్లు బగ్గన మండుచున్నది...తండ్రి నరకమున కూలుటకు ఒప్పుకొన్న కఠినాత్ముఁడవు, నీవు ఈ ఆఁడువారిని కొట్టించుట ఒక వింత కాదు గాని గొప్ప సత్యవంతుఁడనని చెప్పుకొందువే, నీయెడల అపరాధలేశమును లేదని బొంకుటకు ఎట్లు శంకింపకున్నావు?

హరి—స్వామీ, నా కంఠము తెగినను నేనబద్ధమాడను; నేను నిర్దోషిని.

విశ్వా—ఓఁ, నీ సత్యసంధత గుట్టు బట్టబయలైనది. చంద్రమతి నేలుకొందు నని చెప్పియు ఈ చంద్ర, మతి, నేలుకొనకున్నావు?

హరి—మహాత్మా, మీరును ఈలాగే సెలవిచ్చినయెడల, నేనేమనఁగలను? నా ఉద్దేశము, ఆపేరుగల నా భార్యను ఏలుకొందుననియే. వీరవసరము లేకుండనే నేనా పేరుగల దానిని ఏలుకొనుచునే ఉన్నాను గదా! ఇఁక నాకసత్యదోషమెక్కడిది? ఉద్దేశమును బట్టియే మాటనిలువఁ బెట్టవలెను. తమకు అతను రాజ్యసంపద ఇమ్మని వీరు నన్ను కోరినారు గదా? వీరు ఉద్దేశించని అర్థమున నేను వీరి కోరిక నెఱవేర్చినయెడల వీరికి సమాధానమగునా?

విశ్వా—స్పష్టమైన అర్థము కాక ఈ మాటలకు వేఱే అర్థమేమున్నది?...సరే, సమాధానమైనయెడల, తీర్తువా?

హరి—మీ ఆజ్ఞ అయినయెడల తప్పక తీర్చి, ఈ విధముగా అయినను మీ కోపమును పాపుకొందును.

విశ్వా—అట్లయినయెడల వీరికి అతనురాజ్యసంపద ఇమ్ము.....చూతము, ఏ అర్థమున ఇచ్చెదవో!...ఓసీ చంద్రా, మతీ, మీకిది సమాధానమే కదా?

చంద్ర }
మతి } —మాకు సమాధానమే.

హరి—మునీశ్వరా, "అతనురాజ్యసంపద" అనఁగా గొప్ప రాజ్యసంపద అనియు అర్థము; కనుక వీరికి నా గొప్ప రాజ్యసంపద అంతయు ధారపోసెదను.

గణ—మిత్రమా, నీకు మతి పోతూ ఉందా ఏం?

విశ్వా—హరిశ్చంద్రా, నీకు నిజముగా వెఱ్ఱి ఎత్తినట్లు ఉన్నది. రాజ్యమును వీరికి ధారపోసెదవా?

హరి—మీ సెలవైనది కనుక ధారపోసెదను.

విశ్వా—నా సెలవు కాలేదు. ఇదా నీవు తీసిన అర్థము? చూచి చూచి చేతులార రాజ్యము వదలుకొందువా? నా కూఁతులను కొట్టినావన్న ప్రథమకోపము చేత నిన్ను కొంచెము భయపెట్టినానే కాని నీమీఁద నాకు పగ అనుకొన్నావా? ... నక్షత్రకా, చంద్రా, మతీ, రమ్ము పోవుదము. (పోఁ బోవును.)

హరి—మహాత్మా, ఆఁగుఁడాఁగుఁడు. మాట జాఱినది కనుక ఇఁక రాజ్యము ధారపోయుట ఎట్లు తప్పును?

విశ్వా—తప్పుటకేమున్నది? నా సెలవైనఁ గదా వీరికి రాజ్యమిచ్చెదనన్నావు.

హరి—అవును.

విశ్వా—నా సెలవు కాలేదు కనుక నీ రాజ్యము నీకు దక్కినది.

హరి—మీ సెలవప్పుడే అయినది. నేను ధార పోసెదననియు అన్నాను.

విశ్వా—ఓహోహో! అప్పుడైనది; నిజమే......కాని, నీవిట్టి అర్థము లాగెదవని ఎవరెఱుఁగుదురు?

హరి—ఏ కారణము చేతనైన నేమి? మీ ఆజ్ఞ అయినది గదా! అదే ముఖ్యము.

విశ్వా—రాజా, నీకు మతి చెడుచున్నది. ఈ రాజ్యమీమాలపడుచు లేమి చేసికొందురు? రాజవు, నీవే ఏల వలెను.

హరి—వీరేమి చేసికొందురన్న దానితో నాకేమి ప్రయోజనము? నేను ధారపోసెదనన్నాను; ధారపోసెదను,

విశ్వా—చండాలుల రాజ్యములో ప్రజలెట్లుండఁ గలరు? ప్రజల సౌఖ్యము చూచుట రాజుకు ముఖ్యవిధి గదా? అట్టి విధి ఆలోచించియైనను నీ రాజ్యము నీవే భరింపుము. మాటవరుసకన్న దానికి ఇంత పట్టింపా?

హరి—స్వామీ, ఆ ఆలోచనలన్నిటితోడను నాకు ప్రసక్తి లేదు. అడిన మాటను నిల్పుకొనుటే నాకు ముఖ్యమైన విధి. మాటకు పట్టింపు లేకున్నయెడల మఱి దేనికి?

విశ్వా—అహా, నీ మూర్ఖము! నీ భార్యయు బిడ్డఁడును ఏమగుదురు? పురము విడిచి నీవు అడవుల పాలు కాఁగా వారు నీతో కడగండ్లు పడఁగలరా? వారి గతి అయినను ఆలోచింపుము.

హరి—స్వామీ, నాకు సత్యముకంటె భార్యాపుత్రులెక్కువ కారు.

విశ్వా—ఇతని మతి చెదరినది. ఎన్ని విధములు చెప్పినను హితమును వినకున్నాఁడు. తాను పట్టిన కుందేటికి మూఁడే కాళ్లని కూరుచున్నాఁడు. ఇతని దేవితో చెప్పించిన ఇంతకంటెను లాభముండునేమో?...ఓయీ గణపతీ, చంద్రమతీదేవిని పిలుచుకొని రమ్ము.

గణ—ఆహా! మిత్రమా, నీకీ సత్యనియమం ఎక్కడ దాపురించిందయ్యా? అయ్యో! దేవిమాత్రం అడ్డఁగలదా? అయినా తీసుకు వస్తాను. (పోవును.)

నక్ష—(తనలో) ఆహా! ఈ రాజు నియమము చూడఁగా నా గుండె నీరై పోవుచున్నది. ఇట్టి మహాపుణ్యాత్ముని జాలిలేక నా గురువుగారెట్లు బాధించుచున్నారో? ......అయ్యో పాపము! ఈయన చిక్కు కొంత వఱకు నేనును కారణభూతుఁడనయినాను. మాలెతలకు నేను పెట్టిన పేరులే ఇంత కొంప ముంచినవి... అప్పుడేమో మహాఘనకార్యము చేసినట్లు సంతోషించినాను; నా అంతటి కుశాగ్రబుద్ధి లేఁడని మురిసినాను...ఈయన ఇట్టి సాధువని తెలిసినయెడల నేనీ పాపమునకు ఒడిగట్టుకొనక పోయి ఉందును.

మతి—అక్కా, అదిగో చంద్రమతీదేవి వచ్చుచున్నది.........ఈమె ఇంతటి నిరుపమాన సౌందర్యవంతురాలు గనుకనే ఈయన ఏకపత్నీవ్రతమునకు భంగము కలుగకున్నది.

చంద్ర—అవునే, మనమీమె ముందు దివటీలు పట్టుటకైనను తగము.

సీ. తనచాయనెదిరించెనని పట్టి నలిపి పై
పాఱిముకొన్నటు మేని పసుపు తనర,
ముకురమున్ గన్గొని మొగము కన్నెఱ్ఱ చే-
సెననంగ కుంకుమంబొనరుచుండ,

కరపల్లవచ్ఛదాగ్రమ్ముల చుట్టును
గ్రమ్మ తుమ్మెదలన గాజులమర,
శ్రీకారములు వ్రాసి చివర ద్రిప్పిన త్రిప్పు-
లన చెవికొనల చెవ్వాకులొప్ప,
అధిపుని ప్రసాదమును హృదయమునఁ దాల్చు
పోల్కి నురముమీఁదను తాళిబొట్టు వెలుఁగ,
ఐదువన్నెలున్ కలిగి ఈ యన్నుమిన్న
సాగను కన్నులపండుగై నెగడె మిగుల. 55

[గణపతి చంద్రమతీరోహితాశ్వులతో ప్రవేశించును.]

చంద్రమతి—అయ్యా గణపతిశాస్త్రీ, ఆర్యపుత్రుఁడు రాజ్యమునంతయు ధారపోయ నిశ్చయించెనా?

గణ—అమ్మా, నన్నడగకండి. ఔలికాఁడి వైఖరి చూస్తే నాకు తల నొప్పి పెట్టుతూ ఉంది.

[చంద్రమతీరోహితాశ్వగణపతులు సమీపింతురు.]

విశ్వా—ఇదిగో, చంద్రమతీదేవి వచ్చినది.

చంద్రమతి—ఆర్యపుత్రునికి జయమగుఁ గాక!

హరి—దేవీ, నీకు స్వాగతము.

రోహితాశ్వుఁడు—నాన్నగారూ, రోహితాశ్వుఁడు నమస్కరించుచున్నాఁడు.

హరి—నాయనా, ఇటు రమ్ము; మునీశ్వరునికి నమస్కరింపుము.

రోహి—మునీశ్వరా, నమస్కారము.

విశ్వా—దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము.

చంద్రమతి—విశ్వామిత్రమునీశ్వరా, ప్రణమిల్లుచున్నాను.

విశ్వా—నిత్యసుమంగళివగుదువు గాక! చంద్రమతీ, నీతో ఒక కార్యముండి రప్పించినాను. నీ నాథుఁడు వెట్టి ఎత్తి తనరాజ్యమంతయు ఈ మాలకన్నెలకు ధారపోసెదననుచున్నాఁడు. నీవు చెప్పి మాన్పింప వలెను.

చంద్రమతి—ఆర్యపుత్రుఁడు చేసిన దానిలో పొరపాటు ఉండదు.

విశ్వా—రాజ్యము ధారపోసినయెడల నీగతి ఏమగునో తెలియునా?

చంద్రమతి—ఆర్యపుత్రుని గోడిదే.

విశ్వా—నీ మగనికి వెఱ్ఱి ఎత్తినది. ధారపోయుటకు కారణమైనను ఎఱుఁగుదువా?

చంద్రమతి—కారణము ఏమైనను ఏమి? ఆయన ఆలాగున నిశ్చయించుటయే నాకు కావలసినది.

విశ్వా—ఎంత మతిమాలిన నిశ్చయమైనను సరేనా?

చంద్రమతి—మునీశ్వరా,

క. పతియే దైవంబు పతి-
వ్రతయగు సతి కెల్లగతుల వసుధన్; భగవత్
కృతములలో దోషంబే-
గతి కలుగును? కలుగ, అదియె గతి యగు సతకున్. 56

పతి చేసినది ఎట్టిదైనను నాకు సమ్మతియే. ఆయన చేసినదానిని కాదని నేనన్నఁడును అనను. ఆయన నన్ను అమ్ముకొన్నను నేనూరకుండ వలసిన దానని.

విశ్వా—ఏమి, నీకు దేవుఁడిచ్చిన స్వాతంత్ర్యమేమైనది? భగవత్సృష్టిలో స్త్రీపురుషులు సర్వవిధములను సమానులుగా ఉండుటకు ప్రయత్నించుటయే కదా నాగరికతకు ముఖ్యలక్షణము?

చంద్రమతి—నాకు మగఁడే దేవుఁడు; సృష్టికర్తకంటెను ముఖ్యుఁడు. ఆయన ఆజ్ఞయే నాకు కావలసినది. ఆయన ఆజ్ఞకు విరుద్ధముగా దేవుఁడు వచ్చి చెప్పినను వినను.

విశ్వా—పోనిమ్ము, నీకు దేవుఁడగు నీ మగఁడైనను నీకు స్వాతంత్ర్యమియ లేదా?

చంద్రమతి—స్వామీ, నా దేవుఁడు నాకు కావలసినంత స్వాతంత్ర్యమిచ్చినాఁడు. ఆయనతో అన్నివిధములను నన్ను సమానురాలినిగా చూచుకొనుచున్నాఁడు. ఆయన ఇచ్చిన స్వాతంత్ర్యమును ఉపయోగించియే నేను మగని మాట జవదాఁటననుచున్నాను.

విశ్వా—చంద్రమతీ, రాజ్యము పోవుట అనఁగా ఏమో నీకు తిన్నగా బోధపడినట్లు లేదు. నీమగనితో కూడ అడవుల పాలు కావలెను.

చంద్రమతి—అవును; ఆ సంగతి నే నెఱుఁగుదును.

విశ్వా—అడవుల పాలు కావలెనను మాటలు వినినంత సేపును సుఖముగానే ఉండును. అనుభవించినప్పుడే దాని కష్టము తెలియును.

సీ. నడవనోరువవు నున్నని గచ్చుటరుఁగులన్,
పుట్లపై గట్లపై పోవు టెట్లు?
గడప సేరవు తేనెకాల్వల నేనియు,
ఏటి ప్రవాహముల్ దాఁటు టెట్లు?
విడువఁ జాలవు క్రొత్త విరిపానుపులొకింత,
కటిక నేల పరుండఁ గల్గు టెట్లు?
తొడవనోపవు మేని తొడవుల నేనియు,
కొడుకుఁ జంకను నిల్పుకొనుట యెట్లు?
తడవు గాని నెచ్చెలులు చిలుకలను కాఁగ,
పొడవు మీడలనుండవు జడుపుచేత,
అడవి బెబ్బులుల్ బొబ్బలనిడెడు వేళ
విడువవా ప్రాణములు నీవు పడఁతిమిన్న? 57

చంద్రమతి—మునీశ్వరా, మీకు తెలియని సంగతులేమున్నవి?

సీ. పుట్టలు గట్టులున్నట్టి చోటైన, ను-
న్నని యరుంగులై కన్పట్టుచుండు;
పోటునన్ పారెడి యేటి వెల్లువలు, పూఁ-
దేనెకాలువలట్లె కానిపించు;
నిదురించుటకు జాతి నేలయేనియు, మెత్త-
నైన పూఁ బాన్పట్లుగానె తోఁచు;
కొడుకుఁ జంకను నిల్పుకొని నడిచిన, మేని
తొడవుకంటెను బరువు తోఁచకుండు;
అడవి బెబ్బులి బొబ్బలనాలకింప,
చెలుల పాటల రీతినే చెవికి తట్టు;
పతిని కూడి చరించెడు సతికి, నరక-
మైన స్వర్గంబు కైవడి నలరు గాదె? 58

నక్ష—(తనలో) ఆహా! ఏమి ఈ సాధ్వి పాతివ్రత్యము! దంపతులిద్దఱును పరమధన్యులు. వీరికి దైవము సర్వథా మేలు చేయును గాక!

విశ్వా—ఆ మగనికి తగిన మగువవు అగుదువు. ఓ వెఱ్ఱిదానా, మీరిద్దఱును కష్టములు పడఁగలరు గాని, ముక్కుపచ్చలాఱని ఈ ముద్దుబిడ్డఁడు రోహితాశ్వుఁడో?

రోహి—అమ్మా, నా గుఱించి ఏమనుచున్నారే?

విశ్వా—ఓయీ రోహితాశ్వా, మీ నాయనగారు రాజ్యమునంతయు ఈ మాలెతలు కోరఁగా వారికి ఇచ్చి వేయుచున్నారు.

రోహి—అవును; నాన్నగారు ఎప్పుడును అదే తీరు. ఏది కోరినను తీర్చుటే వారి వాడుక. నేనెప్పుడేది కావలెనన్నను లేదని ఇప్పటికి అని ఎఱుఁగరు.

తే. గీ. కోరినానొక పరి నాన్నగారి నూఱు
కుఱుచలౌ మంచి ఎఱ్ఱని గుఱ్ఱములను;
ఎల్లుగా సమకూర్చిరో ఎఱుఁగఁ గాని
కాదనక తీర్చిరా పొద్దె నాదు ముద్దు. 59

విశ్వా—అవునయ్యా, అది అంతయు బాగుగానే ఉన్నది. నీవు కొడుకువు గనుక నీ ముద్దుముచ్చటలు తీర్చుట ఆయనకు విధి.

రోహి—నా కోరికలే కావు; ఎవరు కోరినను ఆయన లేదనలేరు.

విశ్వా—సంతోషమే; కాని నీకు ముందుకు రాఁబోవు రాజ్యము నీ తండ్రిగారు దానమిచ్చుటకు అధికారము లేదు గదా అది ఎట్లు ధారపోయఁ గలరు. నీవు అడ్డు.

రోహి—మీరు చెప్పుచున్న సంగతి నాకు బోధపడలేదు. ఏమైనను, నాన్నగారు చేయఁబోవునది వద్దని నేనడ్డుదునా? ఎంత మాట?

విశ్వా—అట్లయినయెడల, నీ తలిదండ్రులతో కలిసి అడవులలో కష్టపడెదవా?

రోహి—నాన్నగారును అమ్మయు దగ్గఱ ఉన్నయెడల నాకు అడవియె పువ్వుల తోట; కష్టములే సుఖములు.

చంద్రమతి—(రోహితాశ్వుని చేరఁ దీసి) నా తండ్రీ, మీ తండ్రిగారికి పేరు తెచ్చెదవు?

నక్ష—(తనలో) ఈ దంపతులకు తగిన పుత్రుఁడు. ఇతఁడు చిరంజీవియై వంశము నిలుపఁ బెట్టును గాక!

విశ్వా—కుటుంబమునకంతటికిని ఒక్క వెట్టిరోగే పట్టినయెడల నేనేల అడ్డవలెను? ......హరిశ్చంద్రా, కానిమ్ము; దానమిమ్ము.

హరి—గణపతీ, నీళ్లను తెమ్ము.

గణ—నేను తేను...మిత్రమా, మిత్రమా, నా మాట వినవయ్యా; రాజ్యం ఇచ్చి చెడిపోకయ్యా. నిన్ను ఆశ్రయించుకొని ఉన్న మాకోసమైనా రాజ్యము నిలుపుకోవయ్యా.

చంద్రమతి—ఆర్యపుత్రా, ఇదిగో నీళ్లు నేను తెచ్చెదను. (పోవును.)

విశ్వా—(అపవారించి) నక్షత్రకా, నేనిప్పుడు హరిశ్చంద్రుని మునుపటి దానద్రవ్యమును ఇమ్మని అడిగెదను. నీవీతని వెంట వెళ్లి, ఆ సొమ్ము ఇచ్చు వఱకును ఇతనిని ఎల్ల విధములను బాధించి, ఏ విధముగా అయినను బొంకింపవలెను.

నక్ష—(అపవారించి) స్వామీ, ఈ కటిక పని నాకు వద్దు. మఱి ఎవ్వరినైనను పంపుఁడు.

విశ్వా—(అపవారించి) మఱి ఎవరిని పంపుదును? నాకున్న శిష్యుఁడవు నీవొక్కఁడవే. ఇప్పుడు నామాట నీవు విన్నయెడల, ఆ వెనుక నీవు ఏది కోరినను చేసెదను. లేకున్నయెడల, ఇప్పుడే శపించెదను.

నక్ష—(తనలో) ఇతనితో మనకెందుకీ గొడవ? ఒప్పుకొనినయెడల అన్ని చిక్కులును తీఱును. ఆ వెనుక నా ఇష్టమే కదా? (అపవారించి విశ్వామిత్రునితో) స్వామి, అలాగే కానిండు.

[చంద్రమతి జలకలశము పట్టుకొని వచ్చి హరిశ్చంద్రునకు ఇచ్చును.]

హరి—స్వామి, ఇదిగో ధార పోయుచున్నాను:

క. త్రికరణశుద్ధిగ నే మా-
మక రాజ్యంబెల్ల చంద్ర, మతి, కైకొనఁగా
ఇఁక నాది కానియట్లుగ
ఒకమాఱే ధార పోయుచున్నాఁడ నిదే. 60

దీనికి పంచభూతములు సాక్షిభూతములు.

గణ—ఓ చంద్రమతీదేవీ, రావమ్మా రా. నీకే రాజు రాజ్యం ధార పోస్తూ ఉన్నాఁడు.

విశ్వా—రాజా, ఈ గణపతి చూపించిన దారి బాగున్నది. ఈ రాజ్యము చంద్రమతిది.

హరి—స్వామీ, ఇది చంద్రకను, మతికిని, ధార పోసినాను. అట్లని నా ఉద్దేశము. అందుచేత వారిది.

విశ్వా—రాజా, అట్లయిన యెడల ఒక్క చిక్కు వచ్చును. ఇంతకు ముందు నాకు యజ్ఞము కొరకై కొంత ధనము దానము చేసి ఉంటివే. ఆ అప్పెట్లు తీర్పఁగలవు? రాజ్యమునైనను తిరిగి తీసికొమ్ము; లేదా, సొమ్ము ఇయ్యనక్కఱ లేదనినైనను అనుము. ఈ రెండవ పక్షమున నీ తండ్రికి మరల స్వర్గమును వచ్చును...... అట్లైతే అన్న మాట ఏమి? ఈ రెండు విధములలో దేనికి ఒప్పుకొన్నను, నీ తండ్రికిని నీకును స్వర్గము కలిగించెదను...నేను ఇంత దూరము చెప్పుచుండుట నీ మేలుకే అన్నది మాత్రము మఱచి పోకుము.

హరి—స్వామీ, నా మేలు కోరుచున్నందుకు మీకు కృతజ్ఞతా పూర్వకముగా నమస్కరించుచున్నాను. కాని మీరు చెప్పిన రెండు పక్షముల వలనను సత్యభంగమగును గనుక దేనికిని ఒప్పుకొనఁజాలను......రాజ్యము మాలెతలది; నేను మీకు ధనమీయవలసి ఉన్నది.

విశ్వా—ఎట్లియ్యఁగలవు?

హరి—తల అమ్ముకొని అయినను, ఇచ్చెదను. నెలదినములు గడువు పెట్టుఁడు. కాశికి వెళ్లి అక్కడ సొమ్ము సంపాదించి మీ అప్పు తీర్చెదను.

గణ—కాశిలో గాడిద గుడ్డు తప్ప మఱేమీ దొరకదు.

హరి—అక్కడకనేకులు తీర్థయాత్రకై వచ్చుచుందురు. వారిలో ఎవ్వరో నన్ను కొనుకొని అయినను మీ అప్పు తీర్చ వచ్చును. అలాగునను తీర్చ లేనియెడల, కాశీవిశ్వేశ్వర స్వామి సన్నిధిని తల బ్రద్దలు కొట్టుకొందును. అట్లు చేసిన వారి చివరి కోరికలు తీఱునఁట కదా? స్వామియే అప్పుడు నా అప్పు తీర్చును.

విశ్వా—నీ మూర్ఖము త్రిప్ప నా తరము కాదు. అలాగే కానిమ్ము. నా ఆశ్రమము లోనికి ఇప్పుడు రండు. మీకు కావి గుడ్డలు ఇచ్చెదను. ఇప్పటి మీ బట్టలును నగలును కూడ ఈ మాలెతలవి.

[అందఱును నిష్క్రమింతురు.]

ద్వితీయాంకము సంపూర్ణము.

శ్రీ

# చిత్రహరిశ్చంద్రీయము.

## తృతీయాంకము.

[పరిషదరంగము—విశ్వామిత్రుని ఆశ్రమము. విశ్వామిత్రుఁడు ప్రవేశించుచు:]

విశ్వా—ఆహా! వశిష్ఠా, నీ పంతమే నెగ్గెను కాఁబోలు? కాఁడు నందినీధేనువును, నేఁడు అర్థిజనులపాలిఁటి నందినీధేనువైన హరిశ్చంద్రుని, నా కొంప తీయుటకే కాఁబోలు సంపాదించినావు? ఇట్టి లోకోత్తరుఁడైన శిష్యుఁడు దొరకుటచేతనే నీవంత నిర్భయముగా దేవసభలో ప్రతిజ్ఞ పూనఁ గలిగినావు. నీ భాగ్యమే భాగ్యము.

చ. గురునకు పంగనామములు గుర్తుగ పెట్టెడు శిష్యచంద్రులీ
ధరణిని వేనవేలు; సతతంబును సత్పథవర్తనంబుచే
గురునకు సుప్రతిష్ఠ సమకూర్పఁగఁ జాలెడునట్టి శిష్యుఁడే
నరునకు కల్గు పూర్వజననంబుల పుణ్యము చేయకుండినన్? 61

ఆహా! ఈ హరిశ్చంద్రుఁడు లక్షలలోను కోటులను మాత్రమే కాక మనుష్యకోటియందెల్ల ఒక్కఁడుగానే లెక్కపెట్ట వలసిన వాఁడు. నా ప్రతిజ్ఞకు భంగము కలిగించుచున్నాఁడన్న ఏడుపు ఒకవైపు నన్ను పీడించుచున్నను, ఈతని దృఢమైన సత్యనియమమును ప్రశంసింపక మాన లేకున్నాను.

ఉ. "సత్యమె మంచి, దీజగము సత్యముచేతనె నిల్చు, ఎప్పుడున్
సత్యమె పల్కఁగా వలయు; సత్యము, సత్య" మటంచు నీగతిన్
నిత్యము బోధ చేసెడి మనీషులు కూడ, అగత్యమున్నచో
అత్యధికంబుగా మృషలనాడరె నోటికి వచ్చినట్లుగన్? 62

మనుష్యునకు అసత్యమాడుటయే సులువు; అసత్యమాడుటయే స్వభావము; అసత్యమాడుటయే లాభము. అట్టియెడల, సత్యనియమము పూనుట ఎంత దుర్లభ

ము? "సత్యము నిలువఁబెట్టుకొన్నవాఁడు నభూతో నభవిష్యతి," అని అందుచే తన నేనంటిని. నా పంతము పోఁగొట్టుటకే ఈ హరిశ్చంద్రుఁడు పుట్టెను గాని, ఇట్టి వాఁడును నభూతో నభవిష్యతి........ఆహా! ఏమి సత్యనియమము! ఏమి దృఢచిత్తము! తండ్రి నరకమునకు పోవుచున్నప్పుడైనను మానెనా? రాజ్యము పోవుచున్నదన్నను వెనుకతీసెనా? సంశయించెనా? విచారించెనా? పరమపుణ్యశీలుఁడైన ఇతనిని నా కులాభిమానమును కూడ మంటను కలిపి, ఈ పంతము మూలమున బాధ పెట్ట వలసి వచ్చినది గదా?......ఓ పాడుపంతమా, నీవెంతటిదానవు? చేయరాని దుష్కృత్యములనెల్ల చేయించి, గాధిపుత్రుఁడు విశ్వామిత్రుఁడన్న పేరు తెచ్చుటకు నీవు నాకెక్కడ దాపురించినావు?...బాల్యమునుండియు నన్నిలాగున పీడించుచునే ఉన్నావు:

సీ. పసితనంబున తల్లి ప్రార్థించినను, తిండి
మెక్కక పస్తుంటి నొక్కనాఁడు;
పోరు మాన్పఁగ తండ్రి బోధించినను, విన-
కుండ దెబ్బలు తింటి నొక్కనాఁడు;
గురువుగారనుమన్న కరణి నెప్పటికవ-
ల్కెక్కితి కోదండ మొక్కనాఁడు;
ఇంటివారలమీఁద నెగిరి, మూఁపట పడి
యుంటి పొరుగు పంచనొక్కనాఁడు;
కులము చెడితిని; తపమును కోలుపోతి;
కోపగొట్టనటంచు నల్గురును నింద
చేయ తలయొగ్గినాఁడ నీచేతనె కద?
పంతమా, నీదు జన్మంబు పాడు కాను! 63

......హరిశ్చంద్రా, హరిశ్చంద్రా, నా పంతమునకు నీవేల అడ్డుగా వచ్చినావు? నీ వంటి పరమపవిత్రుని బాధించుట నాకును కష్టముగానే ఉన్నది... ......విశ్వామిత్రుని వల్ల హరిశ్చంద్రుఁడు బాధ చెందెననుట కల్ల; హరిశ్చంద్రుని వల్ల విశ్వామిత్రుఁడే నిశ్చయముగా బాధ చెందుచున్నాఁడు: నిరపరాధియైన సాధుజనుని బాధించితినన్న పశ్చాత్తాపము, పంతము తీఱదేమో

అన్న బెంగ, సాధనముల కొఱకు వెదకు డోలాందోళనమును నన్ను నిద్రాహారములకు దూరముగా చేసినవి...ఏవిధమున ఆలోచించినను నా పంతమును వదలుకొనుటే ఉచితమేమో?..................ఆఁ? ఏమిది, కౌశికుని నోట ఇట్టి పేదమాటలు వెలువడుచున్నవి?...గాధేయుఁడే! ప్రతిజ్ఞను విడుచుటయే!

శా. లోకాలోకపరీతభూవలయముల్లోలంబు కానీ, నగా-
నీకంబుల్ మొదలంటగా కదలిపోనీ, పద్మినీవల్లభుం-
డాకాశంబుననుండి నేల పడనీ, అంభోధి నీరింకిపో-
నీ, కానంతయు పంతమున్ విడువఁ బోఁడీ కౌశికుండెన్నఁడున్. 64

ఇట్టి హరిశ్చంద్రులు మఱి వేయిమంది బాధపడవలసి ఉన్నను, నా ప్రతిజ్ఞ తీర్చుకొనక మానను. పట్టిన పట్టు చెల్లించుకొన ప్రయత్నింపని వాని జన్మమేల? కాల్పనా?......ఎంత మాట! పంతము విడుచుటయే? వసిష్ఠునిమీఁది నా కోప శ్శమై పోయెను? ఆ కోపము మఱల నా మనస్సున నిండినయెడల, హరిశ్చంద్రుని నియమములును గియమములును నాకు అడ్డురాఁ జాలునా? (పండ్లు పటపట కొఱుకుచు)

ఆ. వె. నాదు పూన్కి కడ్డుగా తగిలిన హరి-
శ్చంద్రచక్రవర్తి సత్యనియమ-
మేపుమాపు కొఱకు కోపంపురక్కసీ,
వడిగ పుట్టి తోడుపడుము నాకు. 65

[ఒక రాక్షసుఁడు పుట్టును.]

రాక్షసుఁడు—స్వామీ, పుట్టినాను.

విశ్వా—ఎవఁడవురా నీవు?

రాక్ష—స్వామీ, నేను దంతఘాతుఁడనే రాక్షసుణ్ణి.

విశ్వా—ఎలాగు పుట్టినావురా?

రాక్ష—స్వామీ, "కోపంపురక్కసీ, వడిగ పుట్టి తోడుపడుము నాకు," అని మీరనడం చేత నేను పుట్టాను. మీ దంతఘాతం వల్ల పుట్టాను కాఁబట్టి దంతఘాతుణ్ణి; సంధ్యాకాలాన్ని పుట్టాను కాఁబట్టి రాక్షసుణ్ణి.

విశ్వా—ఓరీ దంతఘాతా, "కోపమను రక్కసీ" అని నా ఉపదేశము. అయినను మంచిదే. కోపముగల నీ వంటి రాక్షసుఁడు నాకిప్పుడవసరము; శాంతుఁడైన నక్షత్రకుని వల్ల లాభము లేకున్నది.

దంతఘాతుఁడు—స్వామీ, నక్షత్రకుఁ డెవఁడు, అతఁడి వల్ల లాభం ఎంచేత లేదు?

విశ్వా—ఓరీ, వాఁడు నీ అన్న; నా జడలవల్ల పుట్టిన వాఁడు. బ్రాహ్మణుఁడగుట చేత శాంతుఁడైనాఁడు. హరిశ్చంద్రుని అడవిలో బాధింప వానిని ఒడఁబఱుచుటకు కృత్యాద్యవస్థ అయినది.

దంత—స్వామీ, హరిశ్చంద్రుఁడెవఁడు? అతఁడిని ఎందుకు బాధ పెట్ట వలెను?

విశ్వా—ఆహాహా! మొదటినుండియు నీకెక్కడనైనను బోధపఱుచుకొని రాఁగలను? ఇప్పటివఱకును జరిగిన సంగతులన్నియు తెలిసికొనుశక్తి మీ అన్నకువలెనే నీకును ఇచ్చితిని.

దంత—స్వామీ, తమకు నేను ఎలాగు తోడు పడాలి?

విశ్వా—ఆలోచించి చెప్పెదను...... రేపు కదా హరిశ్చంద్రాదులు వనమునకు బయలుదేఱుదురు? రేపటి సాయంకాలమున కార్చిచ్చు మూలమున హరిశ్చంద్రుని పరీక్షింపుమని నక్షత్రకునికి ఉపదేశించినాను; అప్పటికిని హరిశ్చంద్రుఁడు లొంగకుండినయెడల వేఱొక ఉపాయము చెప్పి నిన్ను పంపెదను... రమ్ము; ఇప్పటికి నిన్ను ఇతరుల కంటను పడకుండ దాఁచెదను.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

---

[ద్వితీయరంగము; అడవి. హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడు, నక్షత్రకుఁడు నడుచుచు ప్రవేశింతురు.]

నక్ష—ఆహా! ఏమి ఈ గ్రీష్మతీవ్రము! మింటినడుమ మిటమిట కాయుచున్న ఈ ఉష్ణకరుఁడు తనకిరణపు చేటలతో వేఁడి నిప్పులను చెరిగి పోయుచున్నాఁడు. ఎటు కదలినను వేఁడి తగులునని భయపడి కాఁబోలు చెట్లు తమ ఆకులనైనను కదల్పకున్నవి. ప్రజల బాధలకు భూదేవి పుచ్చిన వేఁడి నిట్టూర్పుల వలె లేచుచున్న ఆవురులు దూరమున జలభ్రమ కలిగించుచు విశ్వామిత్రసృష్టికి నిదర్శనములగుచున్నవి. లోకమునకెల్లను మిత్రుఁడైన సూర్యుఁడు, గ్రీష్మదోషముచే విశ్వామిత్రుఁడైనాఁడు. ఓ హరిశ్చంద్రా, విశ్వామిత్రుఁడగుటచేతనే కాఁబోలు నిన్ను బాధించుచున్నాఁడు...అయ్యో, పాపము! ఈ ఒక్క పూట, ఈ

అయిదాఱు అమడలు నడుచుటచేతనే నీవు ఇట్లు బడలి పోయినావు. ఈ నెల దినములును ఎట్లు బాధలకు నిలువఁగలవు? కాఁబట్టి నా మాట విని మా గురువుగారి మాట నిలువఁ బెట్టుము. నీకష్టములు గట్టెక్కును.

హరి—నక్షత్రకా, అలవాటు లేక పోవుటచేత ఈ జీవనము మొదట నాకు కొంచెము కష్టముగా కనిపించవచ్చును కాని క్రమక్రమముగా అదే అలవాటగును? ఎందఱెందఱు నరులు కష్టములలోనే పుట్టి కష్టములలోనే పెరిఁగి కష్టములలోనే చచ్చుచున్నారు కారు? వారందఱికంటె నాహెచ్చేమి?...ఈమాత్రపు కష్టమునకు భయపడి సత్యనియమమును వదలుకొందునా......నా కష్టమునకేమి...అయ్యో! దేవీ,

మ. రవివంశంబును చొచ్చియుండుట అసూర్యంపశ్యవీవయ్యునున్,
భవదీయాస్యము పున్నపున్ శశివలెన్ భాసిల్లుటన్ భాస్కరాం-
శువులన్ చూడఁగ రానిదయ్యు, ఇపుడిచ్చో మెండుగా మండువే-
సవి వేరెండను తాపమొందు దురవస్థన్ పొందినావే? అయో! 66

చంద్ర—ఆర్యపుత్రా, మీశీతలకృపావలోకనములలో మునుఁగుచు, మీ చాటున ఉన్నదానను గాన నాకీ ఎండ బాధ ఏమియును తోఁచుట లేదు. సుకుమారశరీరులు, మీరేమి గాసి చెందుచున్నారో అనియే నాహృదయము తల్లడిల్లుచున్నది.

మ. తన వంశంబునకెల్ల భూషణము, వాధారంబవున్ నీవెయ-
య్యును, నీపై కృప యుంచుకేనియును లేకుండన్ సహస్రాంశుఁడీ
పెను తాపంబున నీతనూకనకమున్ స్వేదంబు రీతిన్ కరం-
చెను: నీ తేజము కాంచి యీర్ష్య గొనెనో చిత్తంబునందన్నటుల్.

రోహి—నాన్నగారూ,

హరి—నాయనా, ఏమి? ఆయాసముగా ఉన్నదా?......అయ్యో, ఇంతటి పసితనమున వీనికి ఎట్టి అవస్థ కలిగినది?

ఆ. వె. ఒక్కచెంప పాలు, ఒక చెంప నీరును
కాఱు వాఁడు; ముద్దుగాఱు వాఁడు;

కన్నులైన తిన్నగా పీడియుండని
వాఁడు బాధ చెంద వలసె నేఁడు. 68

నాయనా, ఆయాసమైనయెడల రమ్ము; ఎత్తుకొనెదను.

రోహి—నాన్నగారూ, బాధ అని చెప్పుటకు మిమ్ము పిలువ లేదు. మన వెనుక వీధినుండి ఎవ్వరో వచ్చుచున్నట్లున్నారని చెప్పుటకు పిలిచినాను.

చంద్ర—(వెనుకకు తిరిగి చూచి) ఆర్యపుత్రా, అతఁడు విశ్వామిత్రుఁడేమో?

నక్ష—అబ్బే! మాగురువుగారికి తెగ బారెఁడు గడ్డముండవలెను; ఇంత కురుచగను ఉండదు.

రోహి—నాన్నా, నాన్నా, అతఁడు మన గణపతియే.

హరి—అవునవును గణపతియే...ఇప్పుడు స్పష్టముగానే కనఁబడుచున్నాఁడు...మనము బయలుదేఱు సరికి ఇతఁడయోధ్యనుండి తిరిగి రాలేదు. ఇతనితో చెప్పకుండ వచ్చినాము కదా అని నాకును విచారముగానే ఉన్నది.

నక్ష—ఇతఁడిప్పుడు ఎందుకీలాగు కాళ్లీడ్చుకొనుచు వచ్చుచున్నాఁడు?

హరి—ఇతఁడు పైకెన్ని హాస్యములాడుచు గడుసువానివలె కనఁబడుచున్నను మనసేమో మెత్తనిది. అందులోను నేనన్నయెడల ప్రాణము పెట్టును. నన్ను విడువలేక వచ్చుచున్నట్లు తోఁచుచున్నది.

[గణపతి ప్రవేశించును.]

గణ—ఓయీ మిత్రమా, ఆఁగవయ్యా. మీరీలాగు దయ్యపు అడుగులు వేస్తూ నడిస్తే మఱి నేను మిమ్మలిని కాశిలోనే కలుసుకోవాలి గాని ఈలోపుగా లేదు... (సమీపించి) అమ్మయ్యా! ఇక్కడికి ప్రాణాలు కూఁటను బడ్డవి.

నక్ష—ఏమి, ఈ ఆయాసమెందుకు? ఏమి పనిమీఁద వచ్చినావు?

గణ—అయితే మిత్రమా, నాతో చెప్పకుండా వెళ్లిపోవస్తారూ?...మీరూ బయలుదేఱి ఒక నూఱడుగులు వేసారో లేదో, నేనూ బయలుదేఱాను. అక్కడి నుంచీ మిమ్మలిని కలుసుకుందామని ఎంత వడివడిగా అడుగులు వేసినా ఏం లాభం? సుకుమారుఁడను, నేను మీతో సరిగా నడవఁ గలనా?

చంద్ర—అయ్యో, పాపము! ఎంత కష్టపడిపోతివా కదా?

గణ—అమ్మా, నా కష్టం నీలాంటి దానికేం తెలుస్తుంది? రత్నకట్టిమాలమీఁద నడవడం అలవాటు పడ్డదానవు కాఁబట్టి దారిలోని రాళ్లకు నీకట్టే బాధ అ-

నివసించి ఉండదు. పువ్వులమీఁద నడిచేవాఁడవు కాఁబట్టి అప్పుడప్పుడు నీకు ముళ్లు గుచ్చుకోవడం కూడా ఉండేది. ఆ లాంటి ఘోషలేమీ లేకుండా పెరిగిన నాకీ ముళ్లదారి ఎంత కష్టం!......నాకొక్కటి వింత వేస్తూ ఉంది. ఈ బాట కాశీయాత్ర చేసే కోట్లకొలఁది బాటసారుల కాలిజాడుల చేత నలిగింది కదా? ఇంకా ఇంత కరుకుగా ఉందేం? ఇది విశ్వామిత్ర సృష్టి కాదు కదా?

నక్ష—(తనలో) కాదా మఱి? ఇట్టి దారిలో బాధపడ లేక పోవుటచేతనైనను, ఈమహారాజు బొంకునేమో అని గురువుగారి ఆశ...వెఱ్ఱిఆశ! (ప్రకాశముగా) ఓయీ గణపతీ, నీ మిత్రునియొక్క సెలవు పుచ్చుకొని మఱి తిరిగి పొమ్ము.

గణ—నేనెక్కడికి తిరిగి పోయేది? అయోధ్య ఏమో వాలుపల్లె అయి పోయింది. ఇఁక మంగళాష్టకాలు ఒక్కటే లోపం. మా బ్రహ్మిగాళ్లు ఇఁక అక్కడ ఏలాగు ఉండడం? మా గతి ఆలోచించి అయినా ఇతగాఁడు రాజ్యం నిలువఁబెట్టుకొంటాఁడని మహా ఆశపడ్డాను. అది జరిగిందికాదు. ఆశలన్నీ అడుగంటిన వాఁడికి కాశీయాత్రయే గనుక నేనూ మీతోనే వస్తాను.

హరి—అయ్యయ్యో! గణపతీ, ఇదెక్కడి వెఱ్ఱి? సుకుమారుఁడవని నీవే చెప్పుకున్నావు. అట్టివాఁడవు, మాతో అడవులయందు ఇడుమలు పడఁగలవా? నా మాట విని నిలిచి పొమ్ము.

గణ—మిత్రమా, తీరా మాట జాఱి పోయింది. ఇఁక ఏలాగు తప్పుతుంది? మాట నిలువఁబెట్టుకోవడం నీకొక్కఁడికే కాని మాకెవ్వరికీ కూడదా ఏం?

హరి—నీవాలాగున అనుచున్నావు గనుక నేను మఱి ఏ అభ్యంతరమును చెప్పను.

నక్ష—(తనలో) ఇతఁడు వచ్చుటయు నాకు కొంత కాలక్షేపము. మా గురువుగారు పెట్టుమని చెప్పిన బాధ ఇతనినే పెట్టెదను.

గణ—మిత్రమా, వస్తాను కాని మీరిప్పుడు వేస్తూ ఉన్నంత వేగిరావడుగులు వేస్తే నా తరంకాదు.

హరి—అట్లయినయెడల, ఇదిగో మెల్లగానే నడుచుచున్నాము.

నక్ష—గణపతీ, గణపతీ; చచ్చినాను. (చతికిలఁ బడును.)

హరి—ఏమి నక్షత్రకా, ఏమి ఆయాసము కలిగినది? (దగ్గఱకు చేరును.)

నక్ష—ఇఁక నేనడుగు తీసి అడుగైనను పెట్టలేను. ఆయాసముగా ఉన్నది; కాళ్లు పీఁకుచున్నవి; అడుగులు మండుచున్నవి; కన్నులు తిరుగుచున్నవి. (కాళ్లు చాఁచును.)

హరి—ఇదిగో నా చేయి ఊఁత; ఇది పట్టుకొని మెల్లగా లేచి రమ్ము. పొద్దును తిరిగినది. ఇఁక ఎక్కఁడనో ఈ వేళకు ఆఁగుదము.

నక్ష—రాజా, లేచుటకు శక్తి చాలకున్నది. ఈ గణపతి భుజముల మీఁద ఎక్కి మెల్లగా ఎట్లో కష్టపడి వచ్చెదను.

గణ—అమ్మో, నాభుజాల మీఁదే? నా కడుపే నేను మొయ్యలేక ఏలాగో ఈఁడుకొని వస్తున్నాను. పేఁడకుప్ప మీఁద కుక్కగొడుగు లాగు నువ్వు కూడా నా భుజం ఎక్కితే ఇఁక ఇక్కడనే బస. పొత్త్ర్లు మొయ్యడం కష్టమనే పౌరోహిత్యం మానుకొన్నాను. బక్క నక్కలాగు కనఁబడుతూ ఉన్నా నీవు పది పొత్త్ర్లకు ఏమీ తక్కువ బరువు ఉండవు. అమ్మయ్యో, నిన్ను మొయ్యడమా? ఆమాట అంటేనే నాభుజం నొప్పి పెట్టుతూ ఉంది. నువ్వు మఱి నడిచి రా లేకపోతే ఇక్కడే మాటాడకుండా కూర్చో. నీ లాంటి నక్కలు కొన్ని సహపంక్తికి వస్తవి.

నక్ష—ఓయీ దొడ్డ శాస్త్రుఁడా, నన్నిక్కడ నట్టడవిలో నక్కల పాల పడవేసి బ్రహ్మహత్యామహాపాతకము కట్టుకొందువా? కొంచెము వంగు; నీ భుజముమీఁద గుజ్జుపుపండు ఎక్కెదను.

గణ—గుజ్జప్పంతా లేదు; గాడిదకాయా లేదు. నువ్వు చెల్ చెల్ గుజ్జమని సవారీ చెయ్యడానికే నాకు భుజం ఉన్నదనుకొన్నావా ఏం? నరవాహనం లేనిదీ నడవలేక పోవడానికి నువ్వు నైఋతి లాగు రాక్షసుఁడవు కాఁబోలు! నిన్ను మోయఁగల బలమే నాకు ఉంటే శవాల మోఁతకే కుదురుకొని ఉందును.

నక్ష—గణపతీ, అనాథుఁడను; ఈ మాత్రపు పుణ్యము కట్టుకొమ్ము.

గణ—కావలిస్తే అనాథప్రేతసంస్కారపుణ్యం కట్టుకొంటాను గాని నేను నిన్ను మొయ్యలేను.

నక్ష—గణపతీ, గణపతీ, (చెంగు పట్టుకొనును.)

గణ—(విడిపించుకొనుచు) ఆహాహా!...ఓ మిత్రమో, ఈ తారకుఁడు నాకెక్కడ దాపురించినాఁడయ్యా? నిన్ను బాధించడానికని విశ్వామిత్రుఁడు పంపిస్తే పిశాచం లాగు నా మీఁద పడుతూ వదలడేం?

హరి—ఓయీ గణపతీ, తొందర పడకు...తారకుఁడనెదవేమి? ఈయనపేరు నక్షత్రకుఁడు.

గణ—తారకుఁడో; నక్షత్రకుఁడో. నాశాస్త్రాలు ఈ లాగు బేజారు పెట్టుతూ ఉంటే నాకు పేరులెక్కడ జ్ఞాపకం ఉంటవి?...అదీ గాక "తార," అంటే

నక్షత్రం కదా? కాఁబట్టి తారకుఁడన్నా నక్షత్రకుఁడన్నా ఒకటే; సురలను తారకుఁడేలాగు బాధ పెట్టాఁడో ఆలాగే భూసురుఁడివి నన్ను బాధ పెట్టుతూ ఉన్న ఇతఁడు తారకుఁడనడానికి తగదా ఏం?

హరి—సరే, సరే. ఆయన వల్ల నీకు బాధ కలుగనీయను లే. దేవీ, ఇదిగో రోహితాశ్వుని నీవు నడిపింపుము. నేను నక్షత్రకుఁడు నడువలేకున్న యెడల ఎత్తుకొనెదను.

నక్ష—(గబాలున లేచి) రాజా, నేనే వచ్చెదను లే. ఆయాసము కొంచెము తగ్గినది.

చంద్ర—ఆర్యపుత్రా, కొంత సేపటినుంచియు ఆకాశమున మబ్బు దట్టమగుచున్నది. అందుచేతనే కాఁబోలు వెట్ట అధికమగుచున్నది...ఇప్పుడు కేవలమును సహింప శక్యము కాకున్నది.

హరి—(నిదానించి చూచి) దేవీ, అవి మబ్బులని నేననుకొనను...ఆహా! ఇప్పుడు వేఁడి గాడ్పు వచ్చుచున్నది...ఏదో కాలుచున్న కమరు కంపును కొట్టుచున్నది...అదిగో, చిటపిటమని ఏవో పేలుచున్న చప్పుడు కూడ వినఁబడుచున్నది......ఇది కార్చిచ్చు.

నక్ష—(తనలో) అవును. ఇది కార్చిచ్చే. దీని మూలముననే కదా ఈ రాజచంద్రుని పరీక్షింపుమని మా గురువుగారు నాకు చెప్పినారు.

గణ—ఓహో! మిత్రమా, ఈ లేళ్ల మందలు వెనుక చూడకుండా గాలి కంటె కూడా వేగంగా మనవైపు ఏలాగు పరుగెత్తుకొంటూ వస్తున్నవో! దొడ్డి సంభావనలకు వెళ్లే బ్రాహ్మలకు తప్ప మఱెవ్వరికీ ఇంత పరుగు ఉండదు.

హరి—ఒక్క లేళ్లే అన్న మాట ఏమి? అడవి జంతువులన్నియు కార్చిచ్చు భయముచేత తమ జాతివైరములను కూడ మఱచి కలిసి ఇటువైపు పరుగెత్తుకొని వచ్చుచున్నవి. ఆహా! మరణభయము జంతువులకన్నిటికిని సహజమే కదా?

నక్ష—రాజా, కార్చిచ్చు ఇట్లే వచ్చుచున్నట్లున్నది.

గణ—అమ్మయ్యో! ఇఁక మన గతి ఏలాగు? మిత్రమా,... ఏదో మనం తప్పించుకొనే ఉపాయం చూడవయ్యో.

హరి—గణపతీ, భయమేల? శివుని ఆజ్ఞ లేనిదియు చీమయైనను కుట్టదు. అంతగా శివుని ఆజ్ఞయే ఉన్న యెడల అది ఎట్లును తప్పదు...నక్షత్రకా, నీవు చెప్పినది నిశ్చయమే. అదిగో, కార్చిచ్చు దగ్గఱపడుచునే ఉన్నది...ఇప్పుడు స్పష్టముగానే కనఁబడుచున్నది. ఆ వంక చూడుము.

సీ. ప్రాణులన్ చంపిన పాతకసంఘాత-
మన పొగ గుప్పుగుప్పనుచు సెగయ,
అనలకణాళి రోషారుణాక్షులనుండి
తొలఁగినట్టులు మిడుంగుఱులు చెదర,
జఠరాగ్ని బాధచే చటులదంష్ట్రలు కొఱి-
కినయట్లు చిటపిటధ్వనులు పుట్ట,
చెట్లమీఁదకు రక్తసిక్తజిహ్వాగ్రముల్
చాఁచి నాకినయట్లు జ్వాలలెగయ,
బట్టబయలున గాలిచే కొట్టుకొనుచు,
నెత్తురు తరంగములతోడ నిండియున్న-
యట్టి పెనుసముద్రము రీతి నగపడెనదె
కన్నులకు భీతి కొల్పుచు కాఱుచిచ్చు. 69

గణ—ఓయీ మిత్రమా, ఈ లాంటి మహోపద్రవసమయంలో వర్ణనకు తగులు కొన్నావేమయ్యో? అది నా చెవిని పడనే లేదు; అంతకు ముందు చెప్పిన వేదాంతపు ముక్కలు అసలే నా చెవికెక్క లేదు. ఈ అపాయం తప్పే ఉపాయం ఏదో ఆలోచించు...అదిగో, ఆ పెనుభూతం నాలుకలు చాఁచుకొంటూ మింగడానకు మన మీఁదకు మహా జోరుగా వస్తుంది. వెట్ట విస్తారం అయిపోయింది. ఇక్కడ నిలువ లేకుండా ఉన్నాము. వెనుకకు పాఱిపోదామంటే కార్చిచ్చు నాలుగు దిక్కులనూ ఒక్కలాగు అల్లుకొంటూ వస్తూ ఉంది.

వాః—ఓయీ గణపతీ, ఆపద తప్పించుకో శక్యము కాని లాగుననే కనఁబడుచున్నది. కార్చిచ్చు నాలుగు దిక్కులనుండియు క్రమ్ముకొని వచ్చుచున్నది. మనము దైవము మీఁద భారము వేసి నిలువఁబడ వలసినదే కాని అంతటి మహాభూతముల యెదుట మనుష్యుఁడేమాత్రము?

శా. భూకంపంబుల నాఁపఁ జాలునొ? పురంబుల్ ముంచు పెన్ వెల్లువల్
రా కుండంగను నిల్ప నేరుచునొ? ఘోరంబైన దావాగ్నులన్
పోకార్పం గలఁడో? బలాపు సుడిగాడ్పున్ మాన్పునో? పిడ్గు మే-
న్తాఁకన్ కూలక నిల్చునో? మనుజుఁడన్నా! దుర్బలుం డన్నిఁటన్.

రోహి—అమ్మా, వెట్టగా ఉన్నది. మొగము మీఁదకు కాఁడి ఆవిరి కొట్టుచున్నది. పొగచేత ఊపిరి సలుపకున్నది. ఇక్కడ నిలువఁబడ లేకున్నాను.

చంద్ర—నాయనా, భగవద్విలాసము ఏలాగున ఉన్నదో కాని, మనకిట్టి ఆపద ఏల కలుగనై ఉన్నదో తెలియదు. ఇదిగో, ఈ బట్ట మొగమునకు అడ్డుగా పెట్టుకొని నా చాటున నిలువఁబడుము. నిన్ను అన్ని విధములను దేవుఁడే రక్షించును గాక!

నక్ష—ఓయీ గణపతీ, ఈ వనము తీరు చూడు; ఎంత దర్శనీయముగా ఉన్నదో!

చ. చుఱచుఱలాడుచున్, దొరలుచున్, పొరలాడుచు, లేచియాడుచున్,
కరములు చాఁచుచున్, కలయఁ గ్రమ్ముచు, నెత్తురు వెల్లువట్లుగా
బిరబిగ వచ్చు చిచ్చునను బిట్టుగ కాలి వనంబు సంజచే
ఎఱుపును కన్న నింగి వలెనే కడు సొంపుగ నున్నదద్దిరా! 71

గణ—అద్దిరా?...ఇదేం బుద్ధిరా? నీ వర్ణన మండినట్లే ఉంది. ఒకవైపు అడవి ఎల్లా తెగకాలి జంతువులన్నీ చస్తూ ఉండగా, ఇంకొకవైపు "మన గతి ఏమవుతుంది భగవంతుఁడా," అని నేను ఏడుస్తూ ఉండఁగా, ఈ కార్చిచ్చు చూడడానకు నీకు సొంపుగా ఉందా? ఇప్పుడు ఎఱ్ఱగా సంజలోని ఆకాశం లాగు ఉంటే, ఇంకొక్క గడియసేపటికి నల్లగా మాడి పోయి చీకటి కమ్మిన ఆకాశం లాగే ఉంటుంది. ఈ లాంటి వెఱ్ఱి మొఱ్ఱి వర్ణనలు కట్టి పెట్టి మనం తప్పించుకొనే ఉపాయం ఏదైనా వెదుకు.

నక్ష—(తనలో) అయ్యో! ఇఁక ఈ మహారాజను పరీక్షింప వలెను......అయినను, అది గురునియోగము గనుక ఆ పాపము నాకు కలుగకుండును గాక! (ప్రకాశముగా) గణపతీ, ఉపాయము వెదుకనక్కఱ లేదు. ఇంతకు ముందే తెలియును.

గణ—(గంతుచు) ఏమిటీ, కార్చిచ్చునుంచి తప్పించుకొనే ఉపాయం నీకు తెలుసునా? మిత్రమా, మిత్రమా, ఇఁక మనం బ్రతికి పోయాం. ఓయీ నక్షత్రకా, మఱి నీళ్లు నమలక ఆ ఉపాయం ఏమో త్వరగా చెప్పు.

నక్ష—గణపతీ, ఇది అరణ్యమునకు వచ్చుచున్నప్పుడు నా గురువుగారు నాకు చెప్పిన సంగతి. అడవిలో కార్చిచ్చు బాధ కలిగినప్పుడు, అది తప్పించుకొనుటకు ఆయన చెప్పిన మార్గము ఒకటే. తనపేరు తనది కాదని ఎవ్వరందురో,

అట్టి వారిని కార్చిచ్చు కాల్చదఁట! అట్టివారు ఏ బాధయు లేకుండ, కార్చిచ్చులో నడిచి పోవచ్చును. కావలసినయెడల, ఈ చిచ్చున చొచ్చి చూడు.

గణ—చొచ్చేదా? ఉలుకుబలుకుమన్న నా సవతే కాని ఉలికే నా సవతి లేదన్నట్లు, కార్చిచ్చులో నన్ను ముందు పడమంటావేం? అగ్నిలో పడడం ఏమిటి? కాలక పోవడం ఏమిటి? ఇదా నీకు పరియాచకాలకు సమయం?...అమ్మయ్యో, మంటలింక పది బారల దూరంలోనే ఉన్నవి......ఓయీ అగ్నిదేవుఁడా, ఇది నీకు న్యాయం కాదు; నా లాంటి సద్బ్రాహ్మణుఁడినీ, నిరతాగ్నిహోత్రినీ, చంపడం ఘోరపాతకం సుమీ. సర్వభక్షకుఁడవు కదా అని నన్ను కూడా భక్షిస్తావేమో! అలాగైతే బ్రహ్మహత్యాపాతకం నిన్ను చుట్టుకొంటుంది సుమీ. అది తప్పించుకోవడానికి నిన్ను కంటను పెట్టుకొన్న వాఁడికే శక్యమయింది కాదు; నీకేలాగు అవుతుంది? భద్రం, ఆలోచించుకో.

నక్ష—ఓయీ గణపతీ, నీకు నామాటలు నమ్మిక కలుగ లేదు కాఁబోలు! అట్లయినయెడల, ఇదిగో నేనే మొదట ఈ కార్చిచ్చున నడిచి వెళ్లెదను. (ముందునకు నడిచి) ఓ అగ్నిదేవా, నేను నక్షత్రకుఁడను కాను; నన్ను దహింపకుము. (దావాగ్నిలో నడచి అవలకు పోవును.)

గణ—నక్షత్రకా, నక్షత్రకా, సాహసం చెయ్యకు. నిష్కారణంగా కాలి పోతావు...అయ్యయ్యో! ఇతఁడు కళ్లకు చెయ్యి అడ్డుగా పెట్టుకొని కార్చిచ్చులో చొరఁబడుతూ ఉన్నాఁడు. హా! హా! ఈ ఘోరం చూడ లేను.........ఆహా! ఆహా! ఏం ఆశ్చర్యం! మిత్రమా, మిత్రమా, నక్షత్రకుఁడు తలవెండ్రుకయినా వాడకుండా అవతలకు చేరినాఁడు. మనమూ ప్రాణాలు దక్కించుకో వచ్చును.

హరి—గణపతీ, నీవు వెళ్లుము.

గణ—నువ్వో?

హరి—ఓయీ, నా పేరు నాది కాదని చెప్పుకొన్ననే కాని, కార్చిచ్చును దాఁట శక్యము కాదు. మఱి నేనెట్లు వచ్చెదను?

గణ—"హరిశ్చంద్రుఁడను కాను," అన్న ఒక్క ముక్కలోనే ప్రాణాలు దక్కిపోతవే. దీనికే ఇంత ఆలోచన ఏల? బ్రతికి ఉంటే బలుసాకన్నాఁడు. అపైని సత్యం మాట చూచుకొందాం; మఱి రా; ఆలస్యం చెయ్యకు.

హరి—గణపతీ, ఏల ఆరాట పడెదవు? నా ప్రాణము పోవుననియా? పోయినని

ము? ఎప్పుడో ఒకప్పుడు పోవలసినదే ఉన్నది. తనువులు శాశ్వతములు కావు. నాని కొఱకు శాశ్వతములైన స్వర్గసౌఖ్యములను పోఁగొట్టుకొనుట వెఱ్ఱితనము. ఇప్పుడీ దావాగ్నికే భయపడిన యెడల, ఇంతకంటె ఎన్నో మడుఁగులు ఎక్కువై శాశ్వతముగా ఉండెడి నరకాగ్నికి ఎంత భయపడ వలెను?... ఇవన్నియును గాక, ఈ ఒక్క సంగతి ఆలోచింపుము:

క. అనృతంబులాడు పాపా-
త్ముని నగ్నియు ముట్టకుండ తొలఁగి చనునటం-
చును వింటివి గాదే? ఇఁక,
అనృతవచస్కునికి నెట్టులబ్బును సుగతుల్? 72

గణ—మిత్రమా, నీకు అసత్యదోషం రాకుండేటట్టున్ను, ప్రాణాలు దక్కేటట్టున్ను, ఒక ఉపాయం చెప్పుతాను విను: చిచ్చు దాఁటుతున్నపుడు, ''నేను హరిశ్చంద్రుఁడను కాను'' అని దీర్ఘం తీసి పలికి, దాఁటగానే ''అన్నమాట అబద్ధం,'' అని కలుపు.

హరి—గణపతీ, అది మాత్రము అబద్ధము కాదా? అగ్నిదేవునికి అసత్యమును తెలుపవలె ననియే కదా నా ఉద్దేశమగును? అసత్యమునకు తోడు దేవుని మోసము చేయుట కూడనా? ఇఁక నాకీ సంగతి గురించి బోధపఱచవద్దు.

గణ—అమ్మా, నువ్వయినా ఈ దావాగ్నిని దాటి ప్రాణాలను దక్కించుకుందువు గాని, వేగం రా.

చంద్ర—అయ్యా, గణపతీ, ఇవి ఏటిమాటలు? ఆర్యపుత్రుని వదలుకొని నేను ప్రాణములను దక్కించుకొందునా? అట్టి వట్టి భ్రాంతి కలలోనైనను పొందకుము. అదియుఁ గాక,

తే. గీ. సత్యమును నిల్పుకొన తండ్రి సద్గతులను,
తనదు రాజ్యమున్, ప్రాణమున్, ధారపోయ
సంశయించని పుణ్యాత్ము సతినగుచును,
నేనసత్యంబు పలుకంగ నేర్తు నెట్లు? 73

గణ—అమ్మా, ఈయనకు ఉన్నట్టు నీకసత్యదోషభయం లేదు. సతికి అన్నింటికంటె ముఖ్యమైన విధి పతి మాట జవదాఁటకపోవడమే. పతి ఆజ్ఞను ఖట్టి చేసి

నది పాపకార్యమయినా, దానివలన ఆమెకు దోషం అంటదు. కాబట్టి మళ్ళ సంశయించ వలసిన అవసరం లేదు. ఈయన ఆ ఆజ్ఞ ఇచ్చేటట్లు నేను చేస్తాను. ఈ లాగు నేను చెప్పడం ఈ రోహితాశ్వుడి కోసం.

చంద్ర—(కంటను తడిపెట్టుచు) అయ్యో! చిన్నికుమారా, ఈ బాధ ఏలాగు పొందఁగలవురా?

రోహి—అమ్మా, నాకోసము నీవు గాని నాన్నగారు గాని విచారించ వలసిన అవసరము లేదు.

ఉ. చావన నేమిరో యెఱుఁగ; చావు భయంకరభూతమట్లుగా
మీవచనంబులన్ తెలిసె; మీరలు మీకయి శోకమొందఁగాఁ
బోవక, బాలకుండనను బుద్ధిని నాదు నిమిత్తమై ఇదే-
మీ వగపేల పొందెదరు? మీవలె నేనును చావఁజాలనే? 74

చంద్ర—ఆహా! నాయనా! ఎంతటి బుద్ధిమంతుఁడవైతివి! (ముద్దు పెట్టుకొని)... గణపతీ, ఆర్యపుత్రుని ఆజ్ఞ అయిన వెనుక, ఎట్టి కార్యమైనను నేను చేయక తీరదు; కాని, నన్ను పాపకార్యమునకు ఆయన పురికొల్పరని నాకు నమ్మకమున్నది. ఆ పాపము నన్ను చుట్టుకొనక పోయినయెడల ఆయనను చుట్టుకొనక తీరదు. గదా! నా చావునకు భయపడి ఆయన ఆపాపమునకు ఏల ఒడిగట్టుకొన వలెను? అదియును గాక, ఆయనను వదలుకొని నేనెట్లు బ్రదుకుదును? నేను ఆయనకు అర్ధాంగిని గదా? సగము దేహము కాలి పోయిన వెనుక మొండి బ్రదుకు నేనెట్లు బ్రదుకఁగలను?

గణ—అమ్మగారూ! ఈ మంటలు సమీపిస్తూ ఉన్నవి. అప్పుడే శరీరానకు తగులుతూనే ఉన్నవి. మధ్య వచ్చిచెట్లు ఉండడంచేత ఇంతసేపైనా ఆఁగినవి. నాకు ప్రాణాలంటే మహా తీఁపు. కాని నా వెంట మీరు రాక పోతే నేనూ మీ ప్రాణాలకు ఉసురుమంటూ ఇక్కడ ఆఁగి పోవలసిన వాఁడనే. బ్రాహ్మఁడను అని అయినా చూడకుండా ఈ దావాగ్ని నన్ను కూడా దహించి వేస్తుంది. ఆ బ్రహ్మహత్యా పాపం మిమ్మలిని చుట్టుకొంటుంది. కాఁబట్టి వెంటనే నా వెంట మీరు రండి.

హరి—దేవీ, గణపతి చెప్పినట్లు ఆలస్యమునకు వీలు లేదు. ఏమి చేయ నిశ్చయించితివి?

చంద్ర—ఆర్యపుత్రా! నన్ను వేలుగా అడుగ వలయునా? నా గతియు మీ తోడిదే......కాని నాకొక్క ఆశ మిగిలియున్నది. మీరు విశ్వామిత్రుని ఋణము తీర్చెదనని అనియుంటిరి కదా? తీర్చకుండ, మీకు చావెట్లు వచ్చును?...అదియును గాక, ఈ అగ్నిదేవుఁడు అబద్ధములాడెడు వారినే రక్షించినప్పుడు, నిజము పలికిన వారిని ఏల భక్షించును? (కార్చిచ్చు వైపు తిరిగి)

దండకము.

శ్రీమన్మహాదేవు విజ్ఞాననేత్రంబవై స్తోత్రపాత్రంబవైనట్టి ఓ అగ్నిదేవా, పవిత్రస్వభావా, అతీతప్రభావా, జగజ్జాలమున్ బ్రోవ వేదంబులం బట్టి ముఖ్యంబవౌ వేల్పు పూహింపఁగా నీవ కావా? ధరిత్రీస్థలిన్ మానవుల్ నిల్చియుండెల్ల నీ వల్లనే: నీవు వెచ్చందనంబీయకున్నన్ హిమానీప్రభూతంబులౌ బాధలెన్నెన్నియో చెందుచుండరా? నీ సహాయంబు లేకున్నచో తిండియే లేక తన్మూలమౌ కష్టముల్ పొందరా? నీదు కాకించుకంతైన నెమ్మేనులన్ లేకయే యున్ననున్, మిక్కిలిన్ మిక్కుటంబైననున్, మ్రిందరా? అందుచేతన్ నినున్ సంతతంబిండ్లలోనిల్పి ముప్పూటలున్ భక్తితో పూజ గావించువారిందఱా? అందఱా? ఎందఱో కాదె? దావాగ్నిజాలంబులున్ వహ్నిశైలంబులున్ నీమహాశక్తినిన్ దెల్పుచున్నన్, మనుష్యాళికిన్ సాయమున్ చేయనీరీతిగా లోకువై లోకమున్ బ్రోతువో పావకా, తావకానుగ్రహంబిప్పుడేఁ గోరితిన్; నాదు ప్రాణేశ్వరుండెప్పుడున్ సత్యనిష్ఠాగరిష్ఠాత్మకుండేని, నేనాత్మలో ఎల్లకాలంబు ప్రాణేశునే ఈశుఁగా ఎంచి మన్నించి పూజింతునేనిన్, మమున్ చల్లనౌ చూపులన్ చూచి చల్లారుమయ్యా తమఃపుంజవల్లీలవిత్రా, లసద్దివ్యగాత్రా, మరుత్ప్రాణమిత్రా, నమస్తే పునస్తే నమస్తే నమః.

గణ—(గంతి) అమ్మయ్యో! నా మీఁద మిడుఁగురు కాఁబోలు పడింది. వేఁడిగా తగిలింది. అగ్ని కూడా మూరెఁడు దూరం లోకి వచ్చింది.

హరి—ఇదిగో, నా మీఁద కూడ పడినది; వేఁడిగా కూడ తగిలినది. కాని ఇది మిడుఁగురుకాదు; నీటి బొట్టు వలె ఉన్నది.

గణ—(గంతుచు) మిత్రమా, ఇఁక బ్రదికిపోయినామురోయ్; ఇవి చినుకులు. ఆకాశంవంక చూడు. ఎంత మబ్బు పట్టిందో! ఇది పతివ్రతాతిలకమైన చంద్రమతీదేవి ప్రభావం.

హరి—(ఆకాశము వంక చూచి) ఆహా! ఏమి మబ్బు క్రమ్మినది!

ఉ. కాటుక కొండలట్లు, వడఁగట్టిన చీఁకటి కుప్పలట్టులున్,
గాటపు ధూమరాశుల ప్రకారమునన్, పిడియేన్గులట్లు, ఏ
చోటున తామెఱుఁగాచు, పలుచోద్యపుమార్పులు పొందుచున్, నభో
వాటిని మూసి పెట్టి నలువంకల కారుమొయిళ్లు కన్పడెన్. 76

గణ—అమ్మరోయ్యో! ఎంత మెఱుపో! కళ్లు మిరిమిట్లు కొలిపి, చిమ్మచీఁకట్లను క్రమ్మచేసింది. ఆకాశం ఈ మూలనుంచి ఆ మూలకు బీట ఇచ్చినట్లు అయింది... ......అమ్మా! ఎంత ఉఱుమో! కఱిల్లు పెఱిల్లుమని గుండె బ్రద్దలయేటట్లు ఉఱిమింది. ఎక్కడో పిడుగు పడి ఉండవలెను.

హరి—కుమారా, జడిసికోనేరవు; నా ప్రక్కకు రమ్ము...ఆహా! ఏమి మెఱుపు! ఏమి ఉఱుము!

చ. తొలుదొలఁ జేలుచున్న బలుదొడ్డనవాబులు వారివాహముల్
జలములు క్రోలుటన్ నడువఁ జాలకయున్నవటంచు చూచి, వీఁ-
పులు కడఁ బ్రేలునట్లు మెఱుపున్ కొరడా ఝళిపించి కొట్టఁగా
చలనము పొంది, తామిఱుముచప్పుడుతో సకిలించె మింటిపై. 77

గణ—మిత్రమా, వాన; వాన. ఏనుఁగు తొండాల వంటి ధారలతో కురుస్తూ ఉంది. ఈ కార్చిచ్చు చెట్లనన్నిటినీ తన పొట్టను పెట్టుకోవడం చేత తల దాఁచుకోవడానికైనా చోటు లేదు.

హరి—ఓయీ, ఈ ప్రక్కను చిన్న చెట్టేదో ఉన్నట్లున్నది...దేవీ, బట్ట గట్టిగా ఓఁగఁబట్టుకొని రమ్ము. కుమారా, ఇదిగో, నన్నంటి పెట్టుకొని రమ్ము......... అమ్మయ్యా, ఇప్పుడు కొంచెము బాధ తగ్గినది. జల్లు మాత్రము కొట్టుచున్నది ......ఆహా! ఏమి వాన! ఏమి వాన!

శా. అంభోధిం గల యొల్ల నీరమును కాలాంభోదసంఘంబుల-
మ్మాంభుల్ పోట్టల నిండఁ గ్రోలి, పిదపం దుండంబులన్ సాచుచున్

గంభీరధ్వనితోడ తాము వెడలఁగా గ్రక్కెనో యన్నటుల్
కుంభద్రోణముగాఁగ వాన కురిసెన్ క్షోణీస్థలిన్ ముంచుచున్. 78

గణ—అమ్మయ్యా! ఈ వర్షం పుణ్యమా అంటూ మనము కార్చిచ్చు బారినుండి తప్పించుకొని బ్రదికినాం. మనమీఁద ఇంత అడావుడి చేసిన చిచ్చు ఈ వాన చేత ఇట్టే ఆరిపోయింది.

హరి—అవును, అది అల్లే. తగిన వేళకు వాన రాఁబట్టి ఈ మహావిపత్తు మనకు తప్పినది.

ఆ. వె. వనము వనమయంబునొనరించి, భువనంబు
భువనమయము చేసి ప్రోచి, మనదు
జీవనముల కాత్త జీవనంబుల నడ్డు
వైచి కాచె; దీని వశమె పొగడ? 79

చంద్ర—ఆర్యపుత్రా, వాన అంతకంతకును వెలిసిపోవుచున్నట్లున్నది. మీ బట్టలను చక్కఁగా పిడుచుకొండు; లేకున్న నజ్జు చేయఁగలదు. కుమారా, ఇటు రా; నీ ఒళ్లు తుడిచెదను.

హరి—దేవీ, నీవు చెప్పినది నిజమే. అవిగో, ఎక్కడి మేఘములు అక్కడ విచ్చిపోవుచున్నవి......ఈ వర్షము చేత మనకు తెలియ లేదు కాని ఈ నడుమ సాయంకాలమయినది. ఆకాశమందెల్లను చుక్కలు కనఁబడుచున్నవి.

తే. గీ. మిన్ను మూసిపెట్టినయట్టి మేఘనిచయ-
మొక్కమొగి వీడి పోవ, అందుండి జాతి
నిలుచు పడిగండ్ల వలె గ్రహంబులును, మంచి
ముత్యముల రీతి నక్షత్రములును తనరు. 80

......ఇదిగో, ఈ వైపున చంద్రుఁడుదయించి పైకి రానే వచ్చినాఁడు.

మ. తన చుట్టున్ గగనాటవీస్థలిని సంధ్యారాగపున్ కాఱుచి-
చ్చెనయన్, చంద్రుఁడు జేవుఱించి కననయ్యెన్; మంచువర్షంబుచే-
తను దావానలమారిపోవ, అతఁడాత్మస్వచ్ఛతన్ పొందె; ఐ-
నను పెన్మంటల కాఁకచే కమరెనో నాన్ కందుఁదాల్చెన్ మెయిన్.

గణ—మిత్రమా, నక్షత్రాలను చూడటంచేత జ్ఞప్తికి వచ్చింది; నక్షత్రకుఁ డేఁడీ?

హరి—అవును, నక్షత్రకుఁ డేఁడీ? పాపము, అతఁడు ఈవర్షములో ఎంత బాధ పడెనో కదా?

[నక్షత్రకుఁడు ప్రవేశించును.]

నక్ష—రాజా, నేను మీకొఱకు ఎల్ల చోట్లను వెదకినాను. మీరు బ్రదికి ఉన్నారో లేదో కూడ నాకు బోధపడ లేదు. ఈ రాత్రి మనము పండుకొనుటకు తగిన చోటు చూచి వచ్చినాను. మఱల వాన పడినయెడల, ఈ చెట్లు క్రింద పండుకొనినచో తడిసిపోవుదుము. ఈ చేరువనే ఒక గొప్ప మఱ్ఱిచెట్టు ఉన్నది. అది

సీ. ఎడము లేకుండ ఎల్లెడ క్రమ్మి, ఆకులు
పైనుంటచే మంచు పడఁగ నీదు;
దిక్కులన్ కప్పెడి దీర్ఘశాఖలు కల్గఁ-
బట్టి నఙ్ఞనాడ్పు కొట్ట నీదు;
ఎడనెడ మెరసెడు మిణుఁగురు దీపంబు-
లుంటచేత భయంబునొందనీదు;
పుడమిపై ఎత్తుగా పడిన యాకులచేత
కాయంబునకు నొప్పి కలుగనీదు;
గట్టి స్తంభంబుల విధాన కానఁబడెడు
గొప్ప యూడలానడుమ నెక్కొనుటఁ జేసి,
గదులు కలిగిన భవనంబు గతిని పడక-
కిమ్ముగా నున్న దావటవృక్షమధిప. 82

గణ—దానిమీఁద భూతబేతాళపిశాచాలుంటవేమో?

హరి—ఓయీ గణపతీ, మేమిందఱము ఉండఁగా నీకు వచ్చిన భయమేమి? దేవీ, కుమారుని నాచేతికిచ్చి, నీవు నావెంట రమ్ము. నక్షత్రకా, పదీ ఆమఱ్ఱిచెట్టునకు దారి చూపుము.

నక్ష—రాజా, ఇటు, ఇటు.

[అందఱును నిష్క్రమింతురు.]

[తృతీయరంగము—అడవి. మునివేషముతో దంతఘాతుఁడు ప్రవేశించును ]

దంత—ఈ హరిశ్చంద్రుఁడు ఏలాంటి వాఁడో కాని, మా గురువు విశ్వామిత్రుఁడి చేత మూడు చెరువుల నీళ్లు తాగిస్తున్నాఁడు. నిప్పు తొక్కిన కోఁతిలాగు ఎప్పుడూ చిందులు తొక్కుతూ వుండే చండకౌశికుఁడు, ఇప్పుడు పాపం ఎప్పుడో చచ్చిన వాఁడిలాగు ఒకమూలను పడివుండి, ఎవరి వంకా చూడక, ఎవరు పిలిచినా పలకక, వట్టి బయలు చూస్తూ, తనలో తాను గొణుగుకొంటూ, దీనమైన మొగంతో జాలిగొలుపుతూ వున్నాఁడు. నిన్న సాయకాలం ఒక్కమాటు మాత్రం, అతఁడు కూలఁబడి కూర్చున్నవాఁడల్లా గబాలున లేచి, కళ్లు వెళ్లఁబెట్టి మారవు చూపులు చూస్తూ, చెవులు రిక్కించి నిదానంగా వింటూ, ముక్కుపుటాలు ఎగుస్తూ వుండఁగా, ఒంటి మీఁద స్మారకం లేని వాఁడిలాగు నిలఁబడి—ఇంతలో పెద్ద నిట్టూర్పులో మళ్లీ కూలఁబడ్డాఁడు. అదే కాఁబోలు హరిశ్చంద్రుఁడిని నక్షత్రకుఁడు కార్చిచ్చు మూలంగా పరీక్షించిన సమయం. ఆ పరీక్ష భంగమయిందన్న సంగతి నిన్నటి రాత్రి నాకు తెలుపుతూ: "ఓరీ దంతఘాతా, బేతాళుఁడి మూలాన్ని హరిశ్చంద్రుఁడిని పరీక్షించరా," అని చెప్పి నన్నిప్పుడు పంపించినాఁడు. పంపినాఁడే కాని, ఇది కూడా ఫలించకుండా ఏదో అవాంతరభంగం కలుగుతుందనే ఆయన నమ్మకం. కానీ, నేను నా పని తీరుస్తాను........విశ్వామిత్రుఁడు నాకు వేసిన ఈ వేషాన్ని బట్టి నేను రాక్షసుఁడనని ఎవరూ పోల్చుకోలేరు. అయినా, నా రాక్షసస్వభావం మధ్య ఎక్కడైనా బయలుపడుతుందేమో అని భయంగానే ఉంది. కాఁబట్టి జాగ్రత్తగా ఉండాలి......అదిగో, బేతాళవటం క్రింద కూర్చుండి హరిశ్చంద్రుఁడూ నక్షత్రకుఁడూ సూర్యోదయం చూస్తున్నారు. చంద్రమతిన్నీ రోహితాశ్వుఁడున్నూ ఇంకా లోపల వున్నారు కాఁబోలు. కానీ; బేతాళుఁడిని పిలిచి, నియోగించవలసిన పని నియోగించి, ఆ వెనుక హరిశ్చంద్రుఁడి దగ్గఱకు వెళ్తాను......ఓరీ బేతాళా, బేతాళా, బేతాళా, బేతాళా,

[బేతాళుఁడు ప్రవేశించును.]

బేతాళుఁడు—ఓరీ ఎవఁడురా, ఇంత పొద్దుటి వేళ వేళాకోళంగా తాళకుండా "బేతాళా, బేతాళా," అని నన్ను పిలుస్తున్నాఁడు? పాతాళం దూరినా ఈ బేతాళుఁడు వాఁడి తాళం పట్టించకుండా వదలఁడు.

దంత—ఓరీ బేతాళా, నీ అఱపులు చాలించి, ఇటు విను. రండో దుష్క్రేడంటూ పేరున్న చండకౌశికుడిని ఎఱుగుదువా? ఆయన శిష్యుడిని నేను. ఆయన పంపిస్తే వచ్చాను.

బేతా—అమ్మయ్యా, విశ్వామిత్రమునీశ్వరుడి శిష్యులా మీరు? స్వామీ, తెలియక మీమొదల అన్న అపచారపు పలుకులు మన్నించాలి. (చేతులు కట్టుకొని నిలువబడును.)

దంత—ఓరీ, అలాగే మన్నించాను. ఇక నా గురువుగారి నియోగం విను. ఈ చెట్టు క్రింద రాత్రి బస చేసినవారెవ్వరో నీకు తెలుసునా?

బేతా—స్వామీ; తెలుసును; వాళ్ల మాటల వల్ల తెలిసింది. వాళ్లు హరిశ్చంద్రుడూ మొదలైన వాళ్లు; ఆ చక్రవర్తి కీర్తి విని ఉండడం చేత వాళ్లకు ఏ కీడూ చేయడానికి తలపెట్టుకోలేను.

దంత—బేతాళా, జాగ్రత్తగా విను. ఇది స్వామి నియోగం. ఇప్పుడు చెట్టు క్రింద ఇంకా చంద్రమతిన్నీ రోహితాశ్వుడున్నూ నిద్రపోతూ వున్నారు. వాళ్లను హఠాత్తుగా ఎత్తుకు పోయి దాచి ఉంచు. వాళ్లకు ఏ కీడూ చెయ్యకు; నిద్ర కూడా చెడగొట్టకు. నేను తిరిగి తెమ్మనే వఱకూ మాత్రం తేకు; పో.

బేతా—స్వామి, చిత్తం. (నిష్క్రమించును.)

దంత—(ముందుకు పరిక్రమించి) ఇరుగో హరిశ్చంద్రుడున్నూ నక్షత్రకుడున్నూ. బేతాళుడు చంద్రమతినీ రోహితాశ్వుడినీ ఎత్తుకుపొయ్యే వఱకూ, ఈ మూల నిలబడి వీళ్లమాటలు వింటూ ఉంటాను.

[బేతాళవటముక్రింద హరిశ్చంద్రనక్షత్రకులు కూర్చుండి ఉందురు.]

హరి—నక్షత్రకా, ఈ ప్రభాతశోభ ఎంత రమణీయముగా ఉన్నది! నింగినొజ్జ రంగులో ఎన్నెన్ని వింతమార్పులు పుట్టుచున్నవి! దిగువను రక్తవర్ణము, దానిపైని వంగపండు రంగు, అందుపైని బంగారుచాయ, ఆపైని ఆకుపచ్చదనము, ఈయన్నిటిమీదను ఆకసపునీలివన్నెయును, ఆహా, ఆహా! ఏమి శోభ! ఎక్కడనైనను మబ్బుముక్కలు ఉన్నయెడల, అవి బంగారునీటిలో తేలియాడుచున్న నాచుకప్పలే అనుకొనవలెను. దిగువనున్న కారుమబ్బుమొత్తము కాంతివెల్లువయడుగున ఉన్న అడుసువలెనే ఉన్నది.

నక్ష—రాజా, తూర్పున తొంగి చూచుచున్నట్లున్న ఆ ఎఱ్ఱని గీత ఏమి?

హరి—నక్షత్రకా, అదే ఉదయించుచున్న సూర్యబింబము...చూడు, చూడు; ఆ

ది అంతకంతకును పైకి వచ్చుచున్నది. ఇప్పుడు చిన్నముక్కయై,...ఇప్పుడు సగమై,...ఆహా! ఇంతలో పూర్ణముగానే పైకి వచ్చి సూర్యమండలము కనులపండువు చేయుచున్నది.

నక్ష—...రాజా, పైకి వచ్చినదన్న మాటే కాని, అంతలోనే అది తూర్పుదిక్కున దిగువనున్న నల్లమబ్బుకొండల మాటునకు పోయినది......ఆహా! రాజా, చూడు చూడు; ఆ మబ్బులకు మీఁద బంగారంచు వచ్చినట్లున్నది...ఆహా! ఇంతలో ఏవో మొగలిరేకుల వలె పైకి పాఁకుచున్నవి.

హరి—అవి సూర్యకిరణరేఖలు. చూడు, చూడు; అవి ఎన్నెన్ని మార్పులు పొందుచున్నవో!

సీ. గగనంబుమీఁదికి నెగయు భాస్కరవీరు
టోపీ తురాయి వెండ్రుకలనంగ,
ఇనునికి ముందు వచ్చిన వేత్రధారక-
కులము దాల్చిన వెండిగుదెలనంగ,
కమలాప్తుఁడను చిత్రకారుఁడు నింగి రం-
గులు వేయ నెత్తిన కుంచె యనఁగ,
అంబుదశకలలోహము కాల్చు సమయము-
క్ష్మాధరుని కుంపటి మంటలనఁగ,
తొలుత తెలుపును నలుపును కలిసి, అంత
నంతటను తెల్లనై, మఱియంత కొంత
యెఱ్ఱనై, తుదకంతట నెఱ్ఱనగుచు,
ఉదయరేఖానికాయంబు చదల పర్వె. 83

నక్ష—రాజా, చూచునంతలోనే సూర్యబింబము పైకెగఁబ్రాఁకి మబ్బుకొండలమీఁదికి గబాలున దుమికెను. ఇదే కాఁబోలును పొడుపుకొండమీఁదికి సూర్యుఁ డెక్కుట? ఉదయించినప్పుడు ముదురుకెంపు బంతివలె ఉన్న బింబము, ఇప్పుడు తెల్లనై తళతళలాడుచు కన్నులను మిరిమిట్లు కొల్పుచు వజ్రపు బంతివలె కనఁబడుచున్నది.

హరి—నక్షత్రకా, నీవు చెప్పినది సత్యమే.

చ. కుదురుగ తప్త కాంచనపు కుండవలెన్ తొలుదొల్త తోఁచినన్,
పదపడి వెండికుండవలె భాస్కర బింబము తోఁచె మింటిపైః
ఉదయమహీధరంబుపయినుండెడు పాదరసంబు కాఁకి, అ-
య్యది యటుగాఁగ మాఱినదటన్న భ్రమన్ కలుగంగఁ జేయుచున్.

......ఎండ ఎక్కినను ఈ నాఁడు దేవి లేవకుండుట వింతగా ఉన్నది...అయినను వింత ఏమున్నది? నిన్నటి ఆయాసము చేత ఆమె ఇంత అదమఱచి నిద్రించుచుండును. ఆమె ఎన్నఁడును ఇట్టి కష్టములను ఎఱుఁగని సుకుమారి.

నక్ష—రాజా, అంగడిలోని ఆఁబోతు వలె ఈ మూలను పడియున్న గణపతిని చూడుము. తలక్రిందులు తపస్సు చేయుచున్నట్లు కట్టకు వ్రేలాడు ఋషిపక్షులు ఇతని పెనుగుఱ్ఱుకు బెదరి రాత్రి ఇచ్చటికి చేరనే లేదు.

హరి—పాపము, ఇతఁడు మాత్రము ఈ వనవాసమునకు తగినవాఁడా? మాతో అతిసుకుమారముగా పెఱిగిన వాఁడే కదా?

నక్ష—ఆవైపున ఏదో చప్పుడగుచున్నది; దేవి లేచుచున్నది కాఁబోలు. (తిరిగి చూచి తత్తరములో) ఓ రాజా, చూడు చూడు. దేవి ఎట్లు లేచుచున్నదో!

హరి—పాపము! ఆమెకు మనమాటలవలన నిద్రాభంగము కలిగినది కాఁబోలు.

నక్ష—అయ్యో! అయ్యో! నిద్రనుండి లేచుట కాదు. ఆమెయు లోహితాశ్వుఁడును ఉన్నపాటున మీఁదికి లేచి పోవుచున్నారు.

హరి—(అదరి పడి లేచి తిరిగి చూచి) ఆఁ, ఏమి, ఏమి? ఆహా! దేవి లేచి పోవుచున్నది......అయ్యో! దేవీ, ఎందు పోయెదవు? కుమారా. ఆగుమాగుము. నక్షత్రకా, ఏమి చిత్రము? దేవియు కుమారుఁడును కన్నులైనను తెరువ లేదు; మీఁదికి లేచి పోవుచున్నారు! ఇదేదో రాక్షసమాయ కాఁబోలు! నక్షత్రకా, ధనుర్బాణములు, ధనుర్బాణములు.

తే. గీ కాంబరీతమఃపటలసంఛన్నుఁడగుచు
దృష్టికిన్ కానరాని యీ దుష్టదైత్యు
రూపుమాపఁగాఁ జాలు నాతూపు, తెలగ-
లోన నున్నట్టి గుణమును పమఁగల్గు. 25

ఓయీ నక్షత్రకా, ఆలస్యము చేసెదవేలా?... ఆహా! మందభాగ్యుఁడను గదా. ధనుత్యాగము లెక్కడివి? ధనస్సు లేని నేను చేయి విఱిగిన వాఁడనే కదా? దేవినెట్లు విడిపింపఁ గలను? నక్షత్రకా, చూడు చూడు; అయ్యో!, అయ్యో!

తే. గీ. కొమ్మ తన కామ్యఫలముతో కూడ, చెట్టు
కొమ్మలందును తానొక కొమ్మ యయ్యె;
కొమ్మ విఱుగంగ నేలను కూలినట్టి
చెట్టు వలె నేను చెడితి, నే చెడితి, చెడితి. 86

(గబాలున కూలఁబడును.)

నక్ష—రాజా, ఊరడిల్లుము. ఊరడిల్లుము.

గణ—(అదరి పడి లేచి) ఆహా! ఏదో గబాలున కూలినట్లు అయింది. అది నాకడుపు మీఁదే పడి ఉంటే కడుపు కుండ లాగు పటాలున బ్రద్దలయి ఉండును. (నిలువఁబడి చూచి) ఆహా! ఇదేమి, ప్రియమిత్రుఁడు నేలను పడియున్నాఁడు? (పరుగెత్తి సమీపించి) మిత్రమా, మిత్రమా, ఏం ఆపద సంభవించింది?

నక్ష—గణపతీ, ఇఁకేమున్నది? దేవిని, రోహితాశ్వకుమారుని, దుష్టరాక్షసుఁడెవ్వఁడో మా కన్నుల యెదుట అపహరించుకొని పోయినాఁడు.

గణ—ఏమి? ఏమి? దేవినీ, రోహితునిన్నా?... ఆహా! ఆహా! దేవీ, ఎంత పని జరిగింది? అయ్యో! అయ్యో! సద్బ్రాహ్మణుఁడనని నన్నింక ఆదరించే వారెవ్వరు? హా! కుమారా, రోహితాశ్వా, హాస్యపు కథలు చెప్పుమని ఇంక నన్నడిగే వాళ్లెవ్వరు? అయ్యయ్యో! ఎంత పని జరిగింది? వాళ్లను విడిచి అదుష్టుఁడెవ్వఁడో నన్నయినా తీసికొని పోయినాఁడు కాఁడు. ఆహా! ఏం చిత్రం! విశ్వామిత్రమాయలాగుంది. మిత్రమా, లే లే.

హరి—(మూర్ఛ తేఱి) ఆహా! గణపతీ, ఇఁకేమున్నది? నా గృహము కూలి పోయినది; నా వంశ మంతరించినది; నాకు లోకమంధకారమయినది.

చ. పనులను దాసి, యోచనల పట్టున మంత్రియు, మెచ్చు గొల్పు రూ-
పునెడల రంభయున్, క్షమను భూమియు, తిండిని పెట్టు పట్టునన్
జననియు, పండు వేళ సరసంబుల ప్రోఁ ప్రియను, ఏన నామనో-
ధనము మదీయ జీవనము తో నను బాసె; ఇఁకేమి చేయుదున్? 87

[మునివేషముతో [illegible] దగ్గఱకు వచ్చును.]

దంత—ఎవరయా మీరు? ఈలాగు కళకళపడుతూ వున్నారు. ఏం కారణం?

సత్య—అయ్యా మునీశ్వరా, ఈయన భార్యను కుమారుని దుష్టరాక్షసుఁడెవ్వఁడో కాని కన్నులకు కనఁబడకుండ ఎత్తుకొని పోయి ఈ చెట్టుకొమ్మలలో దూరినాఁడు.

దంత—రాక్షసుఁడు కాఁడు; బేతాళుఁడు. మీకు తెలియక ఈ చెట్టు క్రింద వఱున్నారు కాఁబోలు; ఇది బేతాళవటం. దీని క్రింద వఱున్న వాళ్లను వాఁడు ఆలాగే ఎత్తుకు పోతూ వుంటాఁడు. అయినా భయపడ వలసిన అవసరం లేదు. ఈ ఆపదలోనుంచి తప్పించుకోవడానికి చిన్నవుపాయం వొకటి వుంది.

గణ—మిత్రమా, మిత్రమా, ఇఁక భయంలేదయ్యా. దేవీ, లోహితాశ్వుఁడూ, మనకు దక్కినారు. ఈయనకు ఏదో ఉపాయం తెలుసునఁట. ఓ మునీశ్వరా, కనికరించి ఆ ఉపాయం ఏమిటో చెప్పవయ్యా.

దంత—మరేమీ లేదు. ఈ బేతాళుఁడు శంకరుఁడి భృత్యకోటిలోని వాఁడు. కాఁబట్టి ఎవ్వఁడు తాను శంకరుఁడనని చెప్పుకొంటాఁడో, ఆలాంటి వాఁడిని వీఁడు పీడించఁడు. ఈ రాజు గొంతుకెత్తి గట్టిగా తాను శంకరుఁడననీ, తన భార్య పార్వతనీ, తన కొడుకు వీరభద్రుఁడనీ, చెప్పితే బేతాళుఁడు తప్పకుండా వాళ్లను తెచ్చి విడిచి పెట్టాఁడు.

గణ—మిత్రమా, ఇఁకేమి? మన వాళ్లు మనకు దక్కినారు. రా, మఱి త్వరగా అను. లేక పోతే వాళ్లకేమైనా ఆపద జరుగఁగలదు.

హరి—(దీనముగా) గణపతీ, అసత్యమును నేనెట్లు పలుకుదును.

గణ—ఆహా! నీ సత్యనియమపు ఘోషే నేను మఱచిపోయినాను; ఆహా! మిత్రమా, మఱచి అయినా ఈ మాత్రపు అసత్యం పలుక రాదా? ఆలాగు చేసి ఉంటే, దేవీ కుమారుఁడూ దక్కి ఉందురే. ఇంక వారిని రక్షించుకోవడం ఏలాగు?

హరి—మందభాగ్యుఁడను, నేనిఁక వారిని ఈలోకములో రక్షించుకొనుట ఎక్కడిది?........ఆహా! దేవీ, నీ సుగుణములను తలఁచుకొనుచున్న కొలఁదిని దుఃఖము పొరలి వచ్చుచున్నది.

సీ. ఏను రాజ్యము దానమీయ, పల్లెత్తుమా-
ఱేనియు నన్నాడి యెఱుఁగవీవు;

అత్యంతసుకుమారివయ్యు, నన్నెడ లేక
వనికి నా వెంబడి వచ్చితీవు;
నామది నారాటమేమి కల్గునో యంచు,
ఆయాసమనిదైన అనవు నీవు;
ఏనలయుదునంచు నెంచి నీ కన్నుల-
న్నియును నామీఁదనే నిల్పుదీవు;
ఇంతటి పతివ్రతామణివీవు గాన
మగువ, నీదు పాతివ్రత్యమహిమను మము
కాఱుచిచ్చున పడకుండ కాచినావు:
నిన్ను విడనాడి నేనెట్లు నిల్వఁగేర్తు? 88

దంత—ఏం? ఆ రాజు మేం చెప్పిన లాగు చెయ్యకుండా ఆ లాగు ఆరాటపడుతున్నాఁడు. ఆరాటం అవసరం లేదు. మేం చెప్పిన లాగు చేస్తే తప్పకుండా ఇతఁడి ఆలుబిడ్డలు దక్కుతారు.

నక్ష—మునీశ్వరా, గొప్ప చిక్కు తెచ్చి పెట్టినారు. ఈయన ఎవ్వరో మీరెఱుఁగరు కాఁబోలు. అనిన మాటను నిల్పుకొనుటకు తన రాజ్యమును తృణప్రాయముగా ధారపోసిన హరిశ్చంద్ర చక్రవర్తి ఇతఁడే; తండ్రి ఉద్గతి నిలువఁబెట్టుటకును, తాను భార్యాపుత్రులతో కాఱుచిచ్చు లోఁబడి చావకుండుటకును, ఒక్క చిన్న అసత్యము పలుక వలసి వచ్చినను పలుకని నిష్ఠాగరిష్ఠుఁడితఁడు. అట్టి ఈతఁడు, ఇప్పుడెట్లు బద్ధమాడును? కావున కటాక్షించి, ఇంకేదయిన ఉపాయమున్న యెడల తెలుపుఁడు.

దంత—ఈయన హరిశ్చంద్రచక్రవర్తి అన్నసంగతి నాకు తపశ్శక్తి వల్ల ఇంతకు ముందే తెలుసును. ఇతఁడు హరిశ్చంద్రుఁడు గనుకే ఈ ఉపాయం చెప్పినాను. సత్యనియమం గల ఈయన ఏం పలికినా, లోకాధుఁడు నమ్ముతాఁడు. శంకరుఁడనని చెప్పకుంటే వాఁడు లొంగి రాఁడు. గట్టి చిక్కు తెచ్చి పెట్టినారు. ఏం ఉపాయం?...............ఆఁ, ఒక్క చిన్న ఉపాయం తట్టుతూ వుంది. ఈయన ప్రభువు గనుక "ఈశ్వరుఁడ" నని చెప్పుకొన్నా అబద్ధం కాదు. "సతి" అంటే భార్యా అవుతుంది; పార్వతీదేవీ అవుతుంది. అలాగే "కుమారుఁ" డంటే కొడుకూ అవుతాఁడు; కుమారస్వామీ అవుతాఁడు. కాఁ

కట్టి ఈరాజు గట్టిగా, "నేను ఈశ్వరుఁడను; నా సతినీ కుమారుఁడినీ తీసుకురా, వేతాళా," అంటే తప్పకుండా వేతాళుఁడు ఇతఁడి భార్యాపుత్రులను తెస్తాఁడు. అసత్యదోషమూ రాదు. ఈలాగు పుణ్యం పురుషార్థం రెండూ దక్కుతవి.

గణ—మిత్రమా, ఇఁక అన్ని చిక్కులూ తీఱినవి. రా, మఱి ఆలాగు అను.

హరి—గణపతీ, ఇది మాత్రమబద్ధము కాదా?

గ—ఇది ఏలాగు అబద్ధం అవుతుంది? నువ్వు ఈశ్వరుఁడవు; దేవి నీ సతి; రోహితాశ్వుఁడు కుమారుఁడు. ఇదే కదా నీవనవలసినది?

హరి—గణపతీ, సందిగ్ధవచనముల చేత, కాని సంగతిని నమ్మించుటయు అబద్ధమే. వేతాళుని చేత నిజము కాని దానిని నమ్మించవలెననియే కదా నా ఉద్దేశము? దేవిని, కుమారుని ఎట్లును విడువనే విడిచినాను. వారికంటె ఎక్కువయిన సత్యనియమమును కూడ ఎట్లు వదలుకొందును?

గణ—అయ్యా మునీశ్వరా, ఈ రాజే అనవలెనన్న మాటేమి? ఈయన ఈశ్వరుఁడనీ, దేవి ఇతని సతి అనీ, రోహితాశ్వుఁడు కుమారుఁడనీ, నేను గణపతిననీ, కావలిస్తే ఈ నక్షత్రకుఁడు నందో వందో అనీ, అంటాను.

నక్ష—లాభం లేదు. ఇంతకు ముందే చెప్పినానే. సత్యవంతుఁడైన హరిశ్చంద్రుఁడి నోటను విన్నప్పుడే ఆ మాటను వేతాళుఁడు నమ్ముతాఁడు.

గణ—మిత్రమా, వింటున్నావా?

హరి—గణపతీ, వినుచున్నాను. ఇఁక నన్నెట్లు అబద్ధమాడుమనఁ గలవు?

తే. గీ. మునుపు నేను బొంకని హేతువునను కాదె,
నాదు పలుకిపుడెవ్వరైన నమ్మఁ గలరు?
ఇప్పుడొకమాటు బొంకితినేని, మఱల
నాదు పలుకెవ్వరైనను నమ్మఁ గలరె? 89

గణ—నమ్మలేకపోతే వాళ్ల కర్మం. చూచి చూచి భార్యాపుత్రులను చేతులారా వదలుకొంటావటయ్యా? మఱి తటపటాయించక ఈ పాటి మాట అను.

హరి—ఆహా! దేవీ, ఇఁక మఱల నిన్నెన్నఁడు చూడఁ గలను? హా కుమారా, రోహితాశ్వా,

ఉ. పున్నమ చందురా పరిగ పోల్పఁగ నీనగుమోము, దానినిం-
కెన్నఁడు కందురా? చెవులకెంతయు విందుగ నీదు పల్కులిం-

కెన్నఁడు పండురా? నునుపు హెచ్చిన చెక్కుల నిన్ను ముద్దులిం-
కెన్నఁడు గొందురా? విధి నిఁకేమని యందుర? ఎట్టులుందురా? 90

(మూర్ఛిల్లును.)

నక్ష—రాజా, ఊరడిల్లుము, ఊరడిల్లుము.

గణ—(దంతఘాతునితో) మునీశ్వరా, మీరు చేప్పిన ఉపాయాలన్నీ వ్యర్థం అయి పోయినవి. స్వామీ, మీరెవరు?

దంత—నేనుక రాక్ష—(కళవళపడుచు) రాక్షసమాయలు పోఁగొట్టే మునిని.

గణ—(తనలో) "నేనుక రాక్ష" అని వెంటనే కళవళపడడం బట్టి చూస్తే, వీఁడెవ్వఁడో రాక్షసుఁడై ఉండవలెను. ఇది అంతా వీఁడి మాయే......(ప్రకాశముగా) రాజా, లే లే. నాకొక ఉపాయం పొడఁగట్టింది.

హరి—(మూర్ఛనుండి లేచి) హా! దేవీ, హా! కుమారా,

గణ—వారిద్దఱూ మనకు దక్కేటట్టు నాకొక్క ఉపాయం తోచింది.

నక్ష—అదేదో త్వరగా చెప్పు.

గణ—చెప్పడం కాదు; చేస్తాను. ఇందులో మనం అందఱమూ కష్టపడవలసి ఉంది. అయ్యా, మునీశ్వరా, మీరు దేవి లాగు ఈ నేల పఱుండండి; నక్షత్రకుఁడు మీ పక్కను రోహితాశ్వుఁడి వలె పఱుండును.

దంత—నేను పఱుండడం ఎందుకు?

గణ—అందు వల్ల ప్రయోజనం ఉంది. మఱి ఆలస్యం చేయకండి.

దంత—(నేలను వెల్లకిలఁ బఱుండును.)

గణ—(గబాలున దంతఘాతుని గుండెమీఁదికెక్కి కూరుచుండి) నక్షత్రకా, రా, రా. వెనుకా ముందూ చూస్తూ కూర్చుండక, వీఁడి కాళ్లూ చేతులూ కట్టివెయ్యి. మిత్రమా, వీఁడిని త్వరగా చంపవయ్యా.

నక్ష—(దంతఘాతుని కాలు చేతులు త్రొక్కి పెట్టును.)

హరి—గణపతీ, ఈ వికారమేల? మహాత్ములయెడల అపచారము చేసెదవేల?

గణ—మహాత్ముఁడూ లేఁడు; అపచారమూ లేదు. వీఁడొక రాక్షసుఁడు. వీఁడే నీ భార్యాపుత్రులను అపహరించినాఁడు. రాక్షసులెవ్వరో పోల్చుకొనే మంత్రం నాకు చిన్నతనంలో నాగురువుగారు నేర్పినాఁడు.

దంత—(తనలో) అన్నా, వీఁడి మంత్రం ఒకటి అడ్డగా వచ్చి నా కొంప తీసింది. ఇఁక నేనిక్కడనుంచి ఏలాగో మెల్లగా జారితేనే తప్ప మాగురువు గుట్టు కూడ బయలుపడుతుంది. (బిగ్గరగా) అమ్మో! ఊఁపిరి సలుపకుండా వుంది. మీఁదినుంచి లే లే.

గణ—దేవినీ రోహితాశ్వునీ విడిపించు.

దంత—వారి సంగతి నాకు తెలియదు.

గణ—అయితే కిక్కుమిక్కుమనకుండా చక్కగా కాళ్లు చాచి పడుండు. (గట్టిగా అణఁచిపెట్టును.)

దంత—అమ్మయ్యో, చచ్చినాను చచ్చినాను. ఓయీ బేతాళా, నా కోసం అయినా నీవు చంద్రమతినీ రోహితాశ్వుఁడినీ ఎప్పటిలాగే తెచ్చి ఉంచు. లేక పోతే కొండ లాగున్న ఈ బ్రాహ్మఁడి క్రింద పడి నేను నలిగి చస్తాను.

నక్ష—రాజా, అటు చూడు, చూడు. చంద్రమతీరోహితాశ్వులు ఇంకను పడుండిరేమో ఎట్లు దిగుచున్నారో!

హరి—ఏరీ, ఏరీ? (పరుగున నిష్క్రమించును.)

గణ—(లేచి గంతుచు) ఓహో! ఓహో! సంతోషం! సంతోషం!

దంత—(పారి పోవును.)

నక్ష—గణవతి, ఈ దుష్టుఁడు పారి పోయినాఁడు. నీ మంత్రమహిమ వల్ల వీఁడు రాక్షసుఁడని తెలియఁబట్టి చంద్రమతీరోహితాశ్వులు మనకు దక్కినారు.

గణ—మంత్రమూ లేదు, మహిమా లేదు; ఇది నా తంత్రం. వీఁడి మాటలఁ బట్టి వీఁడు రాక్షసుఁడని అనుమానించి, నేను ఈ ఎత్తు ఎత్తినాను; ఫలించింది..... అదిగో, ప్రియమిత్రుఁడు దేవిని లేపి ఆవిడకు ఈసంగతి చెప్పుతూ ఉన్నాఁడు. దేవి బెదరుచూపులు చూస్తుంది......వారిద్దఱూ కుమారుని లేపి ముద్దులాడుతూ నలిపివేస్తున్నారు. రా; మనమూ వెళ్లి ఆ సంతోషం అనుభవిద్దాం.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

తృతీయాంకము సంపూర్ణము.

---

శ్రీ

# చిత్రహరిశ్చంద్రీయము.

## చతుర్థాంకము.

[ప్రథమరంగము—కాశీపురము. విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విశ్వా—ఆహా! వశిష్ఠా, నీపంతము నెగ్గునన్న నిశ్చింతతో పైకయినను రావలసిన అవసరము లేకుండఁగనే ఈ హరిశ్చంద్రనాటకమంతయు ఆడించుచున్నావు గదా? నీ శిష్యుని శక్తియందుఁ గల నమ్మకము చేత నీవు గుండెపైని చేయి వెట్టుకొని హాయిగా నిద్రించుచున్నావు. ఇఁక నా అవస్థ అన్ననో,

ఉ. తిండి యొకింత యేనియును తృప్తిగ నోటికి పోదు; కంటికిన్
నిండుగ నిద్ర రాదు; మఱి నెమ్మది యాత్మకు లేదు నాకయో!
కొండవిధాన నెవ్వనికి కొండొకకార్యము నెత్తిమీఁద కూ-
ర్చుండునొ, వాని జీవనము రోఁతయె యయ్యది తీరునంతకున్. 91

కడచి కూర్చుండి ఉండలేక, బుద్ధి గడ్డి తిని, ఈ పంతమొకటి పూనినాను. పరాభవమన్నది ఎన్నఁడును ఎఱుఁగని నాకు దీని వలన తప్పక శృంగభంగమగునని భయమగుచున్నది. ఆహా! ఏమి ఆహరిశ్చంద్రుఁడు! ఏమి ఆతని సత్యనియమము! అడవి నాలుగు వంకలను చిటపిటమని ధ్వనులు పుట్టి, భుగభుగమని పొగ లెగసి, భగ్గుభగ్గుమని మంటలు లేఁగి, కార్చిచ్చు భయంకరముగా మండుచు, తమ్మందఱను దహించుటకు పెనుభూతము వలె వచ్చుచున్నను, నిర్భయుఁడై నిశ్చలుఁడై నిర్వికారుఁడై నిలిచియుండి, అట్టి మహోపద్రవసమయమునందు కూడ ఒక్క అబద్ధమాడుటకైనను ఒప్పుకొనలేదు. అదిగదా నియమము! నాతపస్వికోటిలో దృఢనియమములు గలవారిని ఎందఱనో చూచినాను గాని వారందఱును ఈ హరిశ్చంద్రుని ముందు దిగదుడుపునకైనను పనికి రారు.

ఉ. కక్కలకల్లిమట్టి యతికష్టపు యోగము పూని గట్టిగా
ముక్కు బిగింప వచ్చు, తపమున్ సలుపంగను వచ్చుఁ గాని, తా-
నొక్క యసత్యమున్ పలుకకున్నెడ చిక్కు ఘటిల్లు నన్నచో
నిక్కమె పల్కు వాఁడు ధరణిన్ కలఁడే మఱి యొక్కఁడేనియున్? 92

ఇఁక ఆ హరిశ్చంద్రుని భార్యయో? అన్ని విధములను అట్టి మహామహునికి త గినది. అంతటి పరమపతివ్రతాశిరోమణిని మున్నెన్నఁడైనను కని విని ఉంటి మా? పాతివ్రత్యమన్న యెడల, చంద్రమతీ దేవిదే పాతివ్రత్యము. సంసారలం పటత వదలి, అడవులలో ఆకలములు తినుచు, మగలను కొలుచుచే తమకు పనిగాఁ గల మునిపత్నులకయినను అంతటి పాతివ్రత్యము లేదనుట సత్యము.

చ. గతమున, అత్రిభార్యయు, అగస్త్యునిభార్య, వశిష్ఠుభార్యయున్
క్షితి పతిభక్తిచే, విమలశీలముచే, వరవర్తనంబుచే
ఖ్యాతినుతిఁ గాంచి; రా సతుల నందఱ మించిన యిమ్మహా పతి-
వ్రతకిఁక పంచభూతములు వశ్యములై చరియించుటబ్రమే? 93

హరిశ్చంద్రుని సత్యవ్రతమహిమకు చంద్రమతీదేవి పాతివ్రత్యమహిమయు కలి సినయెడల, ఇఁక వారిని లోకములో అడ్డఁ గలిగినది ఏమున్నది? ఆమె మహి మ వలననే అంతటి విషమపరీక్షయు నిష్ప్రయోజనమై పోయినది......పోని మ్ము; ఆ తరువాత బేతాళుని ప్రయోగించి చేసిన పరీక్ష అయినను ఫలించ కూ డదా? ఆలుబిడ్డలను గోలుపోయి హరిశ్చంద్రుఁడు గోలుగోలున ఏడ్చుచుం డఁగా, నాకు కొంత ఆశ కలిగినది. కాని, ఇంతలో దంతఘాతుని తెలివిత క్కువతనము వలన ఆ పరీక్షయు విఫలమైపోయినది. తిండి తప్ప తక్కిన వి షయములలో మంటిముద్ద వంటి బుద్ధిగల గణపతికి కూడ, ఆ సమయమున కు చావు తెలివి పుట్టుకొని వచ్చినది......అవును; అది సహజమే.

ఆ. వె. పనులఁ గొనెడు ప్రభుల ఘనతఁ బట్టియు దాన-
జనుల తెలివి వృద్ధిఁ గనుచునుండు:
వింటిబద్దనున్న మంటిముద్దయు మింటి
గద్దనేని కూల్పఁ గలుగుఁ గాదె? 94

సమయమునకు గణపతి బుద్ధి వికసించినట్లే ఈ దంతఘాతుని బుద్ధియు ముకుళించుకొని పోయినది. బ్రాహ్మణుడై శాంతుడైన నక్షత్రకుని వలన లాభము లేకున్నదని వీనిని పంపగా, రాక్షసుడై మందుడైన వీని వలనను లాభము లేక పోయినది. వశిష్ఠుని అదృష్టము వలన అతనికి అంత మంచి శిష్యుడు దొరకె, నా దురదృష్టము వలన నాకిట్టి దౌర్భాగ్య దామోదరులు దాపురించిరి. అతని శిష్యునితో పాటు అతనికి జయమును, నా శిష్యులతో పాటు నాకు అపజయమును సిద్ధించుట నిశ్చయము...ఇంతకును ''సత్యమేవ జయతి'' అను వేదవాక్యము ఏల తప్పగును? హా! భగవంతుడా; నాకపజయము తప్పదా? ......అయ్యో! ఏమి చేయుదును?.................ఇక శిష్యులను నమ్ముకొనినయెడల లాభము లేదు; కాబట్టి నేనే ఈ కాశీపట్టణమున మారువేషముతో నుండి ఎప్పటి పనులు అప్పటికి సాధించుచుండెదను...హరిశ్చంద్రుడు నన్ను పోల్చి పట్టకుండుటకు, నల్లని రూపు ధరించెదను...కాలవర్ణము పూనిన కారణము చేతను, ఈ కాలమునకు అయిన కౌశికుడను గనుకను, కాలకౌశిక నామముతో సంచరించెదను...ఇప్పుడు నేను చేయ వలసిన పని ఏమి?...... ..................అబ్బా! ఇక మీద నడిపించ వలసిన కథ మిక్కిలి చిక్కైనదే; చక్కగా ఆలోచించి మరి చేయ వలెను......................

..............................................................

..............ఆఁ, కానిమ్ము. ఈ విధముననే చేసెదను. అప్పటికిని హరిశ్చంద్రుడు లొంగకున్నయెడల——ఆఁ, ఏల లొంగడు? నా చేతనైనన్ని పాట్లు పడి ఎట్లో లొంకించక విడుతునా?...కాని, ఇందులో కాటికాపరి సాయము కొంచెము కావలసి ఉన్నది గదా? ఇప్పుడే వెళ్లి అది జతపెట్టెదను...అదుగో, హరిశ్చంద్రాదులు విశ్వేశ్వరాలయమును ప్రవేశించు చున్నారు. ఇక నేను జాగు చేయ రాదు. (నిష్క్రమించును.)

---

[ద్వితీయరంగము——కాశీపురము; విశ్వేశ్వర దేవాలయము. హరిశ్చంద్రుడు, చంద్రమతి, లోహితాస్యుడు, గణపతి, నక్షత్రకుడు, ప్రవేశింతురు.]

హరి——దేవీ; ఏ వేల్పును చూడవలెనన్న ఆశతో ఈ కాశీపురికి ఆసేతుశీతాచలపర్యంతమునను గల జనులు సకలవ్యయప్రయాసములకోర్చి నిత్యమును వచ్చు

యుందురో, ఏ వేల్పును సేవించుటకొఱకు బ్రహ్మాదిదేవతలు ఇచ్చటికి విచ్చలును విచ్చేయుచుందురో, ఏ వేల్పు దానజనుల పాలి వేల్పువెట్టో, ఆ విశ్వేశ్వర స్వామి అదిగో: కన్నుల కఱవు తీఱ కనుంగొనుము; పాపము లన్నియు పటాపంచలగునట్లు నుతింపుము; వాంఛితార్థములు సమకూరునట్లు మనస్సున భజింపుము. కుమారా, నీవును స్వామికి నమస్కరింపుము. (చేతులు మోడ్చి నుదుటను చేర్చుకొని)

మ. హర, గౌరీవర, చంద్రశేఖర, త్రిశూలాంచత్కరా, కాలకం-
ధర, హాలాహలఘస్మరా, స్మరతనూనాశంకరా, శంకరా,
కరిచర్మాంబర, నాగహారనికరా, గంగాధరా, ప్రాభవ-
స్థిర, కైలాసచరా, సురారిహర, కాశీవాసవిశ్వేశ్వరా. 95

చంద్ర—ఆహా! ఈమహాదేవుని సేవ లభించుటచేత వెనుకటి ఆయాసములన్నియు పూర్తిగా పోయినవి. కృపావరిపూర్ణుండగు విశ్వేశ్వరుని, సర్వమాంగళ్యపరిపూర్ణయగు అన్నపూర్ణను సేవించుటకు మనము పూర్వజన్మముల ఎట్టి పుణ్యము చేసికొంటిమో?......తల్లీ, దేవతాసతీమతల్లి, భక్తజనకల్పవల్లీ,

మ. పరమేశార్ధశరీరవిశీర్ణ; మునిభావప్రార్థనాకర్ణనా-
దరకర్ణా, అసితాంగవర్ణ, నిరతాంతశ్శౌర్యసంకీర్ణ, సు-
స్థిరకారుణ్యరసప్రపూర్ణ, మహామోదీర్ణా, లలాటస్ఫురం-
దరకాశ్మీరజచూర్ణ, మోక్షద సపర్ణా, అన్నపూర్ణాసతీ. 96

గణ—మీరందఱూ మీమీ ఇష్టదైవాలని ప్రార్థిస్తే, నా పేరింటి దేవుడిని నేను ప్రార్థిస్తాను:

సీ. తనదు తుండపు నీటిధారలచే నన-
యంబును హోమాగ్ని యాఱుచుండ,
తన చేటచెవులూగుటను పుట్టు గాలిచే
తలఁబ్రాల బియ్యమంతటను చెదర,
తనదు వాహనమయి తనరు మూషికము మం-
గళసూత్రమును ముందుగానె కొఱుక,

తన జన్నిదపు పెనుత్రాఁచులకున్ పురో-
    హితముఖ్యులెల్ల వేగతుల పఱవ,
తనకడుపుచేత సప్త పాదములు నడవ
లేక, వేయి విఘ్నములు కల్గెనని పెండ్లి
మాని బ్రహ్మచర్యమె నిత్యమూనినట్టి
దుండిగణపతి యుదరంబు నిండుఁ గాత! 97

నక్ష—ఓయీ గణపతీ, ఉండ్రపుముక్కలు రెండు విసరివేయునేమో అని నీవు మఱదిని ప్రార్థించినావు గాని నీ నోట కరకాయయే. ఎన్ని ఉండ్రములున్నను ఆబొజ్జదేవరకే చాలవు; నీకేమి యిచ్చును?

గణ—నక్షత్రకా, నాది ఉండ్రాళ్ల మీఁది భక్తే కాని విఘ్నేశ్వరుఁడి మీఁదిది కాదనుకొన్నావా ఏమి? ఆయన నాకు అభిమానదేవుఁడు. ఆయనమీఁద ఇంతకు ముందు నేనిక్కడ ఉన్నప్పుడు ఒక గణపతిపంచకం రచించినాను. విను, చదువుతాను.

« క. పనిచెఱుపులదొరవని నిను
    పనులన్ చెఱుచుకొని రైన పలుమాఱును నా
    మనమున ఘనముగ భజియిం-
    తును, విఘ్నములెల్ల మాన్పు దుండిగణపతీ. 98

« క. పదలక టెంకాయలపయి
    ముదురగు టెంకలను సతతమున్ గొఱుకుటచే
    మొదటికి నొక పల్లూడఁగ,
    తుదకొకదంతంబె నీకు దుండిగణపతీ. 99

« క. రెండు కరంబులు చాలకె-
    కొండు కరముఁ దాల్చి దొడ్డయుదరము నెల్లన్
    నిండించుకొందువందురు
    తుండము నీకుండఁ బట్టి దుండిగణపతీ. 100

"క. ఇలు చొచ్చి యచ్చటన్ నీ
 యెలుక దినుసు లెల్ల తినినయెడలను సతితో
 కలహమని యెంచి, పెండ్లిని
 తొలఁతనె మానితివి నీవు దుండిగణపతీ. 101

"క. వెనకయ్య యనెడు పేరు-
 న్నను, వేల్పులోన నతిఘనంబుగ నీపూ-
 జనములె జననులు మునుముం
 దున సలుపుచునుందురయ్య, దుండిగణపతీ". 102

నక్ష—ఓయీ, గణపతివైనందుకు సార్థకముగా స్వామిసందర్శనమునకై వచ్చెడు వారికందఱకును విఘ్నము కలిగించుచున్నావు. నయము; పంచకము రచించినావు గనుక బ్రదికి పోయినాము గాని, శతకమే వ్రాసియున్నయెడల అది అంతయు ఇక్కడ ఏకరువుపెట్టవలసిన వాఁడవే కదా? ఇఁక పైకి రమ్ము... రాజా, మీరును రండు.

[అందఱును పైకి నడుతురు.]

హరి—దేవీ, ఈ కాశీక్షేత్రమాహాత్మ్యమును వర్ణింప శ్రీనాథాదిమహామహులకే మో గాని, సామాన్యమానవుల తరము కాదు. సుక్షేత్రములని భరతఖండమందు ప్రసిద్ధిని గాంచిన సప్తపురములలోను ఇది మొదట ఎన్న తగినది. ఇచ్చట ప్రాణులకు మరణసమయమందు శివుఁడే వచ్చి చెవిలో ప్రణవమంత్రము పదేశించుచుండుటచేత మోక్షము నిశ్చయము. ఎట్టి ప్రళయసమయములయందును, తక్కిన పురములన్నియు నశించినను, ఈ వారాణసీనగరము మాత్రము నశించదఁట!

గణ—మిత్రమా, ఇక్కడ పుట్టి పెరిగిన వాఁడను కావడంచేత కాశీమహాత్మ్యము నాకు తెలిసినట్లు మీలాంటి పై వాళ్లకు ఏలాగు తెలుస్తుంది? నేను చెప్పుతాను, వినండి:

ఉ. ఏమని కాశికామహిమ నెన్నుదు? ఇచ్చట చావునొందినన్,
 దోమయు కూడ సామజముతోడ నెదుర్కొని చంపు; కప్పయున్

పామును చేత పట్టుకొని బల్మిని లాగును; మేకపిల్లయున్
తా మెయి వ్యాఘ్రిచర్మమును దాల్చును చిత్రవిచిత్రవైఖరిన్. 103

నక్ష—ఈ క్షేత్రమునకున్న లోపమొక్కటే అని నాకు తోఁచుచున్నది. బంగారమందు సువాసన లేని లాగుననే, ఈక్షేత్రమునందు తగిన నది పాఱకుండుటచేత ఇది ఏమియు శోభింపకున్నది.

గణ—ఓయీ, నువ్వువినలేదా ఏం? అందు గుఱించి ఈ పట్టణంలో ఒక ప్రతీతి ఉంది. ఇఁక కొద్ది కాలములోనే ఈ పట్టణానికి సూర్యవంశంలో పుట్టఁబోయే ఒకానొక రాజు శివుఁడి జడలలో ఉన్న గంగను తీసుకు వస్తాఁడఁట!

నక్ష—ఓయీ, ఇది నిశ్చయమే అయినయెడల, అప్పుడు చూడవలెను దీని శోభ; ఇప్పటికంటె వేయింతలైనను హెచ్చగును. అప్పుడు కాశికాపతియగు శంకరుఁడు నిజముగా అష్టైశ్వర్యవంతుఁడని చెప్ప వచ్చును.

హరి—ఆహా! శంకరా! భక్తవశంకరా, నీవు అష్టైశ్వర్యవంతుఁడవని ఎఱిఁగియే, నీవెట్లో నా అప్పు తీఱు ఉపాయము తోఁపించెదవని నీపట్టణమునకు వచ్చినాను.

మ. సతతంబున్ రజతాద్రి తావకనివాసస్థానమౌ; స్వర్ణప-
ర్వతమే విల్లగు; రత్నగర్భ రథమౌ; రత్నాకరంబే దొనౌ;
హితుఁడౌ ఆ ధనదుండు: ఇవ్విధముగా ఎవ్వారికిన్ లేని సు
స్థితితో, నా ఋణమేల తీఱుపవు? కాశీవాసవిశ్వేశ్వరా. 104

గణ—మిత్రమా, కలిగిన వాఁడు గాది తీసేసరికి లేని వాఁడి పాగాలు ఊడినవన్న సామెత వినలేదా? అదీ గాక, వాడవాడకు బిచ్చమెత్తి ఐశ్వర్యం సంపాదించుకొన్న ఈ ఆదిభిక్షుఁడు కోఁతిపిడికిలి వాఁడు. తానే తిన్నగా అనుభవించ లేఁడు; నీకేం పెడ్తాఁడు? ఇంతటి ఐశ్వర్యం ఉన్నదన్న మాటే కాని ఒక్కగుడ్డయినా కట్టఁడు; చివరకు ఒక గోచి అయినా పెట్టఁడు.

మ. అయయో! ఔర! అయారె! నీవొక సమస్తైశ్వర్యవంతుండవా?
భయమున్ గొల్పెడి వల్లకాఁడునికియున్; పాముల్ నగల్; గొంతుకే-

నియు, తిన్నన్, దిగకుండు చేదువినమే నీ తిండి; ఇంతేల గో-
చియునున్ లేదుగదయ్య నీకు? హర, కాశీవాసవిశ్వేశ్వరా. 105

హరి—నక్షత్రకా, మీ గురువుగారి ఋణము నేను తీర్పవలసిన దినమిదియే. ఒక రెండు మూఁడు దినములు ముందుగా వచ్చియుండినను ఏదో ప్రయాసపడి ధనము సంపాదించుటకు వీలు కలిగి ఉండును. నిన్న సాయంకాలము మనమీ పట్టణమును చేరుటచేత ఏమి ప్రయత్నించుటకును వీలు లేక పోయినది. ఉన్న పాటుగా ఇంతధనమిచ్చు వారెవ్వరు? నాకేమియు తోఁచకున్నది.

గణ—మిత్రమా, నాకొక్క ఉపాయం తోస్తూ ఉంది. నువ్వు చక్రవర్తివై ఏకచ్ఛత్రాధిపత్యంగా భరతఖండాన్ని పరిపాలించిన కాలంలో ఆ గొడుగు నీడను తనకడుపు చల్ల అయినా కదలకుండా, సుఖాలను అనుభవించిన సామంతకోటిలో వాఁడే కదా ఈకాశీపురాధిపతి? నువ్వు ఒక్క మాట అనఁగానే చేతులు కట్టుకొని వచ్చి కావలసినంత సొమ్ము అతఁడు కుప్పగా కురిపిస్తాఁడే.

హరి—గణపతీ, నీవు చెప్పినది నిజమే; కాని,

సీ. ఇచ్చినాఁడను చేతికెముక లేదని నన్ను
సామంతనృపులెల్ల సన్నుతింప;
తెచ్చినాఁడను సర్వదిక్కులనుండి యా-
చకకోటులను మదాస్థానమునకు;
చొచ్చినాఁడను, ఎంత సొమ్ముకోరిన నంతొ-
సంగి, అర్థుల యంతరంగములను;
వచ్చినాఁడను సాటి వసుధ దధీచిము-
ఖ్యులగు దాతలతోడ కొంత కొంత;
హెచ్చినాఁడను సర్వమహీతలమున
కలుగు నవ్యరాజన్యసంఘముల నెల్ల:
అట్టి నేనొక సామంతుఁడైన నృపుని-
కెట్లు చేచాచఁ గలనో యూహింపుమయ్య. 106

గణ—చేయి చాచి అడగడం కష్టమన్న సంగతి బాధ్యుఁడవైన నేనూహించినా

బోధపడదు. నా ఉపాయం నీకు నచ్చింది కాదు గనుక ఇంక చేయు వలసిన పని, మఱి కొన్నాళ్లవఱకూ ఋణం కోసం బాధించకుండా విశ్వామిత్రుఁడిని బ్రతిమాలుకోవడమే.

హరి—గణపతీ, ఈ దినమున నేను ఋణమును చెల్లింతునని, మాట యిచ్చిఉంటినే.

గణ—అప్పు దగ్గఱ మాత్రం మాట పట్టింపు లేదు. ఇస్తానని ఎన్ని సారులైనా తిప్ప వచ్చును. ఇస్తానన్న నాఁటికి ఇయ్యకున్నా ఉద్దేశమే అప్పు తీర్చ వలసిన వాఁడి మనస్సులో ఉంటుంది. ఉద్దేశమే కదా ముఖ్యం? ఆ నాఁటికి సొమ్ము తన చేతికి వస్తుందని అప్పుల వాఁడూ నమ్మఁడు. కాఁబట్టి అప్పటికి అప్పు తీర్చక పోయినా అసత్యదోషం రాదు.

హరి—గణపతీ, నీ వాదనా శక్తి అంతయు లౌక్యచింతాపరాయణులయొద్ద గదా ఉపయోగింప వలెను?

గణ—మిత్రమా, మఱి ఈ దినం అప్పు ఏలాగు తీరుస్తావు?

హరి—నాఁడు విశ్వామిత్రులలో చెప్పియే ఉన్నాను. తల అమ్ముకొని అయినను తీర్చెదను. నక్షత్రకా, సాయంకాలములోపల ఋణము తీర్ప వలెను. ఇప్పటి నుండియును ప్రయత్నించినఁ గాని, అప్పటికి తేలక పోవచ్చును. కాఁబట్టి ఈ అంగడి వీధిలో నన్ను అమ్ముము.

చంద్ర—హర హరా! పాపము శాంతించును గాక! ఆర్యపుత్రా, అమ్ముకో వలసిన సొత్తు మఱి లేకున్నయెడలఁ గదా మిమ్ములను మీరమ్ముకో వలెను? దేవర సొత్తును నేను లేనా? నన్నమ్ముకొని మీ అప్పు తీర్చుకొనుఁడు.

హరి—ఆహా! ఆహా! ఎంతటి ఘోరపుమాటలు వినవలసి వచ్చెను. దేవీ, నన్నిట్లు పలుకుట నీకు న్యాయమా? స్త్రీధనమే తిన కూడదని పెద్దలందురు. ఇంక స్త్రీని అమ్ముకొన్న ధనమును తిను పాపాత్ముఁడెందయినను ఉండునా? అట్టి తప్పు పనికి త్రోవ తీయఁదగువాఁడు ఈ హరిశ్చంద్రుఁడనియే నీవూహించితివా?...ఆహా! ఎంత మాట!...ఏమి? నేను నిన్ను అమ్ముకొనుటయే! నా మోహాస్థానమవు; నా అర్ధశరీరిణివి; నా భాగ్యదేవతవు;

ఉ. నా పరితాపరోగములణంచెడు మందు, భవాబ్ధి నాకు పెన్
తేపయు, నా గృహంబునకు దీపము, వంశవిభూషణంబు, ని-
క్షేపము, కంటి పాపయును, జీవనమున్, సకలంబునంచు ని-
న్నోప్పఁతీ, తలంతు; ఎటులోపుదు నిన్నెడఁబాసి యుండఁగన్? 107

చంద్ర—ఆర్యపుత్రా; మీ పరితాపరోగములణంచెడు మందునని నన్నెంతో గొప్పగా చెప్పుచున్నారు. ఇప్పుడు మీకు ఋణమూలమున కలుగుచున్న ఈ పరితాపమును అణంచకున్నయెడల, నేను మీకు భార్యనగుటకు ఎట్లు తగుదును? కాబట్టి నా వియోగమునకు దుఃఖింపక, ఇప్పటికున్న ఉపాయము ఇదే గనుక నన్నమ్ముకొనుఁడు; సంశయింపకుఁడు.

హరి—దేవీ, ఏమనుచున్నావు? నీవు నా పరితాపరోగములణంచెడు మందువని చెప్పుట ఒక గొప్పగా భావించుచున్నావా? ఇటు విను:

సీ. ఎదురుగా నీ దివ్యవదనమించుక తోఁచు-
టన, పూర్ణచంద్రోదయంబు గాదె?
నీ లోచనంబుల ధాళధళ్యము మీన-
లావణ్యలక్ష్మీవిలాసము గదె?
తేనెలొల్కెడి భవదీయవచఃప్రసం-
గంబన, అమృతార్ణవంబు గాదె?
నిడుదలై నిగ్గు దేఱెడు నీదు నెరులమొ-
త్తంబెల్ల వాతవిధ్వంసిని గదె?
తాపులకు నెల్ల తావయి తనరు నీదు
నెమ్మెయి వసంతకుసుమాకరమ్ము గాదె?
నాదు దుఃఖరోగముల నణంచ గల ఘ-
నౌషధంబవు నీవ కావా? లతాంగి. 108

భార్య అనఁగా సుఖదుఃఖములు తనతో సమానముగా పంచుకొనునది; ఎట్టి ఆపదలు కలిగినను తన ఆదరణముచేత వాని బాధలను కనఁబడనీయనిది; పురుషునికి మోదసాధనములన్నింటిలోను ముఖ్యమైనది. ఇట్టి లక్షణములన్నియు పూర్ణముగాఁ గల నిన్ను నేనెట్లు విడుచుకొనఁ గలనుఁ?...నీ మాట అటుండఁగా ఎన్నఁడును నన్ను విడిచి ఎఱుఁగని ఈ చిన్ని కుమారుని ఎట్లు విడుచుకొందును?

లోహి—నాన్నగారూ, నన్ను మీరు విడిచి పెట్టుదురా? (ఏడుపు మొగము పెట్టి)

ఉ. మిత్రుని రీతి నన్ కలిసి మీరలునాటలనాడుచుందురి; బల్
చిత్రవిచిత్రపున్ కథల చెప్పుచునుందురు; చేరఁ దీసి, నా
గాత్రము తట్టి, ముద్దులిడి, కౌఁగిట చేర్చుచునుందురి: నాన్న గా-
రూ, త్రిజగంబులందుఁ గలరో మిముఁ బోలిన తండ్రులెందునున్?

అట్టి మిమ్ము విడిచి నేనెట్లుండఁ గలను?

చంద్ర—(రోహితాశ్వుని చేరఁ దీసి బుజ్జగించుచు) నాయనా, మన అదృష్టము లిట్లున్నవి. కొన్ని నాళ్లు మనలను నాయనగారు విడుచుకొనిననే తప్ప వారు మాటను నిలువఁ బెట్టుకొన లేరు. దైవానుగ్రహమున్నయెడల, వారిని త్వరలోనే కలిసికొని మఱి ఎన్నఁడును విడువకుందుము, లే.

రోహి—అలాగా? నాన్నగారూ, నాకు తెలిసినది కాదు. మీకు అవసరము గనుక మిమ్ములను ఎట్లో విడిచి దినములను వేగించెదను. నాకోసము మీరు మాట తప్ప వద్దు.

హరి—(రోహితాశ్వుని దగ్గఱకు లాగుకొని ముద్దులాడుచు) దేవీ, నాకు నీయందే ప్రేమ ఎక్కువో, వీనియందే ప్రేమ ఎక్కువో, తెలియదు సుమీ... నాకే కాదు; లోకములో పురుషులందఱకును భార్య ఎక్కువా? పుత్రుఁడెక్కువా?... భార్య తన అర్ధదేహమే అయినయెడల, పుత్రుఁడై మఱల తానే పుట్టును గదా? అందుచేత,

సీ. కొమరుని తొక్కు పలుకులె ప్రీతి గొల్పు, ప్రి-
యాంగన ప్రౌఢవాక్యముల కంటె;
బుడుతని మెత్తనౌ యొడలె సౌఖ్యము గూర్చు,
మెలఁతుక జిగిబిగి మేని కంటె;
కొడుకు తేలిక చూపు గుములె యింపొనరించు
కలికి బెళుకున్ చూపుగముల కంటె;
పుత్రునమాయకంపున్ నవ్వె సొంపగు,
ననబోణి సరసంపు నవ్వు కంటె;
ఎట్టి దేహతాపమేనియుఁ శమియించు,
తనయు మేనొకింత తగిలెనేని;

ఎంత మనసు చింతయేనియు నశియించు,
సుతుని నుడులు చెవిని చొచ్చెనేని. 110

దేవీ, ఈ రోహితాశ్వుని గాని నిన్నుఁ గాని విడిచి నేనెట్లు ఉండఁగలను? అట్టి మాట ఇఁక తలపెట్టకుము.

చంద్ర—ఆర్యపుత్రా, మమ్ము విడువ వలెనన్న విచారమువలన ఆలోచన తోఁచక మీరు నాపలుకలను గల ఔచిత్యమును తెలిసికొనలేకున్నారు. నన్ను విడుచుట మీకెంత సంతాపకరమో, అంతకంటె వేయింతలు మిమ్ము విడుచుట నాకు సంతాపకరము. మగని వదలి ఉన్న మగువ బ్రదుకు మొండి బ్రదుకు గాక వేఱేమున్నది?

చ. పెనిమిటి కన్న నన్యమిఁక పృథ్విని సాధ్వికి కల్గ నేర్చునే?
తన పెను ప్రాపు, ప్రాణమును, దైవము, సర్వము నాథుఁడే కదా?
తన హృదయాధినాథుని వదల్పఁగను కామిని చూపులేని య-
క్షిని, మఱి విన్కి లేని చెవి, జీవముఁ బాసిన మేనిఁ, బోలెడున్. 111

ఎట్టి పతి అయినను సతికి దేవుఁడే; ఆయన పాదపద్మములే ఆమెకు గతి; ఆయన చరణసేవయే ఆమెకు సద్గతిసాధనము. ఇఁక మీవంటి ప్రాణనాథుని సంగతిచెప్ప వలసినదేమున్నది?

ఉ. మీ సరసత్వమెంతయని మెత్తును? మీదు పదంబులొత్తు మీ
దాసికలందు నేనునొక దాసిని నైనను బ్రీతిచేత మీ-
తో సరిగాఁగ నారయుటతో తనివిన్ గన, నెచ్చుదానిగా
ఓ సుగుణాత్మ, నన్నరయుచుందురు: మిమ్మెటు పాయఁ జాలుదున్?

కాని ఒక్కటి ఆలోచింపుఁడు: ఋణము తీఱుటకు మీరో నేనో అమ్ముడు పోవక తీరదు. ఎవ్వరము అమ్ముడు పోయినను, మనము ఒకరినొకరు ఎడఁబాయక తప్పదు. కాఁబట్టి నన్నే ఎవ్వరికైనను దాసిగా అమ్ముఁడు.

హరి—అయ్యో, దైవమా! ఎట్టి మాటలు విన వలసిన దురవస్థ సంభవించినది?.. హా! దేవీ, నీవు ఇంతకు ముందు అనుభవించిన మహావైభవమెక్కడ? దాసి వగుట ఎక్కడ?

మ. రతనాల్ చెక్కిన బంగరున్ విసనకఱ్ఱల్ వీచుచున్, వేడ్కకై
కతలన్ చెప్పుచు, నొప్పి లేకొదుగునట్టుల్ కాళ్లొత్తుచున్ దాసికా
తతులై రాజసతుల్ భజింప సుఖమొందం గన్న నీవిప్డు దే-
గతి వేఱొక్కరి దాసివౌచు కొలువంగా నేర్తువో? అక్కటా! 113

చంద్ర—ఆర్యపుత్రా, అట్టి మహాసుఖమనుభవించుటకు కారణభూతులగు మీరు మాత్రము వేఱొక్కరికి పరిచర్యలు చేయ తగినవారా? మీరే ఇతరులకు దాసులగుటకు ఊహించుచుండఁగా, ఇఁక దేవర దాసినైన నేను దాసినగుటయే కష్టమా?

మ. పరరాజన్యుల గెల్చి, తన్మకుటసోపానాళిపైఁగా నిరం-
తరమున్ సింగపుగద్దె నెక్కి, నృపబృందంబెల్ల కీర్తింపఁగా
తరుగొక్కింతయు లేని వైభవముతో ధాత్రీతలంబంతయున్
పరిపాలించినయట్టి మీరలిఁక, ఏభంగిన్ పరున్ గొల్తురో? 114

[బ్రాహ్మణవేషముతో దంతఘాతుఁడు ప్రవేశించును.]

దంత—(తనలో) గురువుగారు చెప్పిన పని ఈ మాత్రైనా తిన్నగా చేయక పోతే, దంతా లూడేటట్టు ఘాతం తగిలి నా దంతఘాతనామం సార్థకం అవుతుంది. ఆ వకవకలు జరుగకుండా నాలుకకు కళ్లెం వేసే ఉంచాలి. గురువుగారు నాకు వేసిన ఈ బ్రాహ్మణవేషం మాత్రం బ్రహ్మయినా భేదించలేఁడు. (సమీపించి) ఎవరయ్యా మీరు, ధర్మప్రదాతలు? నేనొక బ్రాహ్మణ్ణి; భిక్షుణ్ణి; యాచనకోసం వచ్చాను.

గణ—ఏమోయి వెఱ్ఱి బ్రాహ్మఁడా, ఎండిన కొలఁకును కొంగలాశ్రయిస్తవా?

దంత—మహారాజా, ఎండిన కొలఁకైతే ఏం? నిండిన కొలఁకైతే ఏం? నా స్వల్పవాంఛ తీర్చఁడానికి ఏ మాత్రం కావాలి? లక్షలవసరం లేదు; కోట్లు అవసరం లేదు. అల్పసంతుష్టిని; తృణం మహామేరువు. పిల్లవాఁడికి ఉపనయనం చేసుకుందామని ఊరూర తిరుగుతూ వున్నాను. ఇక్కడ ''గద్దె ఎక్కి ధాత్రీతలమంతా పరిపాలించిన'' వారి మాట ఎవరో అంటూ వుంటే విని వచ్చాను.

నక్ష—ఓయీ బ్రాహ్మణుఁడా, అవి అన్నియు వెనుకటి ముచ్చటలు. అట్టి రాజ్య

ము నంతయు పరులకు ధారపోసి, ఒక మునీశ్వరునకు యజ్ఞము నిమిత్తమై ఇచ్చెదనని అంతకు పూర్వమే ఒడఁబడిన ధనముకొఱకు తన్నో, తన ఆలుబిడ్డలనో, అమ్ముకొనుటకు ఈ మహారాజు సిద్ధముగా ఉన్నాఁడు.

దంత—ఏమిటీ! భూచక్రమంతా ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలి, లోకంలో చక్రవర్తిపదం కొత్తగా కల్పించిన హరిశ్చంద్రమహారాజుగారా ఈయన? బాబ్బాబ్బాబు, ఈయన సంగతి ఇంతకు ముందు వినే ఉన్నాను. వీరి పేరు లోకమెల్లా కోడై కూసింది.

గణ—ఏమయ్యో! బ్రాహ్మఁడా, నోటి పరువు తల చెప్పుతుందంటారే. ఇదేం శూద్రుఁడిలాగు కోడి అంటూ ఉన్నావు?

దంత—(తనలో) ఆహాహ! నాలుక మఱల నాకొంప తీస్తుంది కాఁబోలు. ఈ గణపతిగాఁడొకఁడు నా ప్రాణానికి శని లాగు దాపురించి అపులిస్తే పేరులు లెక్క పెడ్తూ వున్నాఁడు. (ప్రకాశముగా) అయ్యా, సామెతలలోనూ బ్రాహ్మణ్యమేనా?

నక్ష—అయ్యా, మఱి ఇట్టి దీనదశలో ఈ మహారాజు నీకేమి ఈయఁగలఁడు? కాఁబట్టి వచ్చినదారి పట్టుము.

దంత—మహారాజా, అది న్యాయం కాదు. నోరు తెఱచి ''దేహి'' అన్న దేహిని వట్టి చేతులతో తగిలి వేయడం అలాంటి దొడ్డదాతకు తగనిది. కాఁబట్టి ఈ మహారాజుకు బాధ లేని వుపాయమే చెప్పుతాను. వీరిప్పుడు అమ్ముడు పోతూ వున్నారు గదా? అందులో మునిఋణం తీఱఁగా మిగిలిందే నాకిప్పించండి.

గణ—ఓయీ, నీ వేం నరభోజనుఁడివా? లేక బ్రాహ్మఁడవా?

దంత—(తనలో) అయ్యో! నేను రాక్షసుఁడినని మళ్లీ పోల్చుకొన్నాఁడా ఏం? (ప్రకాశముగా) అదేం మహారాజా, అలాగు అంటూవున్నారు? నేను శిష్టుఁడైన బ్రాహ్మఁడనే.

గణ—బ్రాహ్మఁడవే ఐతే నరభోజనుఁడి లాగు ప్రాణాలు కొఱికి తింటూ ఉన్నావేం? ఈయన అప్పు ఎంతో నీకు తెలుసునా? ఏనుఁగు మీఁద మనుష్యుఁడెక్కి చేతితో రత్నం ఎగమీటినంత పొడుగు బంగారు నాణేల కుప్ప ఈయన ఇస్తానన్నవి. అవి పోఁగా ఇఁక మిగిలేవి నా ఎముకలు. కావలిస్తే అవి కొఱుక్కొని తిను.

దంత—మహారాజా, ఏమో నా అదృష్టం. అది పోఁగా ఏమైనా మిగిలితేనే నాకు ఇప్పించండి.

హరి—ఓ బ్రాహ్మణుఁడా, అట్లే కానిమ్ము.

దంత—బాబ్బాబ్బాబు, మహాప్రసాదం...అయితే బాబూ అబద్ధం ఆడనని మాత్రమే కదా మీ పూనిక? సరే, సంతోషమే; కాని ఎవరికో రాజ్యం ధార పోస్తానన్నారే. రాజ్యం వీరభోజ్యం గదా? వాళ్లను యుద్ధంలో జయించి తిరిగి ఆ రాజ్యం మీరెంచేత పుచ్చుకో లేదు?

హరి—అయ్యా, ఇది నీవంటి బ్రాహ్మణులు అడుగవలసిన ప్రశ్న కాదు. మీకే నేనైను దానమిచ్చి మరల బలవంతముగా చేయి నులిపి లాగుకొన్నయెడల, ఎంత ధర్మముగా ఉండును? అదియుఁగాక,

ఉ. కమ్మని పండ్లనిచ్చి, అవి క్రమ్మఱ తెమ్మనఁ బోవు చెట్లు; నీ-
రమ్ములనిచ్చి, ఏఱులవి క్రమ్మఱ తెమ్మని కోర; విట్లుగా
ఇమ్మహిలో అచేతనము లేనియు నిచ్చినయట్టి వానినిన్
క్రమ్మఱ పుచ్చుకోవనిన, క్రక్కిన కూడును నే గ్రహింతునే? 115

దంత—బాబ్బాబు, మఱొక్క మనవి: ఎవరో మునికి ముందుగానే ధనమిస్తానన్నారు గదా? అది పోఁగా మిగిలినదే కదా మీరు రాజ్యం ధారపోసిన వాళ్ళకు చెందవలసి ఉంటుంది? ఇఁక మీరు మునీశ్వరుఁడికి ఋణం ఏలాగు పడ్డారు?

హరి—అయ్యా, నీవు చెప్పినది నాకు న్యాయముగా తోఁచ లేదు. ఆ ధనము తప్ప తక్కినదే ఇచ్చెదనని నేను చెప్పి ఉండక పోవుటచేత, అదియు ధార పోసిన దానిలో చేరి పోయినది. కాఁబట్టి మునీశ్వరునికి ధనమీయవలసి ఉన్నది.

నక్ష—రాజా, ఇంత వఱకును నేను నీకు ఏవిధమైన సలహాయును చెప్పియుండ లేదు. ఇప్పుడు నీకు తటస్థింపనై యున్న దురవస్థను తలఁచి చెప్పక మానలేకున్నాను. నీవు ధనమీయనక్కఱ లేదన్న మాట అనుమని నేనేమాత్రమును చెప్పను. నీవు అట్లన్నయెడల, అది కేవలమును అబద్ధమే. అసత్యమును పలుకనన్న నియమము గల నీనోట అట్టి మాట వెలువడ కూడనిదే. కాని, ఏవిధమైన బాధకమును లేని ఉపాయమును నేను చెప్పెదను, వినుము: నీవును అమ్ముడు పోనక్కఱ లేదు; నీ భార్యాపుత్రులను అమ్ముడు పోనక్కఱ లేదు. నీవు ధనము నా చేతికి గదా ఇయ్యవలసి ఉన్నది? నేనిప్పుడు మా గురువుగారి దగ్గఱకు తిరిగి

వెళ్లి, గడువు వరకి నీవీయ వలసిన ధనమంతయు నా చేతికి ఇచ్చినావనియు, ఒంటిగానిని నన్ను దారిలో దొంగలు కొట్టి ఆ ధనమంతయు దోచుకొన్నా రనియు, చెప్పెదను. ఇందువలన నీ కసత్యదోషము రాదు...ఇఁక మీరు సుఖముగా ఉండుఁడు; నేను పోయి వచ్చెదను. (పోఁబోవును.)

గణ—ఏదీ, ఎదీ, నక్షత్రకా, నా సంతోషం తీరా నిన్ను ఒకర్రసారి కౌఁగిలించుకొననీ. అమ్మా! ఎంత వాఁడవు? చూడడానికి ముంగి లాగు ఉన్నావు గాని, నీ తన్న గడుసుతనం మాకెవ్వరికీ లేక పోయింది. ఇంత చిక్కు నీ ఉపాయం చేత మంచు లాగు చప్పున విడి పోయింది...మిత్రమా, ఇఁక నక్షత్రకుఁడి వద్ద సెలవు పుచ్చుకో.

హరి—గణపతీ, ఏల ఈ తొందర?...నక్షత్రకా, నీవు చెప్పిన ఉపాయము వలన నూరార అసత్యమాడవలసిన వాఁడవు నీవే కాని, నేను దానిని ప్రోద్బలము చేసిన వాఁడను కానా? తెలిసియుఁ ఊరకున్న యెడల, నాకు అసత్యదోషము రాక తప్పదు. ఇంతకును ఇది చెప్పుము: నీవు చెప్పిన ఉపాయమును బట్టి విశ్వామిత్రుని అప్పు నేను గడువులోఁగా తీర్చినట్లయినదా? తీర్చక పోవుట మాట తప్పి పోవుటే కదా? ఇట్లు నాకసత్యదోషము తప్పక పోవుట సరే కదా, మీఁదుమిక్కిలి నీకును అసత్యదోషము కలుగును. కాఁబట్టి నీ ఉపాయము నేనొప్పుకొనను.

నక్ష—రాజా, అట్లయినయెడల, నా నిశ్చయము వినుము: గడువు కానీ, కాక పోనీ, సేనిక్కడ ఇంకొక్క నిమిషమైనను నిలిచి ఉండను; నీవియ్యఁబోవు ధనమును నేను తీసికొని వెళ్లను. నేనింతకు ముందు అన్నట్లే మాగురువుగారితో చెప్పెదను. అప్పుడేమి చేసెదవు?

హరి—మునికుమారా, నా యందభిమానము కలవాఁడవయ్యును, ఇట్లు నాకు అసత్యదోషము కట్టిపెట్ట తలఁచినప్పుడు నేను నిన్ను ఏమి చేయఁగలను? కానిమ్ము; నీ అనుగ్రహము ఈ పాటిదే కదా అనుకొని, ఆ ధనము మాగణపతిచేత నైనను పంపించెదను.

గణ—నా చేతా? ఏం మిత్రమా, నామీఁద నీకు ఈలాంటి కటాక్షం పుట్టుకవస్తూ ఉంది? నా అవస్థ ఏమైనా చూచినావా? మళ్లీ కాళ్లీడ్చుకొంటూ అన్ని ఆమడల ప్రయాణం... అడవిలోఁ బడి నేను నడచిపోఁగలనా? నా ఎత్తు ధనం పోసినా ఆ పని నా వల్ల కాదు.

చంద్ర—ఆహా! దైవమా, ఎంతటి పేదతికము తెచ్చితివి? ఎందుతో సాధురతరా

జల సేవలను పొందిన సార్వభౌముని పలుకు ఆదరించి వినువారు ఒక్కరును ఇప్పుడు లేరైరే!

హరి—దేవీ, పేదఱికమునేల నిష్కారణముగా నిందించెదవు? లేమియే కదా ప్రేమానిక్షేపములను తెలుపు దివ్యాంజనము? దారిద్ర్యమే కదా పరస్పరస్త్రీ స్వర్ణమును తెలుపు గీటురాయి? ఇంతే కాదు; మనుష్యుని నిజస్థితిని తెలుపునది పేదఱికమే కదా?

సీ. గడ్డి పోచకు గుడ్డి గవ్వకు నేనియు
    సరిపోని యప్రయోజకుఁడనియును;
తనదు కోరికలకు తగినట్లు లాచరిం-
    పంగఁ జాలని యసమర్థుఁడనియు;
ఇసుమంత కష్టంబులేని తప్పించుకో-
    లేనియంతటి బలహీనుఁడనియు;
భారమంతయును దైవంబుమీఁదనె మోప
    వలసినయట్టి దుర్బలుఁ డనియును;
నరుని యున్న సంగతి యున్న కరణిఁగాఁగ,
ఇట్లు మోమోటమును లేక యెఱుఁగఁ జేయుఁ
గాదె పేదఱికంబు? నిక్కమును పల్క
మానవులకెల్ల అదె గదా మార్గదర్శి? 116

చంద్ర—ఆర్యపుత్రా, మీరు చెప్పిన సుగుణములు పేదఱికమందు లేక పోలేదు. ఇవి అన్నియును ఉన్నను, పేదఱికము అనుభవించుట మాత్రము ఎంత ద్రుఢనియమము కలవారికైనను కష్టమే. ధనహీనుఁడైన వానిని ఒడలి నెత్తురే విడిచి పోఁగా, ఇఁక ఇతరులు విడుచులో వింత ఏమున్నదని పెద్దలందురు. అది నిజమే కదా?

చ. సిరి పగలింటి వంటిదని చెప్పఁగఁ జెల్లు; ఎటన్న: భాగ్యభా-
    స్కరుఁ డుదయింప దవ్వులను కన్పడి, మెల్లగ ఉచ్చవేళకున్

చరణములంటి, మళ్లు తటి చల్లగ సాగెడు తోము సిద్ధ,—లం-
ద్దిర! కనిపించు లేని కలదే దురదృష్టపుదుర్దినంబులన్? 117

దంత—అమ్మా, మీకు ఈకష్టంలో తోడుపడ డానికి ఎవ్వరూ లేక పోయారని ఏల విచారిస్తారు? ఇంతకు ముందు మీ సొమ్ము తిన్న వాళ్లు మీకు కృతజ్ఞత చూపించక పోతే, ఇఁక ముందుకు మీ సొమ్ము తినవలసిన నేనైనా మీరు చెప్పినట్లు ఋణధనం మోసుకు పోతాను లెండి.

గణ—ఆహా! ఇతఁడెంత పుణ్యజనుఁడు! చుట్టమై చూడ వచ్చి దయ్యమై పట్టు కొంటూ ఉన్నాఁడు.

దంత—(తనలో) పుణ్యజనుఁడు—దయ్యం—అంటూ వున్నాఁడు. అయ్యో! గుర్తుపట్టాఁడా ఏం? మళ్లీ గుండె ఎక్కి లొకుక్కొంటాఁడు కాఁబోలు. ఏం గతి? ......అయినా తొందర పడ రాదు. (ప్రకాశముగా) ఏమయ్యా; బ్రాహ్మణ నన్ను దయ్యమంటావు?

గణ—"దయ్యం" అంటే దైవమే కాదఁటయ్యా? దాని వికృతే ఇది.

దంత—ఆలాగా?...బాబూ, హరిశ్చంద్రమహారాజా, ఇంక తక్కిన శంకలన్నీ మాని, మీ భార్యను అమ్మడం మొదలు పెట్టండి. పొద్దెక్కుతూ వుంది.

హరి—ఆహా! బ్రాహ్మణుఁడా, నీవును అట్లే చెప్పెదవా?

చంద్ర—ఆర్యపుత్రా, ఎవ్వరు చెప్పినను న్యాయమైన సంగతినే చెప్పెదరు కదా? ఇప్పుడు చేయ వలసిన పని నన్నమ్ముటయే. మన ఇద్దఱిలో ఎవ్వరము అమ్ముడు పోయినను ఎడఁబాపు తప్పదని ఇంతకు ముందే చెప్పియుంటిని. మీరమ్ముడు పోకున్న యెడల, నన్నెప్పటికైనను విడిపింపఁ గలరు.

దంత—మహారాజా, దేవి గారు చెప్పిన మాట సత్యం.

[కొందఱు పౌరులు ప్రవేశింతురు.]

హరి—అయ్యో! అయ్యో! అయ్యో! మీరందఱును కలిసి నన్ను భార్యనమ్ముకొను నంతటి చండాలునిగా చేయఁజూచుచున్నారా?...చుట్టును మూగి చూచుచున్న ఓ కాశీపురవాసులారా, ఏల నా మొగము వంక ఆలాగున తేరి పాఱఁ జూచెదరు? అందు వలన పుణ్యమా? మోక్షమా? చండాలుఁడనై, కటికవాఁడనై, కిరాతుఁడనై నా అర్ధశరీరిణిని, నా ప్రాణధనమును. నాజీవితేశ్వరిని, నేనే తానని నమ్మికొని యున్న నా సతీమణిని అమ్ముకొనఁ బోవుచున్న నావంటి పా

పాష్ఠుని చూచుట వలన మీకు ఘోరపాతకము తప్ప మఱేమి లాభము కలుగును? ఓ అయ్యలారా, రానే వచ్చినారు గనుక మీరందఱును ఇట్టి నీచకార్యమును చేయఁబోవుచున్న సిగ్గు లేని, నా మొగముమీఁద తుప్పున ఉమ్మఁడు... మొగము మీఁదనే కాదు; అమ్మెదనను పాపపు మాటలాడఁబోవు నానోటిలోనే ఉమ్మఁడు.

చంద్ర—ఆర్యపుత్రా, ఆర్యపుత్రా, ఇదేమి? ఇదేమి? మీరిట్లు గుండె పగిలి వాపోవుచుండగా, నేనెట్లు నిబ్బరముగా ఉండఁగలను? నాకు ధైర్యమునకు త్రోవ చూపవలసిన వారు గదా మీరు?

హరి—దేవీ, నాగుండె పగులునా? వట్టి మాట. ఇది సామాన్యపు గుండె కాదు; రాయి—ఇనుము—వజ్రము... నేను నీకు ధైర్యమునకు త్రోవ చూప వలసిన వాఁడనా? కాను, కాదు; ఇప్పుడు దాస్యమునకు త్రోవ చూప వలసిన వాఁడను......ఓ పౌరులారా, ఏల ఆలాగున కన్నీళ్లతో నన్ను చూచెదరు? నానోటను ఇంకను ఉమ్మరేమి? ఆ పాపపు మాటలు నా నోటను ఇంకను రాలేదనియా? మొండితనమును పూనుచున్న నా వంటి వాఁడు ఆమాటలు ఉచ్చరించుటకు ఎంత సేపు కావలెను... ఓ పౌరులారా,

సీ. తనుఁబాయుటన, నాదు తనువుఁ బాయుటె యని
ఎవతె గుఱించి యూహించుచుండు?
ఏమో లేకున్న, నా కేమియునున్ లేని
చందంబునని డెందమందు తలఁచు?
కనులున్న, ఎవతెను కనుఁగొన్న దాఁక లో-
కము నాకు చీఁకటిగాఁగ తోఁచు?
నేనె తానని, తానె నేనని ఎవ్వతెఁ
గూర్చి నామది నెన్నుకొనుచునుండు?
అట్టి అర్ధశరీరిణి, అట్టి నాదు
జీవితమును,—శరీరంబు చీల్చుకొన్న
పగిది, ప్రాణంబులెడఁ బాయు భంగి,—ఇచట,
అమ్మెదను రండి, అయ్యలారా, కొనుండి. 118

1వ పౌరుఁడు—శాస్త్రీ, చూచావటోయి, ఈయన కళ్లల్లో నుంచి నీళ్లు వఱదలు కట్టి పాఱుచూ వుండఁగా, ఎంత దుఃఖంతో తనభార్యను అమ్ముచూ వున్నాఁడో! పాపం, ఈ సాధుశీలుఁడికి ఈ లాంటి దురవస్థ ఏలాగు సంభవించిందో?

2వ పౌరుఁడు—చయనులూ, ఈయన దీనవాక్యాలు ఆలకించడం చేత నా గుండె నీరై పోచూ వుంది. నేనిక్కడ నిలువలేనోయి. అటుంటా పోదాం, రా.

(శాస్త్రియు, చయనులును, కన్నులు తుడుచుకొనుచు నిష్క్రమింతురు.)

3వ పౌరుఁడు—ఇలాంటి ప్రేమ గల దంపతులికి ఎడఁబాపు కలిగిస్తూ ఈవిడను కొనుకుంటే ఘోర పాపం. (నిష్క్రమించును.)

దంత—మహారాజా, మీరింత కడుపు పగిలేటట్టు ఏడుస్తూ అమ్మితే దేవిగారిని ఎవరు కొంటారు? కాఁబట్టి దుఃఖం విడిచిపెట్టి అమ్మండి.

హరి—అయ్యా, ఏమనెదవు? నేను సిగ్గునేమో విడిచి పెట్టనే విడిచి పెట్టినాను. నా ప్రాణముకంటె ప్రాణమైన ప్రాణేశ్వరిని విడువఁ బోవుచున్నాను. ఇఁక దుఃఖమును కూడ విడువ వలయునా?...ఇదిగో, అట్లే దుఃఖమును దిగమ్రింగుటకు ప్రయత్నించుచున్నాను......ఓ కాశీపురవాసులారా, నేను విచారించుచున్నానని మీరు అనుమానింపకుఁడు. ఈమెను సత్యము నిమిత్తమై అమ్ముకొనుచున్నాను గనుక నాకు కొంత వఱకు సంతోషమే. ఈమెను కొనుకొన్నయెడల, మీరు నాకు మహోపకారము చేసినవారగుదురు.

సీ. భారమ్మటంచును పూరెమ్మనున్ కూడ
వంచఁగాఁ జాలదీ మించుఁబోణి;
ఒత్తునేమో యన్న యూహతో నెమ్మేను
చేర్పదు పూలనీ చిగురుఁబోణి;
రాపిడికోర్వక రత్నభూషణములు
తాల్పంగ నేరదీ తలిరుఁబోణి;
కఱకుగా తగులుటన్ జరతారుపనితోడి
పుట్టముల్ కట్టదీ పువ్వుఁబోణి;
భోగభాగ్యంబులందె యెప్పుడును పెఱిగి
పరమసుకుమారిగాఁగను పరగినట్టి

ఈసతీశిరోమణిని నే దాసిగాఁగ,
అమ్మెదను రండి, అయ్యలారా, కొనుండి. 119

4వ పౌరుఁడు—ఏదోయి సెట్టి, ఈవిడను నువ్వు కొంటావా ఏటి? సవకగా ఒస్తాదేమో?

5వ పౌరుఁడు—రెడ్డి, నాకెందుకేంటి ఈ ముక్కుపట్టని ముత్తెం? పూరిక పుల్లయినా ఎత్తలేదంట; ఇలాంటిది మూటలు మొయ్యడానికి పనికొస్తాదా? ముల్లెల్లు మొయ్యడానికి పనికొస్తాదా? కొంటే, ఎదురుకెదురు, తట్టెడు తిని పెడ్తాది. తిండికి తిమ్మరాజూ, పనికి పోతురాజూ, అన్నట్టు ఇలాంటి దాసీదాన్ని పెట్టుకుంటే మొదలు సెడిన బేరమై, లాబం గూబల్లోకి ఒస్తాది. నాకొద్దు, పద పద.

(సెట్టియు, రెడ్డియు నిష్క్రమింతురు.)

6వ పౌరుఁడు—ఇలాంటి పరమసుకుమారికి పని చెప్పి కష్టపెట్టఁగలిగే కటికవాఁడే ఈవిడను కొనవలసినవాఁడు. (నిష్క్రమించును.)

దంత—మహారాజా, దాసిగా అమ్మఁబోతూ దేవిగారి సౌకుమార్యం వర్ణిస్తే ఏమిటి లాభం? అంచేత కొన తలఁచిన వాళ్లూ మానుకొని తిరిగి పోతూ వున్నారు.

హరి—అయ్యో, అట్లయినయెడల ఈ సారి వినుము... ఓ పురజనులారా,

సీ. ఇంటికేనే తేర, ఎదురుగా నరుదెంచి,
భక్తి నాపదములు పట్టి కడుగు;
అన్నపానాదుల నన్నిఁటి స్వయము తా-
నే కొనివచ్చి, నా యెదుట పెట్టు;
తాంబూలమిచ్చి, నా తాపంబుఁ బాప పూ-
నురటితో నాకు వీచుచును నిల్చు;
వే కయనింప, తానే తొడలను నాదు
పదములనిడుకొని పట్టుచుండు;
తా మహారాజ్ఞి యయ్యును, తనకనేక-
దాసికాజనులున్నను, తనువు వంచి

వనులోన ర్చెడి యీ పతివ్రతను వీాకు,
అప్పుడను రండి, అయ్యలారా, కొనుండి. 120

7వ పౌరుఁడు—శంకరకవీ, ఆ అమ్మకం అవుతూవున్న స్త్రీరత్నాన్ని చూచినావా? ఆమె అంగ సౌష్ఠవానికి తగిన యమక పుష్టితో వర్ణిస్తాను, విను:

క. కరమా తొడ? సుమరసకీ-
కరమా నుడి? పల్లవప్రకరమా కర? మా-
కరమా సుధకధరము? మధు-
కరమా జడ? జంఘయొకమకరమా? సకికిన్. 121

8వ పౌరుఁడు—మృత్యుంజయకవీ, నీయమకపుష్టి మండినట్టే ఉంది. "కరమా కరమా" అని మొత్తుకుంటే విన్నవాళ్లకు సౌఖ్యకరమా? మోదకరమా? నేను వర్ణిస్తాను, విను:

సీ. కటిక చీఁకటి వడఁగట్టి తీఁగెలుగ శా-
వించినట్టులు తలవెండ్రుకలును,
కొమ్మెంటుంగులను కల్వమ్మున నూటి ము-
ద్దలు కట్టినట్లు చూపుల తళుకును,
బలుతీయ పూఁదేనె గిలకొట్టి నిగ్గును
కరడు గట్టినయట్లు కావిమోవి,
లేఁత వెన్నెలల గాలించి పలుచగాఁగ
పఱచినయట్టులు చిఱునగవును,
మేలి బంగారుపొడిలోన మెఱుఁగుల తళు-
కులు గలిపి, అందు మల్లెపువ్వులను పిడిచి,
పాలు మీాఁగడలను పోసి పదనుచేసి-
నట్లు మేనును దనరు నొయ్యారికొర! 122

ఇదిగో, అన్నట్లు మన ఆస్థానకవి ఈశ్వర సోమయాజులుగారూ ఇక్కడే న్నారు. వారి అభిప్రాయమేమో?

9వ పౌరుఁడు—అర్థనష్టికి కారణమయ్యే యమకవృష్టి కూడనిదే. రెండవ పద్యం బాగానే ఉంది గాని, ఆవర్ణన ఈవిడయెడల సరిగా లేదు. అది కేవలం, పై మెఱుఁగులు మాత్రం కలవారి విషయమయ్యే పనికి వస్తుంది. ఈమెను చూచిన వాళ్ళకు సౌందర్యం మీఁద అట్టే దృష్టి పోదు. ముఖంలో కనిపించే పాతివ్రత్యాదిసుగుణసంపత్తిమీఁదే మనస్సు నిలుస్తుంది. ఆపై విచారసమయంలో చిఱునవ్వు వర్ణన ఏమిటి? నేను వర్ణిస్తాను, వినండి.

సీ. ధవు నఖాగ్రముల నిత్యము నిల్చి, యీలేమ
వాల్చూపులధికధావళ్యమూనెఁ;
ఇనుకాంతిలోపల మునిఁగి యీసతి మోము-
నిండు చందురుఁడు వెన్నెలలు కురిసెఁ;
పతిమీఁది యనురాగభావలన్ పల్కి, యీ
యెలనాగ కెమ్మోవి యెఱ్ఱఁబాఱెఁ;
ఈశు సామేనుసందిముడంగి, ఈమెయం-
గంబులు సంకుచితంబులయ్యెఁ;
సాజమైన పాతివ్రత్య తేజమున వి-
రాజిలుచు, స్వచ్ఛమైనట్టి రామణీయ-
కమున, అందకత్తెల నందకత్తె యయ్యు,
పురుషులను మోహపెట్టదీ పరమసాధ్వి. 123

దంశ—మహారాజా, ఇంత సేపు చూచినా దేవిగారిను ఈ చూచున్నా ఎవరూ కొనడానికి రాకుండా వున్నారు. కారణం ఒకటని నాకు తోస్తూ వుంది. పతివ్రతాశిరోమణి అయిన ఈవిడ మీసేవ చేయడం ఒక వింత కాదు. ఆ మాత్రం చేత ఈవిడ ఇతరులకు సేవ చేస్తుందని ఏం నమ్మకం? ఆ నమ్మకం చెప్పే వరకూ పౌరులెవ్వరూ బేరానికి మొగ్గరనుకుంటాను.

గణ—ఓయీ పాపపిశాచీ, ఇల్లు చొరఁబడి వాసాలు లెక్కపెడ్తూ ఉన్నావే. రాజ్యం పోయిన రాజుకు మంత్రాంగానికి నువ్వొక్కడ కుదిరావు?

హరి—గణపతీ, ఆయనపై ఏల కోపగించుకొందువు? ఆయన చెప్పుచున్న సంగ

తి నామీలు కొంటే కదా? ఓ శ్రోత్రియుఁడా, ఈ సారి నీకిష్టమగునట్టే అమ్మె
దను, వినుము:

సీ. ఇతరుల మదుల యింగితము లెఱింగి, వా-
రలకు కల్గిన కోరికలను తీర్చు;
ఒరులకు సాహాయ్యమొసఁగ, ఎంతటి యసా-
ధ్యంపు కార్యంబులనైన పూను;
పరుల యాపదలను ప్రాణములిచ్చి యే-
నియును కాపఁగ ప్రయత్నించుచుండు;
అన్యులకు ప్రియంబులైనచో తనకప్రి-
యంబులైనవియు కాదనక చేయు:
మగఁడనైన నాకే దాసి యగుట కాక,
దయ గలిగి యెల్ల వారికిన్ దాసి వలెనె
యుపచరించెడు నట్టి యీ యువిద నిచట,
అమ్మెదను రండి, అయ్యలారా, కొనుండి. 124

10వ పౌరుఁడు—(సమీపించి) అయ్యా, ఈవిడ వెల ఎంత?

నక్ష—ఓయీ, ఏనుఁగు మీద మనుష్యుఁడు నిలువఁబడి చేతితో రత్నమెగమీటినంత పొడుగు బంగారు నాణెములకుప్ప ఈమె వెల?

10వ పౌరుఁడు—అమ్మో! అంత ధనం ఎక్కడినుంచి తెచ్చేది? (నిష్క్రమించును.)

11వ పౌరుఁడు—ఈవిడ నిజంగా బంగారు కుప్పే. ఈవిడను కొనే వాళ్లు ఎంత భాగ్యవంతులు కావలెను! (నిష్క్రమించును.)

[ఇద్దఱు క్రొత్త పౌరులు ప్రవేశింతురు.]

(క్రొత్తగావచ్చిన) 12వ పౌరుఁడు—కుమారవర్మగారూ, ఇక్కడ ఈ ఆఁడమనిషిని అమ్ముతున్నట్టున్నారు. చాలా అందంగా వుంది. మీ అంతఃపురంలో ఉంచ తగింది. ఎంత సొమ్మయినా సరే ఇచ్చి కొనిపించండి.

(కొత్తగా వచ్చిన) 13వ పౌరుడు—నాకూ కొనాలనే ఉంది గాని, ఈమె సంసారేమో?

12వ పౌరుఁడు—సంసారైతే ఎందుకు అమ్ముతారు? అయినా అడుగుతాను ఉండండి. (హరిశ్చంద్రుని సమీపించి) అయ్యా, ఈ మనిషి నీకు ఇల్లాలా? వెలయాలా?

గణ—ఏమయ్యా, రాచతికపు గోటు తిన్నగా చూడనియ్యకుండా ఉందా ఏం? ఈమె ఈయన భార్య.

12వ పౌరుఁడు—కోపపడకయ్యా బాపనఁడా, నేను అనుమానించడానికి కారణం ఉంది. కటిక పేదతనం చేత ఈవిడ పుస్తెలు కూడా అమ్ముకోవలసి వచ్చింది కాఁబోలు? శతమానం కనఁబడక పోవడం చేత ఈవిడ వెలయాలేమో అనుకొన్నాను.

గణ—ఇదా మీ అనుమానానికి కారణం? అలాగైతే వినండి. ఈమె మహాపతివ్రత కనుక ఈవిడ మంగళసూత్రం భర్తకు తప్ప ఇతరపురుషులకు కనఁబడదు.

12వ పౌరుఁడు—అయితే ఈవిడను కొనుక్కొన్న వాళ్లకు గట్టిచిక్కే. ఇంటి దగ్గరికి తీసుకు వెళ్లిన తరువాత, ఎవర్తెనో భోగం దానిని తెచ్చుకొన్నట్లు భార్య అనుమానిస్తేనో!

గణ—అయ్యా, ఆలోచించకుండా మాట్లాడడం అధికారలక్షణం కాఁబోలు! పరపురుషులకు కనఁబడదన్నాను కాని, పరస్త్రీలకు కనఁబడక పోదే. పురుషభార్యలున్న ఆఁడుభర్తలు ఈమెను కొనడం వల్ల చిక్కే.

12వ పౌరుఁడు—అయ్యా, కుమారవర్మగారూ, ఇతఁడు మర్యాదా ఎఱుఁగకుండా మాటలాడుతున్నాఁడు. చేయి చేసుకొందామంటే బ్రాహ్మఁడై పోయాఁడు; నా పౌరుషానికి లోపం. పోదాం రండి.

[క్రొత్త పౌరులిద్దఱును నిష్క్రమింతురు.]

దంత—మహారాజా, అదిగో కొత్తగా ఎవ్వఁడో ఒక ముసలి బ్రాహ్మఁడు వస్తూవున్నాఁడు. మళ్లీ అమ్మండి. అతఁడు పుచ్చుకొంటాఁడేమో.

గణ—ఆ దరిద్రుఁడు పుచ్చుకోవలసింది సంభావన తప్ప మరేమీ లేదు. "అమ్మండి, అమ్మండి'' అంటూ ఈయనను ఈలాగు బాధిస్తూ ఉన్న నీవు విశ్వామిత్రశిష్యుఁడవు కాబోలు!

చంద్ర—(తనలో) అయ్యో! అయ్యో! పోల్చుకొన్నాఁడు.

హరి—గణపతీ, ఆ బ్రాహ్మణుని ఏల నిందించెదవు? కొనిన వారున్నను లేకున్నను ఈదినమెల్లను అమ్ముట నాకు విధి. కావున ఇదిగో మఱల అమ్ముచున్నాను.

''సీ. ఇతరుల మదుల ఇంగిత మెఱింగి''—(మొదలగు పద్యము చదువును.)

[కాలకౌశిక వేషముతో విశ్వామిత్రుఁడు ప్రవేశించును.]

విశ్వా—(తనలో) బ్రహ్మయు భేదింప లేని ఈ వేషమున నన్ను విశ్వామిత్రుఁడని ఎవ్వరును పోల్తి పట్టలేరు. వీరిని సమీపించెదను. (సమీపించి) అయ్యా, మీరిక్కడ ఏమి అమ్మఁ బోవుచున్నారు?

గణ—ఓయీ పేద బాపఁడా, ఇక్కడ అమ్మఁబోతూ ఉన్నవి కాయగూరలు కావు. నువ్వు కొన లేవు. ఏనుఁగు మీఁద మనుష్యుఁడు నిలువఁ బడి చేతిలో రత్నాన్ని ఎగమీటినంత పొడుగు బంగారు నాణేల కుప్ప నీ దగ్గఱ ఎక్కడిది?

విశ్వా—అయ్యా, అలాగు కాదు. అంత వెలయే అయినను కొనఁదగిన వస్తువే ఐనయెడల, తప్పక కొనెదను. అంత వెల గల సరుకేదో చెప్పుఁడు—భూమియా?

హరి—స్వామీ, భూమి కాదు—నా మోహభూమి, ఈ కామినినే ఇంత వెలకమ్మఁ బోవుచున్నాను.

గణ—ఏమిటీ? అంత ధనం ఇచ్చి అయినా కొంటావా? అయితే, ఈ ఊరిలో పేరు మోసిన వాఁడవే కాఁబోలు! నీ పేరేమి?

విశ్వా—నన్ను కాలకౌశికుఁడందురు.

గణ—కాలకౌశికుఁడవా? ఈవిడను కొనడానికి ఎవ్వరూ దొరకరని నేను సంతోషిస్తూ ఉంటే, ఈ కాలానికి వచ్చిన కౌశికుఁడవా నువ్వు?

విశ్వా—(తనలో) వీఁడు దాదాపుగా సత్యమును పోల్చుకొన్నాఁడు. ఆహా! హరిశ్చంద్రుని ఎదుట అసత్యము దాఁగదా ఏమి? ఇది మఱపించినఁ గాని, వీఁడు నన్ను గుర్తించునేమో! (ప్రకాశముగా) అయ్యా, అమ్ముకొనఁ బోవుచున్న వస్తువు అమ్ముడు పోదేమో అని మీరెందుకు సంతోషించుచున్నారు? కౌశికుఁడనుచున్నా రెందు చేత?

నక్ష—ఓయీ కాలకౌశికా, ఈయన హరిశ్చంద్రచక్రవర్తి. కౌశికుఁడన్న మాఱుపేరు గల విశ్వామిత్రమహామునికి ఇతడు ఇప్పుడు మా గణపతి చెప్పినంత

ధనము నేటికిచ్చెదనని మాట ఇచ్చి ఉన్నాఁడు. ఆ ధనము కొఱకు ఇప్పుడీయన తన భార్యను, ఈ చంద్రమతిని, అమ్మఁ బోవుచున్నాఁడు.

గణ—ఎవరూ కొనుకోక పోతే; అమ్మనక్కర లేదు గదా అని నేను చూస్తూ ఉన్నాను.

హరి—గణపతీ, అట్లయినయెడల విశ్వేశ్వరసన్నిధానమున నా తల బ్రద్దలుకొట్టు కొమ్మనియే నీ యభిప్రాయమా?

గణ—ఆహాహా! ఆ ఘోషే మఱచి పోయినాను.

విశ్వా—అయ్యా హరిశ్చంద్రా, ఒక్క మాట కొఱకు నిష్కారణముగా భార్యను ఏల అమ్ముదు పోయెదవు? భార్య అన్నను భార్యయా? కేవలమును ఆర్యా మహాదేవివలెనే ఉన్నదే. భార్యను అమ్ముకొనుట ఎంత ఘోరపాతకము? నా మాటవిని విశ్వామిత్రునికి ధనమియ్యనక్కర లేదను.

హరి—అయ్యా కాలకౌశికా, ఇష్టమున్నయెడల కొనుకొమ్ము; కష్టమైనయెడల మానుకొమ్ము. అంతేకాని అసత్యమాడుమని బోధ చేయకుము.

గణ—కాలకౌశికా, ఆ లాంటి మాటలెల్లా ఈయన ఎదుట చెవిటి ముందర శంఖూదినట్లే. ఈమందఱమూ చెవినిల్లుగట్టుకొని చెప్పి చెప్పి విసిగినాం.

విశ్వా—పోనీ, నాకేమి? భార్యను చేతులార అమ్ముకొనుట ఏల అని అట్లంటిని? మాననని భీష్మించిన యెడల ఎవరికి నష్టము? హరిశ్చంద్రా, మఱొక్క మాటు ఆలోచింపుము. "విప్రవాక్యం జనార్దన" యని ఉన్నది కదా? నా మాట విను.

హరి—అయ్యా, ఏల వృథాగా నన్నాయాస పెట్టెదరు?

విశ్వా—మఱొక్క మాఱు చెప్పుచున్నాను. హరిశ్చంద్రా, ఋణము తీర్చివేసినాననని అను.

హరి—అయ్యా, ముమ్మాటికిని చెప్పుచున్నాను. నేనసత్యమాడ లేను.

విశ్వా—అట్లయినయెడల, ఆ ధనమునకు భార్యనొక్కతెనే అమ్మెదవా? లేక, కొడుకును కూడ అమ్మెదవా?

హరి—(విచారములో) హా! కుమారా, రోహితాశ్వా; నేనెంతటి దురదృష్టవంతుఁడనురా?

చ. కొడుకులు చూచి వేడ్కపడి కోరెడు వస్తువులెట్టివైన, అ-
వ్వుడె కొనితెచ్చి యిచ్చుచును ముచ్చట తీర్చెద; రంతె కాని నా

వడువున, ఏకపుత్రకుని—వంశవిభూషణు—సుందరాంగు—అం-
గడినిడి సొమ్ముకమ్ముకొనఁగా తలపోసెడి తండ్రిలుందురే? 125

విశ్వా—ఈ పిల్లవానికి వేయి వెల అవసరము లేనియెడల వీరిద్దఱిని నేను కొనుకొందును. ఈమె ఇంటి పనులన్నియు సరిగా చేయఁగలదా? నా ఇంటియాబిడను గుణమును బట్టి కలహకంటకి అందురు. పనులలో ఏమి పొరపాటు వచ్చినను ఆమె బ్రదుకనీయదు.

చంద్ర—ఓ అయ్యా, పతివ్రతలు చేయదగు పాపము కాని పనులన్నియును నేను చేయుదును.

విశ్వా—అట్లయిన సరే. ఎవ్వరైనను నా వెంట వచ్చినయెడల సొమ్మునిచ్చెదను.

నక్ష—మేమందఱమును నీవెంట వచ్చెదము, నడువుము.

విశ్వా—అబ్బో! అట్లు వీలు లేదు. ఇందఱను చూచినయెడల నా ఇల్లాలు చీపురుకట్టయో పేడనీళ్లో ప్రయోగించక మానదు. ఎవరో ఒక్కరే రండి. హరిశ్చంద్రా, ఎవరిని పంపెదవు?

హరి—అహా! పరమేశ్వరా, నాకేల ఇట్టి విచారము తెచ్చిపెట్టినావు? తెచ్చిపెట్టిన వాఁడవు, నా ప్రాణములేల నిలువఁబెట్టినావు? శిబి తన దేహములో సగము కోసి ఇచ్చెనందురు. అంతకంటె నా బాధ ఏమి తక్కువ?

మ. ధవుదేహంబున అర్ధదేహమె కదా తన్వంగి? అర్ధాంగియా
ఉవిదం బాసెడి చింత యెంతటి ఘనంబో అర్ధనారీశ్వరుం-
డవు నీవైన నెఱుంగవే? ఎఱిఁగియున్ నా మొఱ్ఱ యిప్డేటికిన్
చెవినిన్ చేర్పక యూరకుండెదవు? కాశీవాసవిశ్వేశ్వరా. 126

నక్ష—ఓయీ కాలకౌశికా, ఇదిగో ఈ గణపతి నీ వెంట వచ్చును. (చంద్రమతివైపు తిరిగి) అమ్మా, చంద్రమతీ,—(మాట రాక ఊరకుండును.)

లోహి—నాన్నగారూ, అమ్మ ఏడ్చుచున్నదేమి? (హరిశ్చంద్రునివైపు తిరిగి) అయ్యో, నాన్నగారును ఏడ్చుచున్నారు. (చంద్రమతివైపు తిరిగి ఏడుపుమొఁగముతో) అమ్మా, మీరెందుకే ఏడ్చుచున్నారు?......అయ్యో! పలుకరేమి?

చంద్ర—అహా! తల్లీ, అన్నపూర్ణాదేవీ, నీ పూజలో ఏమి లోపములు చేసితిమని

మామీఁద ఇట్టి పినుక పూనితివి? అయ్యో! నీకు కనికరము రాకున్న యెడల, పేర్లెట్లు నిలువఁ గలవు?

మ. నిముసంబైనను నీ మనోహరుని మేనిం బాసి యుండంగలే-
కుమవై చిక్కి. సగంబవై చివరకెట్లో యీశు సామేననం-
దిమ్ముక్కం గల్గినదాన, వీవెఱుఁగ లేవే నాదు శోకంబు? న్యా-
యమె మాకీ యెడఁబాపు చేయుట? అపర్ణా, అన్నపూర్ణాసతీ. 127

రోహి—(చంద్రమతిపై పడుచు) అమ్మా, అమ్మా, ఎందుకు ఈలాగు ఏడ్చుచున్నావు? చెప్పవే. (ఏడ్చును.)

చంద్ర—(బుజ్జగించుచు) నాయనా, ఊరకుండుము. మనము నాన్నగారి దగ్గఱ సెలవు పుచ్చుకో వలెను. ఆయనను కొంతకాలము మనము విడిచి ఉండవలెను.

రోహి—(కన్నులు తుడుచుకొనుచు) అమ్మా, ఎంత కాలమే?

చంద్ర—నాయనా, నీకీ సంగతులు తిన్నగా బోధపడవు. ఊరకుండుము. (హరిశ్చంద్రుని చేతి దగ్గఱికతో) ఆర్యపుత్రా,—(మాట రాక నిలుచుండును.)

హరి—దేవీ,———(కన్నీళ్లతో నిలుచును.)

గణ—(ఏడ్చుచు) నక్షత్రకా, నక్షత్రకా, వీళ్ల దుఃఖం నేను చూడలేకున్నాను. ఏడుపుచేత ఇద్దఱూ నోట మాట రాక కళ్లలోనుండ నీళ్లు వఱదలుగా పాఱుతూ ఉండగా, ఒకరి మొగం ఒకరు తనివి తీఱక చూచుచు, ఏలాగు నిలువబడ్డారో! పాపం ఈ ఘోష ఏమీ బోధ పడక పిల్లవాఁడు ఒకరి మొగం నుంచి ఒకరి మొగానికి మిడుతుమిడుతుమని చూస్తూ ఉన్నాఁడు.

నక్ష—(కన్నులు తుడుచుకొనుచు తనలో) కడుపు కరఁగి పోవుచున్నది. మా గురువుగారే ఇక్కడ ఉండి వీరి అవస్థ చూచుట తటస్థించినయెడల, ఆయనకు కూడ గుండె కరఁగి వీరికేదో దారి చూపించి ఉండును.

విశ్వా—(తనలో) వీరి దుఃఖము చూడ లేకున్నాను. ఇట్లు కొంతసేపు ఇంకను ఉన్నయెడల, నా పంతము కూడ విడిచిపెట్టుకో వలసినంత మెత్త పడుదును. (ప్రకాశముగా) అమ్మీ, ఇఁక సెలవు పుచ్చుకో.

హరి—దేవీ, నీకు ధైర్యమునకు త్రోవ చూప వలసిన వాఁడనని నీవిందాఁక పలుకుటచేత ఎట్లో దుఃఖము ఇంతసేపును దిగమ్రింగి ఊరకున్నాను. నీ

శోకము చూడఁగా నాకుఁ దుఃఖము పొంగి పొరలి వచ్చుచున్నది. (కళేబరము మీఁద బడి యేడ్చుచు) అయ్యో! అయ్యో! నిన్ను విడిచి నేనెట్లుందును?

చంద్ర—(ఏడ్చుచు) ఆర్యపుత్రా, మగవారయ్యును ఇట్టుల ఏడ్చెదరు? (కన్నులు తుడుచుకొనుచు) ఇదిగో, నేను దుఃఖమును మానినాను; నా పైని చూడుఁడు. అబ్బా! చూడరేమి? మీ దుఃఖమును చూచి పిల్లవాఁడు బెంగటిల్లుచున్నాఁడు.

రోహి—(ఏడ్చుచు) నాన్నగారూ, నాన్నగారూ, ఏడువకుఁడు; ఊరకుండుఁడు.

హరి—(రోహితాశ్వుని ఎత్తుకొని ముద్దులతో నలిపి వేయుచు) హా! కుమారా, నిన్ను నేను వదలియుండవలెనా? అయ్యో! ఎట్లుండఁగలను?

ఉ. చందురుఁ బోలు మోము; సుధచందము మాటలసొంపు; వెన్నెలన్
చిందును నవ్వు: ఇట్లగుటచేతను సీవమృతంపు బుగ్గవో-
సందన, నిన్ను దాఁకుటను నాకిటు ప్రాణము లేచి వచ్చు; ఎ-
ట్లుండుదును మేనితోడ అయయో! నిను కౌఁగిట చేర్పకుండఁగా? 128

చంద్ర—నాయనా, రోహితాశ్వా, మీ తండ్రిగారికి నమస్కరింపుము.

రోహి—(దిగి) నాన్నగారూ, నమస్కారము. (కాళ్లమీఁద పడును.)

హరి—(కన్నీళ్లతో) హా! నాయనా, నీ ముద్దుముచ్చటలు కన్నులార చూచు భాగ్యము నాకు తప్పిపోయినది. నీవు వేడుకపడి కోరెడి కోరికలు తీర్చు తనివి నాకు లేక పోయినది. నీ కష్టములను తీర్చి న్యాయమునా సహాయము చేయు అవకాశము ఇక నాకు పోయినది. నిన్ను దీవించి ఆ పరమేశ్వరునికి ఒప్పగించుట తప్ప, దురదృష్టవంతుఁడను నేనేమి చేయఁగలను?...ఓ ఆపద్బాంధవా, అనాథనాథా, ఆశ్రితరక్షకా,

శా. లోకంబందలి నీ కుటుంబమునకెల్లన్ తల్లివిన్ తండ్రివీ-
వే కావే? ఇది తెల్పఁగా తలఁచియే, ఏకాంగమందీవు స్త్రీ
యాకారంబును పౌరుషాకృతియు ఆహా! తాల్చి; తీబాలకున్
చేకొమ్మా కృపతో కుమారునిగ కాశీవాసవిశ్వేశ్వరా. 129

చంద్ర—(డగ్గుత్తికతో) ఆర్యపుత్రా, నమస్కారము. (కాళ్లపై బడి) సెలవిండు—పోయి వచ్చెదను.

హరి—దేవీ, సత్యము కొఱకు నిన్నిప్పుడు విడుచుకొనుచున్నాను. ఆ సత్యమహిమ వలననే నీకును నాకును త్వరలో తిరిగి కలయిక కలుగును గాక!

సత్య
గణ } —తథాస్తు! తథాస్తు! రాజా, సత్యవంతుఁడవు, నీమాట ఏల తప్పి పోవును?

హరి—దేవీ, నమస్కరించి సెలవు కోరిన నిన్ను నేనేమని దీవింతును? నిన్నును కుమారుని సకలదేవతలును సదా జాగరూకతతో కాపాడుచుందురు గాక! ఓ ఈశ్వరా,

మ. సతి నిన్ బాసియుట్టిపిమ్మట, అదృష్టంబుంటచే చల్ల నా
పిత చాఁటునను పొందె; అయ్యదియు కన్పింపంగ లేదిచ్చటన్:
గతి లేకన్యుల దాసియాచు కొలువంగాఁ బోయెదున్; నీవె యీ
స్థితిలోనన్ గతివీ మొకీపయిని కాశీవాసవిశ్వేశ్వరా. 130

ఆహా! పరమేశ్వరా, ఎంత అణఁచుకొందునన్నను అఁగక దుఃఖము పైకుబికి వచ్చుచున్నది. ఎట్లు నిలుపుకొనుటో తెలియకున్నది... దేవీ, దేవీ, పోయెదవా? ఎట్లు నేను ప్రాణములు నిలుపుకొందును? ఎట్లు దేహము ధరించి ఉందును? ఓ ఈశ్వరా, నాకేల చావునైనను కలిగింపకున్నావు?

మ. సతినిన్ నీవెడఁబాసి యున్నతఱి, ఆసంతాపమాఱంగ నీ-
దుతలన్ గంగను నీవు నిల్పుకొనలేదో? ఇప్పుడందుండి, నా
వెత తీఱంగను గంగ నాశిరముపై వేగంబుగా కూల్పు: మీ
క్షితిలో నిల్వక గంగ పాలగుదు కాశీవాసవిశ్వేశ్వరా. 131

(దెబ్బున పడి మూర్ఛిల్లును.)

చంద్ర—(తొందరతో మోకరించి) ఆహా! ఆహా! ఆర్యపుత్రుఁడు మూర్ఛిల్లినాఁడు. అయ్యో! ఎంతటి అవస్థ సంభవించినది! ఇంతటి మహారాజునకును మూర్ఛ వచ్చినప్పుడు సేవచేయుటకు ఎవ్వరును లేక పోయిరి! ఓ కౌశికా, సృష్టికి ప్రతిసృష్టి చేయఁ గలిగిన శక్తిశాలివి, నీకు దయ వచ్చినయెడల ఏదో ఒక దారి చూప లేక పోదువా? నీవు తెచ్చిపెట్టిన చిక్కులే కదా ఇవి?

విశ్వా—అమ్మ, కౌశికుఁడిక్కడ ఏఁడీ? కాలకౌశికుఁడను నేను మాత్రము ఉన్నా

ను. దయతోడనే నేనుకే మాట చెప్పుచున్నాను, విను: నీ మగఁడు మఱల లేచు లోపలనే నీవు నావెంట రమ్ము. లేచినయెడల, మీ ఇద్దఱకును మఱల ఇంతటి విచారమును కలుగును. అది చూచుటకు నాకును శక్యము కాకున్నది.

చంద్ర—అయ్యో! ఆర్యపుత్రా, ఇట్టి అవస్థలోనా మీయొద్ద నేను సెలవు పుచ్చుకొనుట? మీ హృదయమెంత నవనీత కోమలము! ఈ విచారమునకు ఆఁడుదానను నేనైనను కొంత నిలువఁ గలిగినాను గాని మీరు నిలువలేక మూర్ఛిల్లినారు ...కాలకౌశికుఁడు చెప్పిన సంగతి నిజమే. ఇంకను నేను పోక నిలిచినయెడల, ఇక మీఁద మీరు దుఃఖమునకు ఏమాత్రమును ఆఁగఁ జాలరు. కాఁబట్టి ఇట్లు మూర్ఛలో ఉన్నప్పుడే మీయొద్ద సెలవు పుచ్చుకొనుచున్నాను...ఇదిగో, నా కన్నీళ్లతో మీ పాదములను కడుగుచున్నాను......అయ్యో, దైవమా, నా మోక్షసాధనములైన ఈ శ్రీపాదములను నేను మఱల ఎన్నఁడు చూతునో కదా? ఎన్నఁడు మఱల ముద్దులాడుదునో కదా! ఎన్నఁడు మఱల కన్నులకు అద్దుకొందునో కదా? (అట్లు చేసి) ఆర్యపుత్రుని సత్పథమునందు నిత్యమును నడుపుచున్న ఓ శ్రీపాదములారా, నాకు సెలవొసఁగుఁడు. మీ ప్రతిబింబములు నా హృదయమునందు స్థిరముగా ఉన్నవి. బాహ్యతనువుతో మిమ్ము సేవించుటకు వీలులేని కాలమంతయు వానిని నా హృదయమునందు సేవించుచుందును ...ఆహా! నా కన్నీటిధారలచేత ఈ పాదముల ధూళి అంతయు కరఁగి పోయి పద్మరేఖలు స్పష్టముగా కనఁబడుచున్నవి...అయ్యయ్యో! సార్వభౌమపదవికి అర్హమైన సింగపుగద్దెపై ఎక్కినవేనా ఈ పాదపద్మములు? దిగంతరాజుల కిరీటమణిరాజులచేత నీరాజనములు పొందినవేనా ఈ పాదరాజీవములు?—

విశ్వా—అమ్మి, లెమ్ము. వెట్టి ఓడించుచున్నావు. నాకాలస్యమగుచున్నది.

చంద్ర—అయ్యా, ఇదిగో వచ్చుచున్నాను...ఓ పాదములారా, ఇదిగో కడసారి మ్రొక్కు...ఓ దేవతలారా, నా ఆర్యపుత్రుని కృపతో కాపాడుచుండుఁడు... ఓ అన్నపూర్ణాదేవీ,

శా. ఈ క్షోణిన్ భవదీయదాసులను నీవెంతే విశాలంబులౌ
వీక్షాళిన్ పరగించి వేవిధుల వేవే ప్రోవఁగా నీ విశా-
లాక్షీ నామము సత్యమయ్యెనఁట! ప్రేమాంచత్కటాక్షంబులన్
రక్షింపం గదె నాదు నాథుని అపర్ణా, అన్నపూర్ణాసతీ. 132

(ఏడ్చుచు) ఆర్యపుత్రా, సెలవు, సెలవు, సెలవు. మీకు సర్వవిధములను సర్వకాలములను జయము కలుగును గాక!

సీ. ఏది నిల్పుకొనంగ నెంచి మీతండ్రి స-
    ద్గతిఁ బాయుచున్నను తాళినారొ?
ఏది నిల్పుకొనంగ నెల్ల రాజ్యము గడ్డి-
    పోచ రీతిని ధారపోసినారొ?
ఏది నిల్పుకొనంగ మీదు ప్రాణములు కా-
    ర్చిచ్చు పాల్చేయ చర్చించినారొ?
ఏది నిల్పుకొనంగ పైదలిన్ గాదిలి-
    పుత్రునిన్ పరులకమ్ముకొనినారొ?
దేని పితగ, రాజ్యముగను, ప్రాణముగను,
ఆలు బిడ్డలుగాను,—ఇంతేల?—దైవ
సమముగానె నమ్మితిరొ? ఆసత్యమె యిఁక
స్థిరజయంబిచ్చి మిమ్ము రక్షించుఁ గాత! 133

నాయనా, రోహితాశ్వా, రారా, ఇఁక పోవుదము.

రోహి—అమ్మా, నాన్నగారు వరుండి ఇంకను లేవకున్నారేమి?

చంద్ర—(ఏడ్చుచు) తండ్రీ, రారా. నీ తెలిసియు తెలియని మాటలే నా హృదయమును మఱియు చీల్చుచున్నవి. (రోహితాశ్వుని ఎత్తుకొని, కన్నులకు చీరచెంగు అడ్డు పెట్టుకొని నిష్క్రమించును.)

విశ్వా—గణపతీ, త్వరగా రమ్ము. (నిష్క్రమించును.)

గణ—కాలకౌశికా, ఈ కన్నీళ్ల చేత త్వరగా నడువ లేకుండా ఉన్నాను. కొంచెం మెల్లగా నడు. (నిష్క్రమించును.)

నక్ష—(కన్నులు తుడుచుకొనుచు) ఓ బ్రాహ్మణుఁడా, ఇటు వచ్చి ఈ మహారాజును సేదఁదేర్చుటకు నాకు కొంచెము తోడుపడుము......అయ్యో! కదలవేమి? ఇంత కరుణ లేని నీవు రాక్షసునివలె ఉన్నావు.

దంత—అన్నా, నేను రాక్షసుఁడినే. నీ వెనుక విశ్వామిత్రుఁడికి పుట్టిన వాఁడిని.

హరిశ్చంద్రుఁడిని కూడా అమ్మించడానికి వచ్చాను. ఇప్పుడు కాలకౌశికుఁడి లాగు వచ్చిన వాఁడు విశ్వామిత్రుఁడు.

నక్ష—ఏమి, నీవును విశ్వామిత్రసృష్టిలో వాఁడవేనా?...ఇంకను హరిశ్చంద్రుని అమ్మించెదవా? అప్పు తీఱినదే? ఇఁక ఎందుకు?

దంత—ఉండుండు. హరిశ్చంద్రుఁడు లేస్తూ వున్నాఁడు.

హరి—(మూర్ఛనుండి లేచి) హా! దేవీ,—(చూచి) అయ్యో! ఇఁక నాకెక్కడి దేవి? ఎక్కడి కుమారుఁడు? నాకు లోకము చీఁకటి అయి పోయినది. కన్నులుండియు లేనియట్లే అయినవి. లేకున్న యెడలనే ఇంత కంటె నయము. ఉండుట వలన దేవి లేదని బోధపడుచున్నది. ఓ కన్నులారా, దేవిని చూడ లేని మీతో నాకంతగా ప్రయోజనము లేదు. కావున కన్నీటి రూపమున కరఁగి పోవుఁడు. దేవియే నా కంటిపాప; పాప లేని వెనుక కన్నులేల? (ఏడ్చును.)

నక్ష—రాజా, అతివిచారమును పొందకుము. ధీరహరిశ్చంద్రుఁడవని పేరు మోసిన నీవే ఈ లాగున ఏల గోలుగోలున ఏడ్చెదవు? ఆపదలందే కదా ధైర్యము కనఁబడ వలెను?

హరి—నక్షత్రకా, ఆపదలయందు ధైర్యము చూప వలసినదే; కాని ఇది వట్టి ఆపదయా? పెను ప్రళయము గదా? ఇట్టి పెను ప్రళయములలో కొండలే తల్లడిల్లుననఁగా ఇఁక ధైర్యము చిక్కఁబట్టుటకు మనుష్యమాత్రుఁడను నేనెంత?

[గణపతి రోజుకొనుచు ప్రవేశించును.]

నక్ష—ఇదేమోయి గణపతీ, రోజుకొనుచు వచ్చినావు? సొమ్మేదీ?

గణ—మోసం—మోసం—పెద్ద మోసం జరిగింది. విశ్వామిత్రమాయలాగు ఉంది. కన్నీళ్లు అడ్డడం చేత దారి కనఁబడక నేను కొంచెం వెనుక పడ్డాను. ఇంతలో ముందు వెళ్లుతూ ఉన్న కాలకౌశికుఁడు దేవినీ రోహితాశ్వకుమారునీ వడి వడిగా అడుగులు వేయిస్తూ, చిక్కిరి బిక్కిరి సందుగొందులలో నడిపిస్తూ వెళ్లి వెళ్లి, వాళ్లు ముగ్గురూ నా కళ్లకు కనఁబడకుండా మాయమై పోయినారు. నేను చెమటలు కార్చుకొంటూ ఎంత దూరం పరుగెత్తి వెళ్లినా మరి కనఁబడ లేదు. అయ్యో! అయ్యో! ఏమి చేసేది?

హరి—గణపతీ, ఏల సంభ్రమ పడెదవు? కాలకౌశికుఁడే సొమ్ము తెచ్చి ఇచ్చునేమో?

గణ—అయ్యో! మీ సత్యకాలం. అంత సొమ్ము చేతఁ జిక్కిన తరువాత ఇఁక

తెచ్చి ఇచ్చే వెఱ్ఱిబాగులనాగమ్మ ఎక్కడైనా ఉంటాఁడా? అందులోను నల్లబాపని వానిని నమ్మకూడదన్న సామెతే ఉంది. సొమ్ము తిన్నగా మాత్రం రాదు. వెళ్లి రక్షకభటులను తీసుకు వస్తాను.

దంత—రక్షకభటులకు చెప్పి మాత్రం ఏం లాభం? మూడింతలు ఏమీ జరుగదు. నిర్దోషిని ఎవఁడినో లాగుకు వచ్చి వాఁడే వీఁడంటారు. ఒకవేళ దోషి దొరికినా సొమ్ము దొరకడం మట్టుకు వట్టిది. మొత్తం మీఁద ఇదంతా నెలల తరబడి సంగతి.

హరి—నక్షత్రకా, సాయంకాలములోఁగా నేను సొమ్మియవలెను. కాలకౌశికుఁడు వచ్చునో రాఁడో తెలియకున్నది. ఇఁక పొద్దంతో లేదు. గడువు మించకుండ నన్నమ్ముము.

నక్ష—అయ్యో! మహారాజా, మిమ్ము అమ్ముట ఏల? దేవిని అమ్మిన సొమ్ము ఎట్లో తెచ్చి మా గురువుగారికి ఇచ్చెదను. దేవిని అమ్ముట వల్లనే మీ ఋణము తీరినట్లు.

హరి—నక్షత్రకా, మాటలలో పెట్టి ఆలస్యము చేయకు. దేవిని అమ్మినాను గాని నీకు సొమ్మియ లేదు. ఇయ్యనిదియు ఇచ్చినట్లు ఏలాగగును? ఎప్పుడో ఆ సొమ్ము నీవు తెచ్చినయెడల, ఈ సాయంకాలము లోఁగా నేను ఋణము తీర్చినట్లు కాదేని? కాఁబట్టి నన్ను వెంటనే అమ్ముము.

దంత—అయ్యా, నక్షత్రకా, ఈ మహారాజు చెప్పింది సబబుగా ఉంది. అమ్మకం మొదలు పెట్టు. ఇంతలో కాలకౌశికుఁడే వస్తే చిక్కే లేదు. కాక పోతే, ఈయన మాట నిలువఁబెట్టుకోవడానికి ఇదే ఉపాయం.

హరి—నక్షత్రకా, అనుమానింపకు. దేవి దాసి అయినది గనుక, నేను దాసుఁడనగుట నాకు సంతోషమే.

నక్ష—అయ్యో! మహారాజా, నేనెంతటి పాపకార్యము చేయ వలసి వచ్చినది?- ఓ కాశీపురవాసులారా,

సీ. ఇల నాల్గు చెఱఁగులు, ఏకాతపత్రంబు-
గాఁగ నేలిన మహాఘనుఁడితండు;
రాజ్యమెల్లను తృణప్రాయంబుగాఁగను
ధార పోసిన నెఱదాత యితఁడు;
ఎట్టి యాపదలలో నేని చలింపక
ధృతి చిక్కఁబట్టిన ధీరుఁడితఁడు;

అలుబిడ్డల మాటకై అమ్ముకొని తను-
నమ్ముకోఁ దలఁచు సత్యనిధి —యితఁడు;

దంత—అయ్యా, బట్రాజు రాజును పొగడేటట్టు ఇదంతా ఎందుకు? ఈ సుగుణాలిని వర్ణించడం చేత ఎవరు కొంటారు? నేను అమ్ముతాను విను.

తే. గీ. బెదిరి యెదురుగా అరుదెంచు మదగజంబు-
నైన నెదిరించి నిల్చు సత్త్వాఢ్యుఁ డితఁడు;
తగిన వెలకు మీకితనిని దాసుఁగాఁగ
అమ్మెదను రండి, అయ్యలారా, కొనుండి. 134

[వీరబాహుఁడను మాలవాఁడు ఒక కుఱ్ఱవానితో తొందరగా ప్రవేశించును.]

గణ—ఎవఁడవురా నువ్వు? మీఁదికి తోసుక వస్తున్నావు?

వీర—నానాండి? నాను సిమ్మికి ఒయిష్టువుఁడనండి.

గణ—మాలవాఁడ వఁటరా?

వీర—అవునండి, మాలోఁడనేనండి. ఐతే, జాతిలో ఏటుంది బాబూ? నీతిలో ఉంది గాని. "సేంకొలనైతే సోమిగ బెమ్మం?" అన్నాఁడండి.

గణ—ఇప్పుడా చర్చంతా ఎందుకు? కొంచెం ఒసులుకు పో. మనుష్యులను రాసి కొని రాకు.

వీర—అంటుకుందీ బాబూ! ఒక్కఁ నేలమీదే నిలఁబడ్డాపు; దాని కంటు నేదూ? ఒంటికంటూ? ఒహో! బేవనోళ్లు! మా ఎంగిళ్లోసి పిసికి పిసికిన సింతపండు సెడతింటారు; దానికి తప్పు నేదూ? అంటేంటో సెప్పవయ్యా.

గణ—ఓరీ, నీ వేదాంతం కాలి పోనూ. మీఁద పడతావఁటరా? మఱి మాలా హైలా అక్కఱ లేదఁటరా?

వీర—మాలా? నువ్వే కాని మాలోఁడు మనిసి కాఁడు బాబో? మాలోఁడికి కళ్లు నేవూ? కాళ్లు నేవూ? ఒళ్లు నేదూ? మాలోఁడు నీ నాగ తిండి తిండూ? నీలు తాగఁడూ? నిద్దరోఁడూ? నీ నాగ మాలోఁడికి సంతోసం ఉండదూ? ఇసారం ఉండదూ? ఎల్లెల్లప్రెయ్యా. మా తెలిసినోఁడవే.

గం—ఓరీ, నీ పొగరు మండ! ఒసల మంటే ఈలాగు పేలుతావేం?

వీర—నానా ఒసూస్తాను? కావాలిస్తే నువ్వే ఒసులుకో. నానెవణ్ణో నీకు తెలనేదు కాఁబోసు, ఇను.

నాథనామక్రియ—ఆది.

ఈరాది ఈరులకు- ఈరుఁడను నానే,।
ఈరాబాప్పాఁడనఁగ - ఎలయుదునా నే॥ ఈరా॥
నేరాలు చేసేటి- వారాల కత్తితో।
ధీరాముగాఁగాను- తెగ నఱకఁ గలుగూట॥ ఈరా॥
నాటికెల్లు సావు - కాయాను నానోట।
తోటి వారలలోన - దొడ్డాను నానే॥ ఈరా॥
సీల వన్నె గల- సీటు కాఁడ నౌటాను,।
మాల పడుసులకెల్ల - మగఁడాను నానే॥ ఈరా॥
కల్లు నిషా కాఁగఁ- గలవోఁడ నానోట,।
ఎల్లమ్మ తల్లికి - ఇస్టుఁడను నానే-॥ ఈరా॥

గం—పాకీ తొత్తుకొడుకులికి ఏం పొగరుపోతుతనంగా ఉంది! మఱి నూవ్యవహారం సాగనియ్యవఁటరా?

వీర—ఏటి బాబో, మీ ఎవ్వారం? నానూ ఇంటాను సెప్పండి.

నక్ష—ఓరీ వీరబాహూ, నీవేమి కొనఁ గలవా? చెయ్యఁ గలవా?

వీర—ఆదేవన్నమాట? కొంతే నానే కొనాల, సేస్తే నానే సెయ్యాల. నాకు మించా కొనేవోఁడూ సేసే వోఁడూ మరోఁడున్నాఁడా? ఎంతిచ్చైనా చరే కొంటాను, సెప్పవయ్యా.

దంత—ఆలాగైతే వినరా మఱి:

"తే. గీ. చెదిరి ఎదురుగా" (మొదలగు పద్యమును చదువును.)

వీర—గజమా? అంతే గజం బద్దా? అది చెదుర్తాదా? దాన్ని ఇతగోఁడు నిలబెట్టాడా? దానికే నక్షత్ర కావాలా? నాను గజము కాదు, రోజుకి ఎన్నో నిశ్చన్లే నిలబెట్తాను.

వంత—కాదురా; గజమంటే ఏనుఁగు.

వీర—అగాగా? నాకు తెలనేదు. ఏనుఁగనే అనకూడదా? గజమంటే ఏటి నాబం? ఇన్నోళ్లకి అరదం కాని పెద్ద పెద్ద మాటలేస్తే సొగుసా? కానీండి గాని—అన్నట్టు, నీ పేరేటయ్యా?

నక్ష—నా పేరు నక్షత్రకుఁడందురు.

వీర—అబ్బో! నా నోరు తిరగదు. నక్ర—జిత్తుల గోఁడా?...అయితే నక్ర—జిత్తులగోఁడు గోరూ, ఇతగోణ్ణి ఎంతకమ్ముతారేటి? ఏనుఁగనైనా నిలఁబెట్టాఁడంటున్నారే.

నక్ష—ఏనుఁగు మీఁద మనుష్యుఁడు నిలువఁబడి చేతితో రత్నమెగమీటినంత పొడుగు బంగారు నాణెముల కుప్పకు ఈయనను అమ్మెదము.

గణ—ఓరీ వీరబాహూ, విన్నావా? ఇఁక నీ దారి పట్టు.

వీర—అంతే, నేనంత సొమ్ము ఇయ్యనేననేనా? ఐతే నువ్వన్నందుకైనా కొన్నానయ్యా. ఇదిగో నా ముద్దర కర్ర. ఇది రాజుగోరి కజానా కాడ సూపెడితే ఈ పిల్లోఁడు సెప్పినంత సొమ్ము ఇస్తారు. (కఱ్ఱను నక్షత్రకునికి ఇచ్చును.)

గణ—ఛీ, ఛీ. మహారాజును మాలవాఁడికి అమ్ముతామా? నీ బేరం మాకు వద్దు.

హరి—గణపతీ, అట్లు కాదు. అదిగో పొద్దు గ్రుంకుచున్నది. ఇఁక బేరము వచ్చునట్లు కనఁబడదు. అదియును గాక, మా తండ్రిగారు నన్ను మాలవాఁడవు కమ్మని శపించిన సంగతి నీవు ఎఱుఁగుదువు గదా? అది అవశ్యమును కాక తీరదు...ఓ వీరబాహూ, నీ బేరమునకు ఒప్పుకొన్నాను. నేనిఁక నీ దాసుఁడను. నక్షత్రకా, సొమ్ము పుచ్చుకొని వెళ్లి విశ్వామిత్రునికి ఒప్పగించి, గడువిచ్చి గడిపినందుకు ఆయనకు నా నమస్కారములు చెప్పుము. అయ్యా, వీరబాహూ, బేరము పూర్తి అయినది గనుక, ఇఁక నడువుము...గణపతీ, నమస్కారము, నాకిఁక సెలవిమ్ము.

గణ—మిత్రమా, ఆఁగు ఆఁగు. అదిగో, కాలకౌశికుఁడు వస్తూ ఉన్నాఁడు. పాపం, ఇతఁడి మీఁద నిష్కారణంగా అపనమ్మకం పడ్డాను.

[కాలకౌశిక వేషముతో మరల విశ్వామిత్రుఁడు ప్రవేశించును.]

విశ్వా—ఓయీ గణపతీ, నీ కోసము ఊరెల్లను వెదకినాను. ఎవ్వరైనను వచ్చి ఇఁక సొమ్ము పట్టించుకొని వెళ్లుఁడు.

గణ—నక్షత్రకా, వెళ్లు. ఓరీ వీరబాహూ, ఇప్పుడైనా నీదారి నువ్వు పట్టు.

హరి—గణపతీ, అట్లు కాదు. నేనెలాగునను అతని దాసుఁడనైనాను. బేరము ముగిసినది. ఆ సొమ్ము విశ్వామిత్రునికి చెల్లించుమన్నాను.

గణ—అయ్యో! ఇది ఎక్కడి న్యాయం? కాలకౌశికుఁడు సొమ్ము తేఁడేమో అని కదా ఈ బేరం జరిగింది?

హరి—నిశ్చయమే; కాని, ఏ కారణము చేతనైనను బేరము జరిగి పోయినది?

గణ—జరిగి పోయినా నష్టం ఏం? కాలకౌశికుఁడు ఇచ్చే సొమ్ము విశ్వామిత్రుఁడికి పంపితే, వీరబాహుఁడు ఇచ్చేది మిగిలి పోతుంది; వీరబాహుఁడు ఇచ్చేదే పంపితే, కాలకౌశికుఁడు ఇచ్చేది మిగులుతుంది. ముని ఋణం పోఁగా మిగిలిన సొమ్ముతో తిరిగి నిన్ను విడిపిస్తాను.

హరి—గణపతీ, అట్లు కాదు. ముని ఋణం పోఁగా మిగిలిన సొమ్ము, ఇదిగో నన్ను యాచింప వచ్చిన ఈ బ్రాహ్మణునిది. అలాగు మాట ఇచ్చినాను.

దంశ—బాబ్బాబ్బాబు, అంత సొమ్ము నేనడగ లేను. నాకవసరం లేదు. అల్పసంతుష్టిని.

విశ్వా—హరిశ్చంద్రా, ఈ బ్రాహ్మణునికి నాకు తోఁచినదేమో ఇచ్చి సంతోష పెట్టెదను. నీవు మాలవాని దాసుఁడవు కానక్కర లేదు. నేనిచ్చు సొమ్ముతో ఋణము తీర్చుకొమ్ము. ఓ వీరబాహూ, నీవు పొమ్ము.

హరి—కాలకౌశికా, నీకు నాయందుఁ గల కనికరమునకు నమస్కారము. కాని నీవు చెప్పినది సరి కాదు. నన్ను అమ్ముకొన్న దానిలో ముని ఋణము తీరఁగా మిగిలినది, ఎంత ఉన్నా అంతయు, ఈ బ్రాహ్మణునికి ఇచ్చెదనంటిని. కాఁబట్టి మీరు నాకు ఇయ్యవలసిన సొమ్ము ఇతనికి ఇప్పించుఁడు. నాకు ఇఁక సెలవు దయచేయుఁడు... నక్షత్రకా, నమస్కారము. అడవులలో మావెంట నీవు కూడ మా మూలమున అష్టకష్టములను పడినావు. నేను తెలియక నీయెడల ఏవైనను దోషములను చేసియున్నయెడల, వానినన్నిఁటిని సంపూర్ణమైన దయతో క్షమించి నాకు సెలవిమ్ము.

నక్ష—(ఏడ్చుచు) రాజా, నిన్ను నేను క్షమించవలెనా? నీకు మా గురువుగారు పెట్టిన బాధలకు నేను తోడై ఘోర పాపమును ఒడిగట్టుకొన్నాను. నన్ను నీవు క్షమించుము. క్షత్రియుఁడవే అయినను, ఏ బ్రాహ్మణునికిని లేని ఉత్కృష్టగుణములు గల నీకు ఇదిగో నమస్కరించుచున్నాను. (అట్లు చేయును.)

హరి—ఆహా! మునికుమారా, నాకపచారము కట్టి పెట్టకుము. లెమ్ము లెమ్ము. విచా

రము మానుము. మీ గురువుగారు నాకు పెట్టిన బాధ లేమి?...అయ్యా, గణప తీ, సెలవా?

గణ—అయ్యో! మిత్రమా, నీ కెంతటి దుర్గతి పట్టింది! రాజ్యమా మాలెతల పాలు చేసినావు; నువ్వా మాలవాఁడి పాలైనావు. నీ రాచతీరం మాలతీరంగా మా రింది. అయ్యో! అయ్యో! నీ అవస్థ చూస్తే నాకు దుఃఖం ముంచుకు వస్తూ ఉం ది. (ఏడ్చును.)

హరి—గణపతీ, ఏడువకు. అయ్యా, అందఱకొద్దను సెలవు. వీరబాహూ, రమ్ము పోవుదము.

[హరిశ్చంద్ర వీరబాహులు నిష్క్రమింతురు.]

గణ—అయ్యో! అయ్యో! మిత్రమా, నన్ను విడిచి పెట్టి వెళ్లి పోతావా? ఇదిగో నేనూ వస్తున్నాను. దినానికి ఒక్క మాఱైనా నీ మొగాన్ని చూస్తూ ఉంటా ను. (నిష్క్రమించును.)

విశ్వా—(నిజరూపమును ధరించి) ఆహా! ఏమి ఈ రాజు స్థైర్యము! ఇన్ని విచార ములను పొందుచు, తన నియమమును మాత్రము విడువకున్నాఁడు. ఇఁక నా ప్రతిజ్ఞ తీరుట కలలోని వార్తయే.

నక్ష—గురువర్యా, గురువర్యా, నీవు క్రూరుఁడవు, దుష్టుఁడవు, పాపాత్ముఁడవు. పశువుల గొంతుల పరపర కోయు కటికవాఁడైనను నీకన్న నయము. ఒక్క మాఱే చంపును గాని ఇన్ని కష్టములు పెట్టఁడు. గొంతు కోఱికి క్రొన్నెత్తురు క్రోలు క్రొల్పులికైనను నీకంటె దాక్షిణ్యము ఉండును. పాపాత్ములను నరక గుండములో త్రోసి బాధించు యమదూతలయినను నీతో సరి పోల్చి చూచిన యెడల పరమకరుణాస్వభావులు. క్రొవ్వి పోతరించిన మునివృషభులు ఇద్దరు కుమ్ములాడి, నడుమ లేఁచెయ్య వలెనున్న ఈ హరిశ్చంద్రునినా నలఁగఁ గొట్టు ట? ఏమి తపసులు? ఏమి తపము! ఛీ, ఛీ, ఈ నెలదినములును హరిశ్చంద్రుని ఆపదలను కన్నులార కంటిని; ఆయన మొఱ్ఱలు చెవులార వింటిని. అవి ఇం కను కన్నులకు పొడఁగట్టుచునే ఉన్నవి; చెవులకు వినిపించుచునే ఉన్నవి. అవి తలఁచుకొన్న కొలఁదిని నాకు ఒడలు కంపమెత్తుచున్నది. నేను ఇప్ప డేమి అనుచున్నానో నాకు తెలియదు. గురుధిక్కారముగా ఇప్పుడు నేనేమన్న ను, అది నా మనస్సునందలి జాలి వల్ల; పరితాపము వల్ల; కోపము వల్ల; ఇం తింత బాధలు నేను చూచునట్లు చేసి, నాకు వెఱ్ఱి పుట్టించుట వల్ల. పాపము, ఆతఁడు ఇంకెన్ని బాధలు పొందవలసి ఉన్నదో? ఛీ, నాకీ జన్మముపై అస

శ్యత జనించుచున్నది...గురువర్యా, నా కోరిక ఎట్టిదైనను తీర్చెద నన్నారు; ...లేక, మాట నిలుపఁ బెట్టుకో వలసిన వాఁడు ఒక్క హరిశ్చంద్రుఁడేనా?

విశ్వా—నక్షత్రకా, ఇట్లు నీవు నా మీఁద అనసూయించుకొన్నావని నాకు కోపము లేదు. నేను చేయుచున్న కార్యములపై నాకే అసహ్యముగా ఉన్నది. హరిశ్చంద్రుని బాధించుచున్నందుకు నేనెంత పరితపించుచున్నానో భగవంతునికే ఎఱుక. నా మనస్సు కేవలము నరకముగానే ఉన్నది. కాని, అరంభించినాను గనుక అంతము చూడ వలెనని ఉన్నది. నా పంత మొకటి నన్ను బాధించుచున్నది. అందులోను, వశిష్ఠుని మీఁది పంతము. నడుమ నడుమ పశ్చాత్తాపము వలన లాభమేమి?.ఏదీ, నీవు కోరుకొనఁ దలఁచిన కోరిక ఏదో చెప్పుము.

నక్ష—స్వామీ, మఱి నాకేతనువు వలదు. మీజడలలో మఱల చేర్చుకొనుఁడు.

విశ్వా—నక్షత్రకా, అట్లే కానిమ్ము.

ఆ. వె. నవ్యభూషగాఁగ నక్షత్రకేశుండు
రుద్రు జడలనున్న రూపుగానె,
అపరరుద్రుఁడనయినట్టి నాజడల న-
క్షత్రకుండు చొచ్చుఁ గాక యిపుడు! 135

[నక్షత్రకుఁడు అదృశ్యమగును.]

దంత—ఆహా ఆశ్చర్యం! మీ జడలకు చుట్టి వున్నట్టి స్ఫటికాక్షమాలలో కొత్త పూస ఒకటి చూస్తూ ఉండఁగానే కలిసి నక్షత్రం లాగు ప్రకాశిస్తూవుంది. స్వామీ, మఱి నా సంగతి ఏం చెప్పుతారు? మీ పళ్లనందులో చేర్చుకొని పరిష్కరిస్తారా?

విశ్వా—ఓరీ దంతఘాతా, ఇంకను నీతో పని ఉన్నది. నీవు కాలకౌశికుని భార్య వేషము వేయ వలసి ఉన్నది. కలహకంటకి నీవంటి రాక్షసిముండ ఐననే తప్ప చంద్రమతి విచారమును చూచి భరించుట సాధ్యము కాదు. రమ్ము; ఇఁక మీఁద చేయ వలసిన పనులను నీకు బోధ పఱిచెదను.

[ఇద్దఱును నిష్క్రమింతురు.]

చతుర్థాంకము సంపూర్ణము.

శ్రీ

# చిత్రహరిశ్చంద్రీయము.

## పంచమాంకము.

[ప్రథమరంగము—కాశీపురము; కాలకౌశికుని ఇల్లు. చంద్రమతి పిండి విసరుచు ప్రవేశించును.]

చంద్ర—

ఉ. ఇన్ని దినంబులై విభుని నే కనులున్నను కాంచ లేమి, నా
కన్నులు పువ్వు వేసినటుగా, మఱి కాయలు కాచినట్లుగా
నున్నవి; ఏడ్చి యేడ్చి మొఱుపొందుట పండినయట్లు నయ్యె: ఇం-
కెన్నఁడు కన్నులార హృదయేశ్వరు క్రమ్మఱ కాంచ గల్గునో? 136

అక్కటా! ప్రాణనాథుఁ డెక్కడనున్నాఁడో? ఎట్టి పనులు చేయ వలసి వచ్చినదో? ఎంతెంత కష్టములు పడ వలసిన గతి పట్టినదో? అంతటి సార్వభౌముఁడు,—నీచపు పనులు ఎట్లు చేయఁ గలుగును? అంతటి పరమసుకుమారి,—కష్టము లెట్లు భరింపఁ గలుగును.

ఉ. ఎక్కువగా సుఖంబులనె యింతకు పూర్వము పొందెఁ గాని, తా-
నొక్కపుడేని కష్టములనొందినయాతఁడు కాఁడు; లోకపున్
చిక్కు లెఱుంగఁ డేమియును; చిత్తము మెత్తన;—అట్టి నావిభుఁ-
డెక్కడ? లోకసాగరమునీదుట యెక్కడ? అక్కటక్కటా! 137

పాటు పనులను చేయ వలసిన గతి పట్టి, వేళ పట్టునకు భోజనము లేక, తల దాఁచుకొనుటకు ఇల్లు లేక, విచారముచేత నిద్ర లేక, సకలబాధలకు లోనై, నా ప్రాణేశ్వరుఁడెంత తూలి పోయెనో? శరీర మెంత కృశించి పోయెనో? మనస్సెంత ఆయాసపడుచున్నదో?...ఓ అన్నపూర్ణాదేవీ! నా మనోనాథుఁడు ఇ

ట్టి మహాకష్టములను పడుచుండఁగా, నీకైనను కనికరము పుట్ట లేదా? ఇట్టి అవస్థలో కూడ నీభక్తులమగు మాయందు నీవు అనుగ్రహము చూపింపకుండుట చేత నీవు దాక్షిణ్యము లేని దానవేమో అని అనుమానము కలుగుచున్నది.

మ. తలపోయంగను తండ్రి రూపు గల సత్కన్యామణుల్ సర్వమం-
గళలై యుండ్రఁట!—సర్వమంగళవనంగా పేరు లోకంబునం
గల నీకున్ పయిపైని చల్లయును, లో కాఠిన్యమున్ తండ్రికి-
న్బలె కద్దా యని శంక తోఁచెను, అపర్ణా, అన్నపూర్ణాపతీ. 138

......ప్రాణనాథునికి కలిగిన ఇట్టి మహాపత్సమయములో శరీరాయాసము పోవునట్లు పరిచర్య చేయుచు, హృదయాయాసము పోవునట్లు ధైర్యవచనములు చెప్పుచు సన్నిధినుండఁ గల భాగ్యము సహధర్మచారిణినైన నాకు లేక పోయినది. ప్రాణేశ్వరుని సామ్రాజ్యకాలమునందు ఆయన మూలమున అన్ని సౌఖ్యములను అనుభవించి, ఆయన వలన మన్ననలను పొంది, ఆయన సాన్నిధ్యసౌఖ్యమును గాంచుటకే నేను భార్యనైతిని గాని, కష్టకాలమున నావలన ఆయనకు రవ్వంతయు లాభము లేక పోయినది. ఇట్టి సమయమునందు ఆయనకు నేను ఏలాగున ఉపచరింప కలుగుదునో?.....................

ఉ. ఈ మెయియందుఁ గాని, మఱి యింతకు ముందరి మేనులందుఁ గా-
సీ, మది వాక్కులన్ క్రియల నేనెపుడెప్పుడు పుణ్యమన్న దే-
మేమి యొనర్చియుంటినొ యవెల్లయు తోడయి నిల్చి యియ్యెడన్
మామకజీవితేశ్వరు శ్రమన్ తొలఁగించును గాత పూర్తిగన్. 139

...అహో! ఆర్యపుత్రా, నన్నుఁ గాని రోహితాశ్వుని గాని ఒకప్పుడైనను చూడక పోయినయెడల ఆరాటము పడుచుండెడి వారలే, ఈ మూఁడు నెలలనుండియు మమ్ము చూడక ఎట్లు వేగించుచున్నారు? మా మొగములు మీకును మీ మొగములు మాకును ఎంత దూరమై పోయినవి?......నా అవస్థ ఇటుండఁగా, తండ్రిని చూచు భాగ్యము లేని రోహితుని అవస్థ—హా! హా! చెప్ప శక్యము కాదు. ప్రొద్దుట ''అమ్మా, నాన్నగారీవేళ వస్తారే?'' అనియు, రాత్రి ''అమ్మా, నాన్న గారీవేళ రాలేదేమే?'' అనియు—ఇవే వాఁడు నిత్యమును అడిగెడు ప్రశ్నలు. తండ్రిని విడిచిననుండియు వాఁడు కలకల మని నవ్వి ఎ

ఱుఁగఁడు; కలివిడిగా తిరిగి ఎఱుఁగఁడు; గట్టిగా మాటలాడి అయినను ఎఱుఁగఁడు. అనుభవించుచున్న కష్టముల మూలమున ఈ మూఁడు నెలలలోన నానికి చిన్నతనము పోయినది....బుద్ధియందు పెద్దతనము వచ్చుటే కాని, శరీరమేమో కృశించి పోయి మునుపటికంటె అర్భకుని వలె కనఁబడుచున్నాఁడు ...వింత ఏమి? వేళ వట్టునకు తిండియా? నిద్రయా? ఇక ఆరోగ్యమెక్కడి నుండి వచ్చును?

తే. గీ. వేళ తప్పిన రోగమున్, వేళ తప్పు-
కున్న నారోగ్యమున్, గల్గుచుండుఁ గాదె?
కాలనియమంబు లేమినే కాదె శశి కృ-
శించు? రవి నీమముంట కృశింపకుండు. 140

......పోనీ, ఆ వేళతప్పిన మెతుకులైనను కడుపు నిండునన్ని ఉన్నవా? ఆహా! ఎంత కష్టము! ఎంత కష్టము! కోట్లకొలఁది కుటుంబములకు సంవత్సరము పొడుగునను తృప్తి తీఱునట్లు అన్నము పెట్టి పోషించిన సార్వభౌముని ముద్దు పట్టికి పూటకు పట్టెఁడు మెతుకులు దొరకుటే కఱవయ్యెనా?...హా! హా! తల్లీ, అన్నపూర్ణాదేవీ,

మ. నగరంబందలి చెట్లమీఁద నొక పర్ణంబైన లేకుండున-
ట్లుగ, ఆకుల్ కొని వచ్చి లక్షలను కోట్లున్ భిక్షుకుల్ పంక్తి తీ-
ర్పఁగ పూర్ణాన్నము పెట్టి పేరులను సంపాదించుకొన్నావు: తీ
ర్పఁగదే నా సుతు కొద్ది యాఁకలి, అపర్ణా, అన్నపూర్ణాసతీ. 141

......అయ్యో! ఈనాఁడు వాఁడు అడవికి మాడుచున్న కడుపుతో పోవలసి వచ్చెను. నేఁడు వినాయక చవితి అగుటచేత, తన ఈడుజోడు పిల్లలెల్లను సంతోషముతో వ్రతము చేసికొని, ముద్దినుసుల పిండివంటలను తిని, ముచ్చటలను భవించుచుండఁగా మా వానికర్మకే ఇటు కాలినదా తల్లీ?

మ. కుడుముల్ జిల్లేడుకాయలుండ్రములు పెక్కుల్ మెక్కుచున్ నీవు పు-
త్రుఁడు సంతృప్తిని పొందునంతకును సంతోషింపఁ జూచెదవు; నా

కొడుకున్ నీ కొడుకే కదా? ఇతఁడిటుల్ క్షుద్బాధ పొందంగ, క-
న్నడ సేయంగను న్యాయమౌనటె? అపర్ణా, అన్నపూర్ణాసతీ. 142

...అయ్యో! ఆకలితో పోయినవాఁడు పొద్దు తిరిగి పోవుచున్నను రాకున్నాఁడు...మొగము తిరిగి పడి పోయెనేమో? అల్లరి పిల్లలు దారిలో జల్లిన పల్లేరు ముళ్లు కాళ్లకు గ్రుచ్చుకొని బాధ చెందుచున్నాఁడో?......అహా! కొడుకా!

ఉ. వేమఱు నెఱ్ఱగుఱ్ఱముల వేడ్కఁగ నెక్కుట రోహితాశ్వుఁడన్
నామము నీకు మున్నొదవె నాయనగారలు ప్రేమనీయఁగా;
ఈ మెయి వట్టి కాల్నడకనే శ్రమపొందుచు, ఎఱ్ఱఁబాఱు నె-
మ్మోమున లోహితాస్యుఁడయి పోతివె అయ్యయొ! నూతనంబుగన్?

[కలహకంటకీవేషముతో దంతఘాతుఁడు ప్రవేశించును.]

దంత—(తనలో) చంద్రమతి విచారం చూచి కాలకౌశిక వేషంలో ఉన్న మా గురువుగారు తమ గుండె కరఁగి పోతూవుందని అంటుంటారు. నాకేమో ఈవిడిని ఎంత బాధ పెట్టినా తనివి తీఱకుండా ఉంది. పతివ్రత అయిన ఈవిడ వొంటి మీఁద మొగవాఁడిని నేను చెయ్యి వేస్తే ప్రమాదం తటస్థిస్తుందని మా గురువుగారు భయపెట్టడం చేత మానివేసాను గాని, లేక పోతే ఈవిడ దవడ మీఁద నాలుగు వాయించి పళ్లు ఊడఁగొట్టాలనే ఉంటుంది. దంతఘాతుఁడిని కావడంచేతనే కాఁబోలు దంతాలు ఊడఁగొట్టాలన్న బుద్ధి! కొట్ట లేదన్న లోపం ఒకటే తప్ప, తక్కిన అన్ని విధాలా ప్రాణాలు కటకట కొఱుకు తింటున్నాను. అక్కడికీ నా రాక్షసస్వభావం ఆఁగక, ఇరుగు పొరుగు ఇళ్లలో చీలికయ్యాలు పెట్టుకొని, నాయిప్పటి కలహకంటకీనామానికి అనుగుణ్యంగా వాళ్ల మీఁద పడి కసి తీరా బాదుతూనే ఉన్నాను...పైకి వెళ్లి చూస్తే దెబ్బలాడ డానికి ఎవ్వరూ దొరికారు కారు. చంద్రమతి మీఁదే కొంచెం అధికారం చెల్లిస్తాను. (సమీపించి ప్రకాశముగా) ఏమే దాసీ, ఏం చేస్తున్నావు? తిరుగలి ముందు చేతులు తల వేసుకొని కూర్చుండి, ఇంటిలో తక్కిన పనులన్నీ ఎగవేస్తున్నావా? అవి నీతాత ఎవఁడు చేస్తాఁడు?...ఇదేం? పిండి మొరుంగా ఉంది? కళ్ల నిండా నీళ్లు పెట్టుకొని కూర్చుంటే నీకు తిన్నగా ఏమిటి కనిపిస్తుంది?...ఆ పైని, ఇదేమిటి? నీ ముందున్న పిండంతా తడిసి ముద్దయి పో

యింది. ఇదిగో, ఇక్కడ కొంత పిండి నీటిధారలో బడి కొట్టుకు పోయింది. ఈనీళ్లు ఇక్కడ ఎందుకు ఒలుక బోసావు?

చంద్ర—అమ్మా, నీళ్లు ఒలుక బోయ లేదు. క్షమింపు; నేను ఏడ్చుటచేత కన్నీళ్లు కారినవి.

దంత—ఏడుపా? ఎందుకేమిటి? మూడు పూటలూ తిట్టేఁదు తన్నేఁదు తిన్నది అఱఁగక ఈ కన్నీళ్లు రూపంగా కక్కుతున్నావా?

చంద్ర—అమ్మా, నా కుమారుఁడు మధ్యాహ్నము తిండి లేక అడవికి పోయినాఁడు. చీఁకటి పడవచ్చుచున్నది. వాని అవస్థ తలఁచుకొని దుఃఖించుచున్నాను.

దంత—వాఁడికేం? పూటపూటకూ కడుపెక్క మెక్కి దుక్కలాగున్నాఁడు. ఒక్కనాఁడు ఒక ముద్ద తక్కువైతే పోయిందేం? నువ్వింట్లో కూర్చుండి కళ్లంట ముత్యాలు కార్చడానికే నిన్ను ఊరంత సొమ్మిచ్చి కొనుకొన్నామను కొన్నావా? అపైని నిక్షేపం లాంటి పిండి పాడు చేసావు. సంసారివి కావా? కాపురం చేసి ఎఱుఁగవా? నీ సంసారం అయినా ఈ లాగే పాడు చేసికొంటావా?...ఇదిగో, ఇంకొక్క గడియలోఁగా ఈ తక్కిన బియ్యం అన్నీ విసరక పోతే అప్పుడు నిజంగానే ఏడుద్దువు గాని ఉండు. (నిష్క్రమించును.)

చంద్ర—అహా! దైవమా, ఏడ్చుటకైనను అధికారము లేక పోయెనా? కన్నులున్నందుకు ప్రాణనాథుని చూచు భాగ్యమే మో తప్పియే పోయినది. ఇఁక ఏడ్చి కన్నీరు కార్చుటకైనను అధికారము లేక పోయినయెడల, ఈ కన్నులుండి ఏమి లాభము?...సాయంకాలము కానై యున్నది; కొడుకును వెదుకకొనుటకు సెలవిమ్మని ఈమెను అడుగఁ దలఁచుకొంటిని. ఇప్పుడే ఇంత మండి పడుచుండగా, అడిగి ఏమి లాభము?...ఈమె కంటె ఈమె మగఁడు కాలకౌశికుఁడే నయము. ఆయననే బ్రతిమాలుకొందను......అయ్యో! కుడికన్ను అదరుచున్నది. ఇంకేమి కీడు కలుగనై ఉన్నదో? కలుగ వలసి ఉన్నయెడల, అది హృదయేశ్వరునికిని లోహితాశ్వునికిని గాక నాకే కలుగును గాక! (విసరుచుండును.)

[కాలకౌశికవేషముతో విశ్వామిత్రుఁడు ప్రవేశించును.]

విశ్వా—(తనలో) హా! భగవంతుఁడా, భగవంతుఁడా! నా పంతము తీర్చుకొనుటకు ఇక ఒక దినమే ఉన్నది. రేపు సూర్యోదయము కాఁగానే గడు వతిక్రమించును. అపైని నేనెట్లు తల ఎత్తుకొని తిరుగఁ గలను? నాకు నూఱేండ్లు గోరౌా తప్పదు...హా! దైవమా,

ఉ. నాఁడు సుధర్మలో సురగణంబుల మ్రోల «త్రిశంకుపుత్రునే
నాడఁగఁ జేసెదన్ మృషల," నంచతిదర్పపు మాటలాడి, నే-
డోడి వశిష్ఠుముందు తలయొగ్గితినేనియు—బ్రహ్మఅంగనీ-
త్రేమ జగంబులందు తలయెత్తి చరింపఁగ నేర్తునే? యయో! 144

ఆహా! వశిష్ఠా, మన ప్రతిజ్ఞ చొప్పున నీవు ఇంద్రాదిదేవతలతోడను కశ్యపాదిమౌనుల తోడను వచ్చి నా పరాభవమును చూచి కెవ్వన కేర్తువు గదా! అయ్యో! ఆ అవమానము ఎట్లు తప్పును? ఇంతకు పూర్వము చేసిన విషమ పరీక్షలకు లొంగని హరిశ్చంద్రుఁడు మీఁది పరీక్షలకు మాత్రము లొంగునా? నే నోడుట తప్పదు, తప్పదు. తప్పదు,..........శిష్యులు పొడం చేయుచున్నారని నేను స్వగాము గా ఏమో ఊడఁబొడుచునట్లు వచ్చినాను! వచ్చినందుకు కార్యము సాధించుట లేదు సరిగదా, చంద్రమతీహరిశ్చంద్రుల దుఃఖము కన్నులార చూచుచుండుట వలన నా కటికతనమునకు వగచుచు అంతమును మానుకొందునా అని గడియ గడియకును బుద్ధి పుట్టుచున్నది...సాటి క్షత్రియునికి చండాలత్వము తెచ్చిన చండాలుఁడను గనుక కటికతనము విడువలేకున్నాను...అయ్యో, పాపము! కన్నీళ్లు లేని అవస్థలో ఈ చంద్రమతి మొగము నేనీ మూడునెలలై చూడనే లేదు. ఈమె కన్నులు నీటి బుగ్గలే అయిపోయినవి. (సమీపించును.)

చంద్ర—అయ్యా కాలకౌశికా, ఒక్క విన్నపము; మన్నించి వినుఁడు: నా చిన్నికుమారుఁడు, పట్టెకడుపుతో అడవికి పోయినవాఁడు, ఇంకను తిరిగి రాలేదు. వానికి ఏమి అపాయము సంభవించినదో అని మనస్సు తల్లడిల్లుచున్నది. కటాక్షించి, వానిని వెదుకుకొనుటకు నాకు సెలవింకు. మీకు పదివేల నమస్కారములు.

విశ్వా—అమ్మి, అట్లయిన యెడల వెంటనే వెళ్లుము. పాపము! ఏమి కీడు జరిగినదో కదా?

చంద్ర—అయ్యా, ఈ బియ్యమన్నియు వినరుమని అమ్మగారి సెలవైనది. వినరకుండ వెళ్లినయెడల ఆమెకు ఏమి కోపము వచ్చునో?

విశ్వా—నేను వెళ్లి చెప్పెదను లే. భయపడక వెళ్లు.

చంద్ర—అయ్యా, మీరు నాయెడల చూపిన మేలునకు అనేకనమస్కారములు. సాధ్యమైనంత త్వరలో తిరిగి వచ్చెదను. (తిరుగలి ఎత్తును.)

విశ్వా—(తనలో) ఈ విధముగా చివరి పరీక్షకు వీలు కలిగినది. ఈమె తన అజ్ఞ లేనిదియు పాటి పోవుచున్నదని దంతఘాతునితో చెప్పెదను. వాఁడు కోపముతో వచ్చి, ఆ తొందరలో తప్పక చేయి చేసికొనును. అందుపై జరిగిన ప్రమాదమును ఈమె మీఁద నేరముగా మోప వచ్చును. (నిష్క్రమించును.)

చంద్ర—పాపము, మగవాఁడైనను ఈ అయ్యకు నామీఁద సాటి ఆఁడుదానికి లేని కనికరము పుట్టినది...ఇఁక ఆలస్యము చేయక బయలుదేఱెదను.

[కలహకంటకీవేషముతోడి దంతఘాతుఁడు తొందరగా ప్రవేశించును.]

దంత—ఓసీ దాసీ, ఎక్కడికి దొంగతనంగా పోతున్నావు? ఆఁగు, ఆఁగు.

చంద్ర—అమ్మా, అయ్యగారు నాకు సెలవిచ్చినారు. కొడుకును వెదుకుకొనుటకు వెళ్లుచున్నాను.

దంత—ఏమీ! ఆయన సెలవిచ్చే వాఁడూ, నువ్వు వెళ్లే దానవూనా? నీమీఁద అధికారం నాది గాని ఆయనకేం ఉంది? పిండి అంతా విసిరావా?

చంద్ర—అమ్మా, తిరిగి వచ్చి ఎంత రాత్రికైనను విసరెదను.

దంత—ఆఁ, ఆఁ, నా మాటంటే ఇంత నిర్లక్ష్యమా? ఇందాఁక ఏం చెప్పాను? ఇదిగో, ఇప్పుడేడు. (కొట్టి దెబ్బున నేలఁబడి చచ్చును.)

చంద్ర—అయ్యయ్యో! పాపము! ఈమె కోపము ఆఁపుకో లేక మూర్ఛ వచ్చి పడి పోయినది కాఁబోలు. ఈమె మూర్ఛనుండి లేవక ముందే పోవకున్నయెడల, ఆ వెనుక పోవుటకు వీలుండదు. ఇంతలో ఈమె మగఁడు వచ్చి ఈమెను లేపును.——ఆహా! ఏమిది? ఈమె కంఠమునుండి రక్తము కాఱుచున్నది? ......ఇవిగో, చిటిలిన ఈ గాజుముక్కలు కాఁబోలు గుచ్చుకొనినవి; చిన్న గాయము పడినది...రక్తము కట్టుటకు గుడ్డ మెడ చుట్టును కట్టెదను. (తన చీర అంచు చించి, దంతఘాతుని మెడ చుట్టును కట్టి)......నెత్తురు కట్టినది... ఈమె ఇంకను కదలుట లేదు...ఆయాసము చేత కాఁబోలు ఊపిరి బిగఁబట్టినది. నేను పోవుటకు ఇదే మంచి సమయము..................(పైకి వచ్చి) అహో! ఎదురుగా చవితి చంద్రుఁడు కనిపించినాఁడు. ఏమి నిందవచ్చునో?.........ఏమి వచ్చినను ఏమి చేయఁగలను? ఒకరికి దాసినై ఉన్న నేను, చంద్రుని చూడక సూర్యుని చూడక ఎట్లు కాలము గడుపఁ గలను?...ఈ చవితి చంద్రుని చూచుటచేత నారోహితుఁడు నాకు మనస్సునకు తట్టుచున్నాఁడు.

ఉ. పున్నమ చందమామ గతి పొల్పును గల్గిన నాదు పట్టికిన్
పన్నినయట్టి యీ యాఁకలిబాధలచే కళలెల్ల పోవఁగా,

క్రొన్నెలవంటి రూపు సమకూరెను: శుద్ధచరిత్రుఁ డాతఁ డిం-
కెన్నఁడు నాదు కన్కు లువలింపు వహింపఁగ వృద్ధి పొందునో? 145

(నిష్క్రమించును.)

---

[ద్వితీయరంగము—కాశీపురము; ఊరి వెలుపటి అడవి. పల్లేరు
కాయలు ఏరుచు కుమారభట్టు, రుద్రభట్టు, వినాయకభట్టు,
అను పిల్లలును, సమిధల మోపు పట్టుకొని లోహి
తాస్యుఁడును ప్రవేశింతురు.]

లోహితాస్యుఁడు—స్నేహితులారా, అంత సేపటినుంచి పిలుచుచున్నను మీరు నా మాట వినిపించుకొనకుండ పల్లేరుకాయ లేరుచున్నారు. సాయంకాలమై పోయినది. ఇప్పటికేరిన కాయలు చాలును లెండు; ఇంకను ఏరి ఏమి చేసికొందురు?

రుద్రభట్టు—ఏం చేసికొంటామా? రాక్షసిముండ కలహకంటకి ముందు కుప్పకుప్పలుగా పోస్తేనే తప్ప మా కసితీరదు.

లోహి—అయ్యో! రుద్రభట్టా, ఆవిడకు బాధ కలిగించినయెడల మీకేమి లాభము వచ్చును? ఒకరిప్రాణమునకు నిష్కారణముగా నొప్పి కలుగనీయ వచ్చునా? ఇందుఁ గూర్చి మానాన్నగారు నాకు చెప్పిన నీతి నా మనస్సున నాటుకొని ఉన్నది.

తే. గీ. ఇతరులకు మన మొనరింప నెంచు కీడు
ఇతరులే మనకొనరించి రేని, ఎంత
బాధ కల్గునో తలపోసి పరులయెడల
క్రూరత నిరంతరము మానుకొనఁగ వలయు. 146

రుద్ర—ఇదేం లోహితాస్యా, ఇలా అంటూ వున్నావు? ఆ రాక్షసి ముండ మీఁద దయ తలుస్తావేఁ? అది నిన్ను బాధ పెట్టదా ఏమిటి? మీ అమ్మను కాల్చుకు తింటుందఁటే!

లోహి—అయ్యా, ఆవిడ నన్ను పెట్టు బాధ ఇంతయు అంతయు కాదు. అయి

నను నేను ఆమె మీఁద పగ తీర్చుకొనఁబోవుట మా నాన్నగారు నాకు నేర్పిన నీ
తుల పూలకున; ఆటు వినుః

తే. గీ. కీడునకు కీడు చేసెడు వాఁ డధముఁడు;
కీడునకు కీడు చేయని వాఁడు మధ్య-
ముండు; కీడునకున్ రోషమును వహింప-
కుండ, మేలు చేసెడు వాఁడె యుత్తముండు. 147

రుద్ర—ఓరేవు కుమారభట్టూ, లోహితాస్యుఁడు మహా తొందర పడుతూ వున్నాఁడు! ఇఁక వెళ్లి పోదామా?

కుమారభట్టు—అయితే చంద్రోదయం అయిందేమో చూడు.

రుద్ర—నేను చూడను బాబూ, పాలవెల్లికి కట్టిన జాంపళ్లు మధ్యాహ్నం దొంగతనంగా తిన్నాను. ఆ నీలాపనింద నామీఁద పడుతుంది.

వినాయకభట్టు—ఓరే రుద్రం, చేసిన పనికి నీలాపనింద ఏమిటిరా? అంతగా పడితే నన్ను తలఁచుకో; నీ నీలాపనిందలు అన్నీ పోఁగొట్టాను.

కుమార—ఏమిరో వినాయకభట్టూ, అలా అంటు వున్నావు. నువ్వు పేరుకు మట్టుకే వినాయకుఁడివి గాని, ఆయన లక్షణాలూ మహిమలూ నీకెక్కడ వస్తవి?

వినా—కుమారభట్టూ, నీతెలివి ఇంతే కదా? పేరుకు మాత్రమేనా నేను వినాయకుఁడిని? నాకు మాత్రం లంబోదరం లేదా? టెంకాయలు ఇష్టం కావా? మా అవ్వ పనులు చేసుకొంటూ వుంటే అవి సాగనియ్యకుండా నేను మాత్రం విఘ్నాలు కలిగించనా?

రుద్ర—చేట చెవులూ, వంకర తుండం, ఏకదంతం,—వీటి మాటో?

వినా—అప్పుడప్పుడు మా అవ్వ చెవులు పట్టుకొని లాగడం చేత నావీ చేటచెవులే అయిపోయినవి. ముక్కు పట్టుకొని నలువుతూ వుఁడడం చేత వంకర తుండం పోలిక కూడా వచ్చింది. అట్టే అల్లరి చేస్తూంటుంటే టెంకాయలు వాయిస్తూ వుంటుంది; చాలా మట్టుకు పళ్లు రాలి పోయినవి; ఎప్పుడో నాకూ ఏకదంతమూ సిద్ధిస్తుందన్న నమ్మకం ఉంది.

రుద్ర—మరేం! నువ్వు కేవలం ప్రత్యక్షవినాయకుఁడివే. నువ్వే పూల కూర్చుంటే మీ అవ్వను పూజ చెయ్యమన లేక పోయినావా?

వినా—పూజ చెయ్యమన లేదు గాని, ముందుగా నాకే నైవేద్యం పెట్టుమని మా

అవ్వని అల్లరి పెట్టాను. అప్పుడు ఆవిడ పెట్టిన మొట్టికాయలకే, ఇదిగో, రెండు బొణుపులు లేచి, నా తలకాయ ఏనుఁగు కుంభస్థలం లాగు తేలింది.

రుద్ర—ఓహో! అక్కడికి గజాననుఁడవు కూడా అయ్యావు...అయితే పూజలోపుగా నువ్వు తిన్నవి వట్టి మొట్టికాయలే అంటూ.

వినా—ఆఁ, అలాగు పూరుకున్నానా? ఒక చిన్న గమ్మత్తు చేసాను. మా అవ్వ వెలగపళ్లకు తాళ్లు కట్టుమని నా దగ్గర పెట్టి, తాను అటక ఎక్కింది.

రుద్ర—ఎందుకుకోయి?

వినా—పూజ దగ్గఱ పెట్టడానికి బూజెక్కిన పాత తాటాకుపుస్తకాలు,—కాశీఖండం అఁట, వీరభద్రవిజయం అఁట, గంగా వివాహం అఁట, ఇంకా ఏవేవో,—తీయడానికి వెళ్లింది. ఇదే సందు గదా అని నేను ఆ వెలగపళ్లకు మూఁతుల దగ్గఱ కన్నాలు పొడిచి చీపురుపుల్లతో లోపటి గుజురంతా మెల్లగా ఊడ లాగి, పరిష్కరించి, మా అవ్వ దిగే సరికి గుప్ చుప్. మఱి కొంచెం సేపటికి మా అవ్వ వెలగపళ్లు తీసి చూచును గదా, ఒక దానిలోనూ గుజురు లేదు. వెంటనే ఆవిడ నా పిలక పట్టుకొని ఊపడం మొదలు పెట్టింది.

కుమా—(నవ్వుచు) తిన్న గుజురంతా ఎక్కి లాగిందే.

వినా—నేను ఏడుస్తూ, వినాయకుఁడు ఏనుఁగు కాఁబట్టి, అతఁడే వెలగపళ్ళు వళ్ళు లాఁగవుండఁగా లోపలి గుజురు తిని వేసి వుంటాఁడు గాని ఆ ఘోష నాకేమి తెలియదని ఘోష పెట్టాను.

రుద్ర—నమ్మిందా?

వినా—ఆఁ, కామయ్య దగ్గఱేనా కయికయిలు? నేను అలాగు కప్పే సరికి ఆవిడ, "వినాయకుఁడికి అయితే మాత్రం పూజ కాకుండా నైవేద్యం ఏమిటి? ఇప్పుడైనా పూజ కానిస్తా" నంటూ మూలనున్న చీపురుకట్ట పట్టుకొని, "లంబోదరాయనమః ఉదరం పూజయామి," అని కడుపు మీదా, "స్థూలకంఠాయ నమః కంఠం పూజయామి," అని మెడ మీఁదా, "శూర్పకర్ణాయనమః కర్ణౌ పూజయామి," అని గూబ మీఁదా నాలుగు వడ్డించింది.

అందఱు—(గొల్లున నవ్వుదురు.)

రుద్ర—మీ అవ్వ విడ్డూరపు పిండం లాగుందిరోయి!

వినా—నింపాదిగా అంటావు. మా అవ్వకూ కలహకంటకికీ పడితే అప్పుడుంది తమాషా! ఎప్పుడు పడుతుందో గాని?

కుమా—ఓరేవు రుద్రం, ఇదిగో ఈ పుట్ట మీఁద మంచి సామంతమైన పినుఁకు వెల్లేరు కాయలున్నాయిరా. ఏరుకొని వస్తాను, ఉండండి.

లోహి—కుమారభట్టా, ఇంకను ఆలస్యము చేసెదరా? రాత్రి వడినది. మా అమ్మ నా కొఱకు బెంగటిల్లుచుండును. ఇఁక రండు.

వినా—లోహితాస్యా, ఒక్క గడియ ఆలస్యానికే బెంగటిల్లి పోతుందా? మీ అమ్మకు నీ మీఁద అంత ప్రేమా?

లోహి—అయ్యా వినాయకభట్టా, ఆమెకు నేనన్న ప్రాణము. మొదటినుండియు అట్లే అయినను, ఈ నడుమ పేదఱికము వచ్చినప్పటినుండియు ఆమె నన్ను మునుపటికంటె మూఁడు మడుఁగులు ఎక్కువ గారాబముతో చూచుచున్నది.

సీ. నేనాకలికి తాళలేనని, తనకటు-
పున్ కట్టుకొని నాకు బువ్వ పెట్టు;
నా మేనునకు నొత్తునేమో యనుచు, ఉన్న
బట్టలన్నియు నాకె ప్రక్క వఱచు;
నాకు కష్టము కల్గునో కదా యని, నాప-
నుల్ కూడ తానె ముందుగనొనర్చు;
ఏ బెంగటిల్లి పోయెదనని, ఎదుట కం-
టను తడియైన పెట్టంగఁ బోదు;
తండ్రి దూరమై యున్న యీ తరుణమందు
తల్లియును మఱి తండ్రియు తానె యయ్యె;
అట్టి దైవసమానురాలైన కన్న-
తల్లి ఋణ మెట్లు తీర్చుకోఁ జెల్లు నాకు? 148

రుద్ర—లోహితాస్యా, నీ లాంటి చక్కని కొడుకు మీఁద ఏ తల్లికి ప్రేమ ఉండక పోతుంది? నిన్ను విడిచి పెట్టి పోవడం చూస్తే మీ తండ్రికి మాత్రం అంతగా ప్రేమ ఉన్నట్లు కనఁబడదు.

లోహి—అయ్యో రుద్రభట్టా, ఎంత మాటాడితివి? నాన్నగారికి నా మీఁద ప్రేమ తక్కువా? ఆయన నన్ను కన్నులలోనే పెట్టుకొనునే. నన్ను విడుచుచున్నప్పు

డు తన ప్రాణములను విడుచుచున్నట్లుగానే బాధ పొందెను. ఆయన ప్రేమను నేనేమని చెప్పఁగలను?

సీ. తొడ మీఁద నన్ను తానిడుకొని, "లోహితా-
శ్వా, వింతలేమిరా?" యనుచు నడుగ,
అడిగి, నే బుడిబుడి నుడువులు నుడువ, తా-
మును రెప్ప వాల్చక కనుచు వినును;
విని విని, అవి తన వీనుల నలరింప,
మురియుచు నన్ను తా ముద్దులాడు;
ఆడియు సంతృప్తి నందక, నను తన
యక్కున గట్టిగా నదుముకొనును;
అదుముకొని కౌఁగిలించి, "నా యనుఁగు పట్టి,
నాదు మోహంపు పెట్టె, అందాల కుప్ప,
సుగుణముల తిప్ప," అని నన్ను పొగడునట్టి
తండ్రి ప్రేమను మఱువఁగా తరమె నాకు? 149

కుమా—అమ్మరొయ్యో! చచ్చాం. (పుట్ట దిగి పఱుగెత్తును.)

రుద్ర—ఏం కుమారం; ఎందుకు పఱుగెత్తుతున్నావు?

కుమా—అమ్మరొయ్యో! పెద్ద తెగబాఱెఁడు నాగుపాము, నన్ను వెంటఁ బడుతూ వుంది. పఱుఁగెత్తండి.

అందఱు—అమ్మరొయ్యో! (నలువంకలకును పఱుగెత్తుదురు.)

కుమా—అయ్యొరొయ్యో! ఇదేం? ఇది నా మీఁద పగ పట్టింది కాఁబోలు. నన్నే వెంట తరుముతూ వుంది...అరొయ్యో! అరొయ్యో! దగ్గఱ పడుతూ వుంది. కరుస్తుంది కాఁబోలు. అమ్మో! లోహితాస్వా, నన్ను రక్షించు.

లోహి—కుమారభట్టూ, భయము లేదు...ఇదిగో, ఇక్కడ ఒక కఱ్ఱ దొరకినది. దీనితో ఈపామును కొట్టెదను, ఉండు. (కుమారభట్టు పై పునకు నడుచును.)

రుద్ర—(చెట్టు మీఁదినుండి) లోహితాస్వా, సాహసం చెయ్యకు. నాగుపాం కూడా నఁట.

లోహి—భయము లేదు...ఏమైనను కుమారభట్టును రక్షింపవలెను.....ఇదిగో, దెబ్బ మీఁదికి విసరుటచేత ఈ పాము అతనిని విడిచి నా వైపునకే బుస్సుమని వచ్చుచున్నది. కఱ్ఱతో అణఁచి పెట్టెదను.

వినా—(చెట్టుమీఁదనుండి) ఒరేవు రుద్రం, చూసావా, పాం జర్రుమని ఏలాగు లోహితాస్యుఁడి మీఁదికి బుస కొట్టుతూ వెళ్తా వుందో?...అదిగో, లోహితాస్యుఁడు పామును కఱ్ఱతో అణఁచి పెట్టాఁడు. రా, రా, చెట్టు దిగి దాని తల చిదుగ కొడ్దాం.

రుద్ర—అమ్మయ్యో! పాం తప్పించుకుంది. ప్రమాదం రోయి.

వినా—అయ్యో! అయ్యో! పాపం, పాం లోహితాస్యుఁడిని మళ్లీ వెంట బడ్డది. ......అయ్యో! అయ్యో! కాలు జాఱి అతఁడు పడ్డాఁడు. హా! హా! హా! పాం అతఁడిని కఱచి పాఱి పోతూ వుంది. (చెట్టు దిగును.)

రుద్ర—అయ్యో! ఎంత పని జరిగింది! ఏం గతి? (చెట్టు దిగును.)

కుమా<br>రుద్ర —(లోహితాస్యుని దగ్గఱకు వడిగా పోవుదురు.)<br>వినా

రుద్ర—అయ్యో! లోహితాస్యా, పాం నిజంగా కఱచిందా?

లోహి—(చేయి ఆనుకొని లేచి కూర్చుండి) నిజముగానే ఇదిగో, నా మెడమీఁద కఱచినది. కొంచెము చిమచిమలాడుచున్నది గాని మఱేమియు బాధలేదు.

రుద్ర—పాము కాటుకు అట్టే బాధ వుండదు. ప్రమాదమాత్రం త్వరగా చేస్తుంది.

వినా—ఒరే రుద్రం, జందెపు పోచతో గట్టిగా కట్టు కట్టడానికీ వీలు లేదు. ఏం వుపాయం?

రుద్ర—ఒరేవు, గాయం దగ్గఱ నోరు పెట్టి విషం ఎవరైనా గట్టిగా ఎగపీల్చి వేస్తే మంచిదిరా.

కుమా—కాని ఆలాగు చేసిన వాఁడికి కూడా ప్రమాదం సుమీ.

వినా—ప్రమాదమైతే ఏం? లేక పోతే నిష్కారణంగా చచ్చి పోతాఁడు. నేను ఎగపీలుస్తాను. తల్లీ తండ్రీ లేని వాఁడిని నేను చస్తే పీడ పోయింది. (వంగును.)

లోహి—అయ్యో! వినాయకభట్టూ, నా కోసము నీవు ప్రాణములు తెగించఁ బూనుకొనఁగా, చూచుచు ఊరకున్నయెడల ఆదోషము నాది కాదా?.....పాము కాటు ప్రమాదమనుచున్నారు. దీని వలన నాకు చావు కలుగునేమో! చచ్చు కాలమున నాకు వట్టి అపచారము కట్టకుము......అయ్యో! అయ్యో! నాకు

నిజముగానే చావు కలుగునా?...హా! భగవంతుఁడా, మా అమ్మను చూడకుం డనే నాకు ప్రాణములు పోవును కాఁబోలు! మిత్రులారా, మిత్రులారా, మీకు నా మీఁద జాలియే ఉన్నయెడల, నా తల్లిని ఎవ్వరైనను తీసికొని రండు.

కుమా—ఇదిగో, నేను పరుగున వెళ్లి తీసుకు వస్తాను. (పరుగున పోవును.)

రుద్ర—లోహితాస్యా, లోహితాస్యా,—

పినా—పలకఁడేమిరా? విషం ఎక్కి పోతూ వుంది కాఁబోలు. ఎంత ప్రమాదం! అయ్యయ్యో! పాపం! తల్లికి ఇతఁడొక్కఁడే కొడుకఁట! ఏమైనా అక్రమం జరిగితే ఆవిడ దుఃఖం ఎవరు చూడఁగలరు? లోహితాస్యా, లోహితాస్యా,—

లోహి—స్నేహితులారా, నాకు దేహస్మృతి తప్పుచున్నది......అయ్యో! అయ్యో! నా కన్నతల్లిని చూడకుండఁగనే నా కన్నులు మూతపడి పోవును...హా! తల్లీ, నేనెంతలో తిరిగి వత్తునో అని తలవాఁకిటనే కన్నులన్నియును పెట్టుకొని నీవుండఁగా, ఇంతలో ఈ ఘోరవార్త నీ చెవిని పడినయెడల పిడుగడఁచినట్లు కూలుదువు గాని నిలువఁగలవా?...అమ్మా, నాన్నగారు నిన్నుఁ బాసినను నన్ను చూచుకొనియే ఇన్నాళ్లును ప్రాణములు నిలుపుకొని ఉన్నావు; ఇఁక ఎట్లు నిలువఁగలవు?...అయ్యో! తల్లీ, నాకు చీమ కుట్టినను నీ ప్రాణములు తల్లడిల్లుచుండునే; ఇప్పుడు జరిగిన ఈ ఘోరమునకు ఎంతగా తల్లడిల్లుదువో?... తల్లీ, నా కన్నులను మూయుటకైనను నీవు దగ్గఱ లేక పోతివి గదే!

రుద్ర—లోహితాస్యా, ఇలాగ బెంగటిల్లి పోకు. పాము కాటు ప్రతీ మాటూ ప్రమాదించదు. ఒకొక మాటు బ్రదికిన వాళ్లు కూడా వున్నారు.

లోహి—మిత్రులారా, నేను బ్రదుకుట పట్టిది. మా అమ్మ వచ్చు వఱకును ప్రాణములు ఆఁగవు....మా అమ్మతో నా కడపటి పలుకులుగా ఇట్లు చెప్పుఁడు:

సీ. నను గర్భమందు మోసినయట్టి నీఋణ-
మైన తీర్పఁగ నేరనైతినమ్మ;
పెఱిగి నే నిను సుఖపెట్టఁ దలంచు నా
యాశలన్నియు నడుగంటెనమ్మ;
నీమీఁద నాకున్న ప్రేమ చూపించుట-
కవకాశమైన లేదయ్యెనమ్మ;

తుదకు, నీ నెమ్మోము తుదిని కన్గొనెడు భా-
గ్యము కూడ నాకబ్బ దాయెనమ్మ;
అమ్మరో, లోహితాస్యుఁడన్నట్టి కొడుకు
నీదు కడుపున పుట్టనే లేదనుకొని
శోకమును నీవు మానుటే కాక, నాన్న-
గారి శోకమున్ మాన్పుమో కన్నతల్లి. 150

విశా—ఒరే రుద్రం, ఈ దుఃఖం నేను చూడలేనురా. (ఏడ్చును.)

రుద్ర—అయ్యో! లోహితాస్యా, లోహితాస్యా, (ఏడ్చును.)

లోహి—మిత్రులారా, నాకై ఏడువకుఁడు. నా మృతికై నేనంతగా విచారించను గాని మా అమ్మను నాన్నగారిని తలఁచి నాకు దుఃఖము పొంగి పొరలి వచ్చుచున్నది......మా నాన్నగారిని చూడవలెనన్న అపేక్ష నాకెంతో ఉండెను. ...దురదృష్టవంతుఁడను, నాకది తీరినది కాదు...మా నాన్నగారితో నా చివరి మాటలుగా ఇట్లనుమని మా అమ్మతో చెప్పుఁడు:

సీ. ఎడఁబాసినది మొదలెద మిమ్ముఁ దలఁపని
నిముసమేనియు ఉండనేరదయ్య;
ఎట చప్పుడైన, మీరే వచ్చితిరటంచు
ఉలుకు పాటును పొందుచుందునయ్య;
క్రమ్మఱ మిమ్ము నేఁ గనుట యున్నదటన్న
ఊహాతోడను నిల్పియుంటినయ్య;
కాని, మీ నెమ్మోము కనకుండ నా కన్ను-
లిటు మూతపడునని ఎఱుఁగనయ్య;
అయ్యయో! మీకు పుత్రుఁడనై జనించి
ఋణము తీర్చుకోఁ జాలని హేతువునను
ఎన్ని జన్మంబులింక నేనెత్త వలెనొ
అన్నిటను మీకె పుట్టెదనయ్య తండ్రి. 151

మిత్రులారా, ఇఁక మాటలాడుటకు శక్తి చాలకున్నది. కన్నుల దృష్టి తగ్గి పో వుచున్నది. చెవులలో ఓంకారము పుట్టుచున్నది.

రుద్ర—ఒరేవు వినాయకా, కాశీలో చచ్చే వాళ్ల చెవులలో శివుఁడు ఓంకారము ను ఉపదేశిస్తాఁడఁట. అదే కాఁబోలురా ఈ ధ్వని?

వినా—ఒరేవు, ఇతఁడి నోటిలో నుంచి చొంగ కారుతూ వుంది; ఒళ్లు వచ్చపడు తూ వుంది. చచ్చి పోతాఁడు కాఁబోలురా.

లోహి—మిత్రులారా, నా మరణము సమీపించినది. నాకిఁక సెలవిండు...లోక మా, ఇఁక నిన్ను చూచు భాగ్యము నాకు తప్పి పోయినది. ఇదే నాకడ సారి మ్రొక్కు.

సీ. కాశీ విశ్వేశ, నన్ కలుపుకోవయ్య నీ
ఒడలిలోపలికి, నీకొక్క మ్రొక్కు;
ఓ యన్నపూర్ణాసతీ, యిఁక కైవల్య-
మొసఁగఁ గదమ్మ, నీకొక్క మ్రొక్కు;
డుంఠి విఘ్నేశ, అడ్డుగ రాక నాకు సా-
యుజ్యమీవయ్య, నీకొక్క మ్రొక్కు,
కాశికాపురి కాచు కాలభైరవ, నాకు
దిక్కు కావయ్య, నీకొక్క మ్రొక్కు;
వంశకర్తవౌ సూర్యుఁడా, వంశమాఁగ-
కుండ చూచుకోవయ్య, నీకొక్క మ్రొక్కు;
నన్ను కన్నతండ్రీ, నన్ను కన్నతల్లి,
సల్పెదను మీకిదే కడసారి మ్రొక్కు. 152

అదిగో, మా అమ్మ నన్ను పిల్చుచున్నది......అమ్మా, ఇదిగో వచ్చుచున్నాను. (తేవఁ బోయి వెనుకకు ఒరుగును.)

రుద్ర—(పట్టుకొని) లోహితాస్యా, లోహితాస్యా,...అయ్యో! ఇఁకెక్కడి లోహి తాస్యుడు? ప్రాణం పోయినట్టుంది.

వినా—ఒరేవు రుద్రం, అదుగో పాపం! చంద్రమతమ్మ ఏడ్చుకొంటూ పరుగుపరుగున వస్తూవుంది.

[ఏడ్చుచు పరుగుపరుగున చంద్రమతియు, వెంట కుమారభట్టును ప్రవేశింతురు.]

చంద్ర—హా! కొడుకా, రోహితాశ్వా......ఏఁడీ, ఏఁడీ, నా ముద్దుల కొడుకేఁడీ? నా కన్నతండ్రి ఏఁడీ? నా రోహితాశ్వుఁడెక్కడ నున్నాఁడు. (రోహితాశ్వునిమీఁద పడి) నాయనా, రోహితాశ్వా, నిన్ను పాము కఱచినదా? ఏదీ? ఎక్కడ కఱచినది? (రోహితాశ్వుని తొడలమీఁద వేసికొని) నాయనా, ఏదీ? చూపించు తండ్రీ, విషము పీల్చెదను. తండ్రీ, బాధగా ఉన్నదా? పలుకకున్నావు. నాయనా, ఇదిగో మీ అమ్మను; చంద్రమతిని; దౌర్భాగ్యురాలను. నా వైపు కన్నెత్తి చూడు. (రోహితాశ్వుని మొగ మొత్తి) అయ్యో! అయ్యో! ఓ అయ్యలారా, ఏమిది? నా ముద్దులయ్య మాటలాడఁడు. నా కన్నతండ్రి నన్ను కన్నెత్తి చూడఁడు.

రుద్ర—అమ్మా, దుఃఖం ఆఁపుకో. లోహితాస్యుఁడు ఇప్పటి వఱకూ మాటలాడుతూనే వున్నాఁడు. ఇప్పుడిప్పుడే, ''అమ్మా, ఇదిగో వస్తున్నాను'' అని వెనుకకు ఒరిగాఁడు.

చంద్ర—(దుఃఖముతో) ఆఁ, ఆఁ, ఆఁ, అబ్బా! కొడుకా, ఎంత చేసితివి? నా గొంతుక కోసి వేసితివి. నా కడుపులో చిచ్చు పెట్టితివి. నా బ్రదుకు వడఁ దోసితివి...అబ్బా! అబ్బా! అబ్బా! తండ్రీ,...హా! ఈశ్వరా, ఈ దుఃఖమునకు ఎట్లు నిలువఁ గలుగుదును?......హా! కొడుకా, కొడుకా, కొడుకా, రోహితాశ్వా,—(మూర్ఛిల్లును.)

కుమా—అయ్యో, పాపం! ఏం ఘోరంరా?...ఒరే వినాయకా, మీ అవ్వ కోపపడుతుంది; నువ్వు ఇంటికి వెళ్లిపో. ఒరే రుద్రం, నువ్వు ఊళ్లోకి వెళ్లి ఈ సంగతి కాలకౌశికుఁడితో చెప్పరా. అతఁడు మంచి విషవైద్యుఁడు. అతనికి చెప్పిన తరువాత నువ్వు దీపం పట్టుకొని స్మశానానికి రా. ఈ అమ్మ మూర్ఛ తేరఁగానే అక్కడికే తీసుకు వెళ్తాను.

(రుద్రభట్టును వినాయకభట్టును నిష్క్రమింతురు.)

అయ్యో, పాపం! ఈవిడ అవస్థ చూస్తే నాకూ జాలిగానే వుంది. అయినా ఏమిటి చెయ్యడం?......అమ్మా, చంద్రమతమ్మా, లే.

చంద్ర—(మూర్ఛనుండి తేచి గుండె బాదుకొనుచు) అబ్బా! అబ్బా! కొడుకా, ఎంత చేసితివిరా? ఇంకేమున్నది? నా బ్రదుకు తెల్లవాఱి పోయినది. నా కన్నులు కాలిపోయినవి. నా ఆశలన్నియు కూలిపోయినవి...హా! కొడుకా, కొడుకా, ఎంత చేసితివిరా?

సీ. నాయనా, నాయనా, నాయనా, ఏర? నీ
చూపులం బఱపి నన్ చూడవేర?
ఓ కుమారా, కుమారా, కుమారా, ఇదే-
రా? వచ్చి లేపినన్ లేవవేర?
తండ్రి, తండ్రీ, ఓరి తండ్రీ, ఇదేర? నా
తోడ గొంతెత్తి మాటాడవేర?
పుత్ర, ఓ పుత్ర, ఓ పుత్రకా, ఏమిరా?
ఇంపుగో నను కౌఁగిలింపవేర?
నేను నీ తల్లి; నిదె వచ్చినాను: నన్ను
చూడరా, లేవరా, మాటలాడరా, క-
వుంగిలింపరా, ఊరకుండంగఁ దగునె?
కొడుక, కొడుకా, కొడుక, ఓరి కొడుక, కొడుక. 153

(మూర్ఛిల్లును.)

కుమా—అయ్యయ్యో; పాపం! ఎంత ఘోరదుఃఖం! నాకూ కళ్ల వెంబడి నీళ్లు వస్తూ వున్నవి....అమ్మా, ఊరడిల్లు, ఊరడిల్లు.

చంద్ర—(మూర్ఛనుండి తేరి గుండె బాదుకొనుచు) అబ్బా! అబ్బా! ఎంత పని! ఎంత పని!...హా! తండ్రీ, రోహితాశ్వా, నా దౌర్భాగ్యవశమున నీవెంత అల్పాయుష్మంతుఁడవై పోతివిరా? ఓరీ నాయనా,

క. జాతకమును కనుఁగొని, నీ
చేతులు గని, నీకు పూర్ణజీవనమనుచున్
జ్యోతిష్కులనిరి; ఇంతట-
నే తండ్రీ, నీకు నిండెనే నూరేండ్లున్? 154

అయ్యో! అయ్యో! కొడుకా; ఇన్నాళ్లును నిన్ను పెంచి పెద్దవానిని చేసి నా ముప్పున కొడుకని ఉప్పొంగుచు, చివరకు ఈ నట్టడవిలో పాము పొట్టఁ బెట్ట వలసి వచ్చెనా?

సీ. తొమ్మిది నెలలు గర్భమ్మున నిన్ను మో-
యుట, పాము పోట్టఁ బెట్టుటక? కొడుక,
కనులలోపల పెట్టుకొని పెద్దవానిఁ జే-
యుట, కాన వాతఁ దోయుటక? కొడుక,
నీ రూపు రేఖల నారసి మురియుచుం-
డుట, కాశికొప్పగించుటక? కొడుక,
అత్యద్భుతంపు విద్యాబుద్ధులీవు నే-
ర్చుట, కాటిలో కలియుటక? కొడుక,
పెరిగి పేరుప్రతిష్ఠలన్ పరఁగి నాదు
కనులు చల్లఁ జేయుదువనుకొనుచునుంటిఁ
గాని, ఈలాగు నా కనుల్ కాలిపోవు-
నంచు నెఱుఁగ నయ్యా, కుమారా, కుమార. 155

అబ్బా! అబ్బా! ఎంత ఘోరము! హా! నాయనా,

శా. నిన్నున్ పాపపు పాము వెంటఁబడి తెంఁడ్రీ, కాటు వేయంగ, అ-
న్నన్నా! ఎంతటి బాధ పొందితివొ? ఏమారాటమున్ చెందితో?
న'న్నో యమ్మ' యటంచు పిల్చితి వె? 'నాన్నా' యంచు వాపోయి తే?
అన్నా, చిన్నికుమార, నన్గనయయ్యా, నాయనా, నాయనా. 156

(మూర్ఛిల్లును.)

కమా—ఆహా! గుండె కరిగి పోతూ వుంది......అమ్మా, ఊరడిల్లు; లే, లే; ఏడుపు మాను.

చంద్ర—(మూర్ఛ తేరి) అయ్యో! అయ్యో! కొడుకా, ఇఁక నాకీ లోకమేల? శరీరమేల? జీవనమేల? నాకన్నియును అయిన నీవే కడతేరఁగా, ఇఁక ఈ

క్కిన దేనితో అయినను ఏమి ప్రయోజనము? ఇఁక నేను జీవించి ఏమి చేయుదును...హా! కొడుకా, కొడుకా,

సీ. "అమ్మా" యటంచు నోరారంగ ప్రీతితో
ఎవరు నన్ పిలిచెదరిఁక? కుమార,
"రార తండ్రీ" యంచు గారాబమున పిల్చి
ఎవరి ముద్దాడుదునిఁక? కుమార,
ఇష్టపదార్థంబు లివి యవి యని దాచి
ఎవరికి పెట్టుదునిఁక? కుమార,
ఏ చిన్న మాటైన నా చెవిన్ వేయంగ
ఎవరు నన్ చేరెదరిఁక? కుమార,
ఎవరి రాకకు నేనింక ఎదురు చూతు?
ఎవరి కొఱకు జీవము దాలుదునింక? నీవు
లేకయున్నను లోకమే లేదు నాకు,
ఓ కుమారక, ఓ కుమారా, కుమార. 157

అయ్యో! కుమారా, నిన్ను కడసారి చూచు భాగ్యమైనను నాకు లేక పోయినదికదరా. హా! తండ్రీ, నీ మరణావస్థలో ఏమంటివి? ఎవ్వరిని తలఁచితివి? హా! నాయనా, నాన్నగారికి ఏమి చెప్పుమన్నావు? తండ్రీ, కాఁటికొప్పగించితినని చెప్పనా? అయ్యో! పుత్రా, ఇంతకు ముందెల్ల నాన్నగారిని ఎప్పుడు చూతునా అని తొందర పడుచుండెడి దానను; ఇప్పుడు ఆయనను ఏ మొగము పెట్టుకొని చూతునా అని దిగులు పుట్టుచున్నదిరా తండ్రీ!

శా. "ఏఁడీ రోహితుఁ? డేఁడి నాతనయుఁ? డేఁడీ చిన్నిమన్నీఁడు? నా
యీడున్ జోడును లేని యందములప్రోవేఁడీ? ననున్ చూడఁగా
రాఁడేమీ?" అని నాన్నగారడుగ, ఏ ప్రత్యుత్తరంబిత్తు? "కా
పాపం జాలక మ్రింగినా" ననుచు చెప్పన్ నాల్క యెట్లాడురా? 158

కుమా——అమ్మా, ఏడవకు, కొంచెం దుఃఖం మఱచిపో.

చంద్ర—అయ్యో! కొడుకా, ఈ దుఃఖము ఎట్లు మఱచి పోఁగలను? నా కడుపులో ఆరని చిచ్చు పెట్టితివిరా నాయనా, నాకు ఏడుపు గాక ఇఁక ఏమి పని ఉన్నదిరా? తండ్రీ.

సీ. కౌఁగిలింపంగ సౌఖ్యము గూర్చు నీసుకు-
మారాంగముల నెట్లు మఱతు? తండ్రి,
కనుఁగొనన్ కనులవిందొనరించు నీదు సుం-
దరముఖం బెట్లు మఱతు? తండ్రి,
వీనుల కమృతంపుసోనలౌ నీ ముద్దు
మాటల నే నెట్లు మఱతు? తండ్రి,
నాలుక తనియంగ "నాయనా, తండ్రీ, కు-
మారా," అనక యెట్లు మఱతు? తండ్రి,
నీదు శిరమునాఘ్రాణింప నాదు మదిని
పరఁగుచుండు సుఖం బెట్లు మఱతు? తండ్రి,
అయయొ! పంచేంద్రియవ్యవహారములను
నాకు పోఁగొట్టి పోయితివా? కుమార. 159

కుమా—అమ్మా, ఇంత కడుపు పగిలి ఏడువకు. ఎంత ఏడ్చినా ఏం లాభం వుంది? చచ్చి పోయిన వాళ్లు తిరిగి వస్తారు గనుకనా?

చంద్ర—అయ్యయ్యో! తండ్రీ, నీవు నిశ్చయముగా చనిపోతివా? నన్ను ఒంటిదానిఁగా చేసి పోతివా? అబ్బా! అబ్బా! తండ్రీ, నేను నష్టలేకున్నాను. ఒక్క నిముషమైనను నేను కనఁబడక పోయినయెడల, "అమ్మ ఏది? మా అమ్మ ఏది?" అని ఆరాటపడుచుండు వాఁడవు; నన్ను నీవు విడిచి ఏలాగు పోయి ఉందువురా? తండ్రీ, నీవు చనిపోయి యుండవు.........ఓ మృత్యుదేవతా, ఇప్పుడు నీవు పొట్టఁ బెట్టుకొన వలసిన వాఁడు నా కొడుకు కాఁడు. ఏదో పొరపాటు జరిగి ఉండవలెను; ఆలోచించుకో. వీఁడసలే కడు చిన్నవాఁడు; అందుపై చిక్కి సగమైన వాఁడు; ఇట్టి వానిని మ్రింగుట వలన నీకడుపు ఏమి నిండును? నన్ను మ్రింగి నీ కడుపు నిండించుకో.........హా! తండ్రీ, నీకీ అకాలమృ

ష్యవు కలుగుటకు నీవేమి పాపము చేసితివి? అయ్యో! నాయనా, పుట్టి పాప మన్నది ఎన్నఁడును ఎఱుఁగవు గదా?

చ. ఎవరికి కూడ నొప్పి జనియింపని వైఖరినే చరించుచుం-
దువు; పయివారి బాధల కనుంగొని నీకె ఘటిల్లినట్లులే-
డ్తువు; చలిచీమ నేనియును త్రొక్కవయో! "సుకృతీగతాయు," వ-
న్న వచనమున్ యథార్థమునొనర్చితె? దుఃఖము నాకుఁ గూర్చితే?

కసూ—అమ్మా, నీకీ దుఃఖం జన్మం ఉన్నన్ని నాళ్లూ ఉన్నదే. ఊరడిల్లు; మీఁద జరిగించ వలసిన పనులను గుఱించి ఆలోచించు. నడి రాత్రి కావచ్చింది.

చంద్ర—(గుండె బాదుకొనుచు) ఆఁ, ఆఁ, ఆఁ,...అయ్యో! నాయనా, నిన్ను నేనిఁక కాటికి ఒప్పగించ వలసినదేనా! హా! తండ్రీ, అంతటి గారాబముతో నిన్ను పెంచిన నా చేతులతో నీకు దహనకార్యము చేయ వలెనా? హా! కొడుకా, కొడుకా, నేనెంత పాపాత్మురాలనురా? ఓరీ తండ్రీ, రోహితాశ్వా,

సీ. ఒరులు నిన్ నలిపి వేయుదురని నీబాల్య-
మందు నిన్ విడకెత్తుకొందు నేను;
అన్నంబు దాదులు తిన్నగా తినిపించ-
రో యని తినిపించుచుందు నేను;
పనులైనచో చిక్కుపఱతురో యని నీకు
పొదువుగా తలను దువ్వుదును నేను;
అన్యులు కందింతురని యెంచి కడిగి నీ
యొడలు సింగారించుచుందు నేను;
పువ్వులను పెట్టి పెంచిన పోల్కి నాదు
చేతితో అన్నియును నీకు చేసియుంటి:
కటకటా! నాదు చేతులు కాలి పోను!
ఎట్లు చేతితో నిన్ను దహింతు? కొడుక. 161

అయ్యో! కొడుకా, నీకు తగిన ఈడు రాఁగానే నీకు ఈడుజోడైన రాజకన్యను

తెచ్చి, నా చేతితో నిన్ను పెండ్లికొడుకును చేసి, పెండ్లి కళతో ఉన్న నీ మొగము చూచి మురియఁ దలంచితినిరా. అయ్యో! నా కన్నులు కాలి పోను! ఈలాగు ప్రేత కళతో ఉన్న నీ మొగమును చూచు ఘోరదురదృష్టము నా పాడు కన్నులకు కలిగినది. తండ్రీ, చిన్ని కోడలితో కూడ నిన్ను పాన్పెక్కించి ఆ ముచ్చటలు చూడ తలఁచితిని. అయ్యయ్యో! నాయనా, అట్టి నా ఆశలన్నియు కూలి పోఁగా, నిన్ను చితి నెక్కించు దుర్గతి నాకు పట్టినదా? తండ్రీ,

చ. పరిణయమైన వెన్క సతిపైఁ గల మక్కువచేత నన్ననా-
దరణము నీవొనర్తువో కదా యని నామది భీతి చెందుచుం-
దుర; భువనైకసుందర, నినున్ వరియించి, పడంగ నైచికొం-
చరుగును మృత్యువంచు కలనైనను నేఁ దలపోయ నైతిరా. 162

ఓ యముఁడా, దక్షిణదిశయందుండుటచేత దాక్షిణ్యము నీ గుణము కావలెనే; నిర్దాక్షిణ్యముగా ఇట్లు నీ కాలపాశమువంటి సర్పమును పంపి నా చిన్ని కుమారుని ప్రాణములను లాగుకొనుట నీకు ధర్మమౌనా? నీవెట్టి ధర్మరాజవు? ఇది నీధర్మబుద్ధిలోపమా? లేక, లక్ష్యశుద్ధిలోపమా? అయ్యో! ఏ శతవృద్ధుల మీఁదనో వేసిన పాశము గురి తప్పి, ఇటు పడి, నా చిన్నికుమారుని ప్రాణములను లాగి వేసెను కాఁబోలు! అయ్యో! అయ్యో! ఇట్టి ప్రమాదమును తప్పించుటకు ఏ వేల్పులును అడ్డురారా? నా దుఃఖమును తెలిసికొని నా నాయనను రక్షించు దేవతలే లేరా? ఓ తల్లీ, అన్నపూర్ణాదేవీ,

శా. నీనాథుండు ప్రమాదమూలమున విఘ్నేశున్ వధింపంగ నె-
మ్మేనన్ పుట్టిన పిండిబొమ్మ యను కూర్మిన్ చాల దుఃఖించి, ఎ-
ట్లో నీవాతని బ్రహ్మజున్ మనిచి; తయ్యో! గర్భమందేను క
న్నా నీ చిన్నికుమారుఁ; గావవె అపర్ణా, అన్నపూర్ణాసతీ. 163

మ. భృగురాముం డతిభీషణాస్త్రమభిమంత్రింపన్ . కుమారుండు కూ-
లుఁ గదా యంచు బిరాన నీవతనికడ్డున్ వచ్చినావంట! ఇ-
ట్టి గతిన్ గర్భఫలంబుగాఁ గనని పట్టిన్ కాచుకొన్నావు; మా-
న్పఁ గదే మామకగర్భశోకము భవానీ, అన్నపూర్ణావతీ. 164

కుమా—అమ్మా, ఏం నీకీ వెఱ్ఱి? చచ్చిన వాళ్లను దేవతలు రక్షిస్తారా? చచ్చిన వాళ్లు తిరిగి బ్రదికి వస్తారా? లే, లే.

చంద్ర—అయ్యో! అయ్యో! అయ్యో! అట్లయిన, నా రోహితుఁడు నిజముగా నన్ను ఎడఁబాసి పోయినట్లేనా? వానికిని నాకును ఋణము తీఱిపోయినట్లేనా? నా ఆశలన్నియును కాటిలో కలియుటయేనా?...హా! కొడుకా, కొడుకా, కొడుకా,

ఉ. కానక కానకొక్కనినె కంటి నినున్ తొలునోముపంట కాఁ-
గా; నిను నాదు ప్రాపుగను గట్టిగ నామది నమ్మియుండ, న-
న్నా! నను గొడ్డుదానిగ నొనర్చి, ఇటుల్ విడనాడిపోయినా-
వా? నను కన్నతండ్రి, కొడుకా, కొడుకా, కొడుకా, కుమారకా.

అబ్బా! అబ్బా! అబ్బా! (గుండె బాదుకొని మూర్ఛిల్లును.)

కుమా—అయ్యో, పాపం! ఈ అమ్మ ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లింది. కొంచెం నీళ్లు తెచ్చి, మొగం మీఁదఁ జల్లి, సేద దేర్చి, స్మశానానికి తీసుకుపోతాను.

(నిష్క్రమింతురు.)

పంచమాంకము సంపూర్ణము.



శ్రీ

# చిత్రహరిశ్చంద్రీయము.

## షష్ఠాంకము.

[ప్రథమరంగము—కాశి, స్మశానము. హరిశ్చంద్రుఁడు ప్రవేశించును.]

హరి—

ఉ. అక్కట నాదు దేవిని, ప్రియాత్మజుఁ బాసిననుండి కన్నులం-
దెక్కుడు బాష్పవృష్టి యుదయించి, కడున్ జడివాన పోల్కినే
రొక్క విధంబుగా కురియుచుండుట, ఇన్నియు దుర్దినంబులై
నెక్కొనె నాకు నా హృదయనీరజమాకులపాటు చెందఁగన్. 166

అక్కటా! దేవీ, నన్ను విడనాడి ఎంత సంతాపము పొలగుచున్నావో? పుష్పాలలో పెరిగినట్లు పెరిగిన పరమసుకుమారివి, నీవు సేవకావృత్తి చేయ లేక ఎంత బాధచెందుచున్నావో? పట్టమహిషివై ఉన్నప్పటి నీ వెనుకటి అవస్థ ఏమి? ఇప్పటి ఈ అవస్థ ఏమి?...ఆహా! దేవీ,

క. బహుతరభారంబులనున్
వహియించుచు కష్టవృత్తి వర్తిల్లుట నీ
మహిషీనామము మహిలో
అహాహా! ఈయెడల కూడ సార్థకమయ్యెన్. 167

అయ్యో! ఇట్టి నీ అవస్థకే దుఃఖింతునా? లేక, చిన్ని కుమారుని అవస్థకే దుఃఖింతునా?......అయ్యో! కుమారా, రోహితాశ్వా, తల్లిదండ్రుల చాటునను డి సౌఖ్యములను అనుభవించ వలసిన చిన్న ప్రాయములో నీకెట్టి దుర్గతి సంభవించినదిరా? ఈడు జోడు చిన్ని బుడుతలతో కూడి వేడుకగా ఆడుకో వలసిన ఈడువాఁడవు, నీవు దని పాటులలో నలఁగ వలసిన వాఁడవా? సామం

తులును, మంత్రులును, ప్రధానులును, పిన్నవైన నిన్నెంతో పెద్ద చేసి, నీవు తమ యువరాజువని గారవించుచు, నీ ముద్దుమాటలకు తనియుచు, నీ కన్నుసన్నలం బట్టి మెలంగుచుండంగా, వారిపై అధికారము చెల్లింప వలసిన వాండవు, నీవు పరుల పంచను పట్టెండు మెతుకులకై చేరి దాసితనము చేయ వలసి వచ్చెనా?

ఉ. నిన్నను గాక మొన్న వలె నీకొకయించుక పీడె నేత్రము;-
లిన్నగ బుద్ధి పీసుటయె లేదయయో! ఇటువంటి యీడునం-
దన్నము కోసమై కొలువనయ్యెనె యన్యులయొద్ద చిన్ని నా
యన్నరో, చక్రవర్తికి ప్రియాత్మభవుండవుగాంగ పుట్టియున్? 168

......చక్రవర్తియా? అయ్యో! ఇంకెక్కడి చక్రవర్తి? నాకిప్పుడు చక్రవర్తిత్వ మెక్కడిది? అన్యరాజన్యులను అదిమి కప్పములను పుచ్చుకొనుటకును సంకోచించు నాకు స్వామియగు వీరబాహునియోగమున శవవాహకులను అదిమి కాంటి మాడలను పుచ్చుకొను కటిక పని గదా సమకూడినది? శత్రురాజుల కంఠములను యుద్ధములందు ఖండించుటకును వెనుదీయునాకు రాజశిక్షను పొందిన వారి గొంతుకలను తెగనఱకెడి ఉద్యోగము గదా సంప్రాప్తమైనది?...అయ్యో! దేవీ, బ్రదుకు చెడి కటిక పేదవాండనై, కులము చెడి కపజాతి మాలవాండనై, గౌరవము చెడి నీచపు కాంటికాంపరినై ఉన్న నా ఇప్పటి అవస్థలో నీవు నన్ను చూచుటే తటస్థించినయెడల, ఎట్లుగా దుఃఖించి యుందువో! అయ్యో! ఈ శ్మశానమును చూడంగానే నీ గుండె బ్రద్దలై పోవునే! ఇది ఎంతటి భయావహము! ఎంతటి హేయజనకము! ఎంతటి బీభత్సకరము!

సీ. పీనుంగు పెంటలపై నుండి పడిగ తె-
క్కలు కదల్చుచు లేచు గద్దలగమి,
గద్దలగమి చీల్చి గగనంబు నుండి రా-
ల్చంగ క్రింద పడు శవశకలములును,
శవశకలంబులు పఱిగ లోపల పడు-
చుండ బగ్గున మండుచుండు చితులు,

చితులలో మాంసంబు చిటపిట ప్రేలుచున్
కాలంగ పుట్టెడు కమరు కంపు,
కమరు కంపునకున్ దిగు గద్దలగమి
గ్రమ్ము పీనుంగు పెంటలున్, కలిగి సర్వ
గతుల నీస్మశానంబు నిక్కముగను మది-
కిన్ జుగుప్సయు భీతి కల్గించుఁ గాదె. 169

ఓ ఈశ్వరా, అంతటి మహారాజ్యసంపదలనుభవించి, అట్టి సంపదలలో నైతము నిన్ను మఱువక నీ పదధ్యానమునే చేయుచు, ధర్మచింత విడువకుండ కాలము గడపిన నాకు ఇట్టి నీచపు కాటికాఁపరితనము ఏల తెచ్చిపెట్టితివి?... ...నీ భక్తుఁడను గనుకనే కలిగించినావా? కాటికి సేవ చేయుటయు నిన్ను సేవించుటే ఏమో!

శా. భూతప్రేతగణంబులన్ కలిసి యే పొద్దున్ స్మశానంబులో
ప్రీతిన్ నిల్తు: మహాస్మశానమనుచున్ పేరందుకే కాశికిన్;
చేతుల్ మోడ్చిన సేవకుండనగుటన్ చేయించుచున్నావె నా
చేతన్ కాటికి సేవ యీసరణి? కాశీవాస విశ్వేశ్వరా. 170

......నాకిట్టి దుర్గతి పట్టుటకు కారణము నా సత్యదీక్ష తప్ప వేఱొక్కటి కనఁబడకున్నది. ఆహా! నామెడల ధర్మమే కానిదయ్యెనా?......అట్లనుకొనకూడదు. నా సత్యనియమమును పరీక్షించుటకు దేవతలకు ఉద్దేశము పుట్టి కౌశికుని మూలమున పరీక్షించుచున్నారు కాఁబోలు...నాఁడు సభలో నన్ను దానమీయలేదను మని విశ్వామిత్రుఁడు అన్నది మొదలు, ఇట్టి చిక్కులన్నియును పుట్టినవి. ఆ ఒక్క అబద్ధమును ఆడఁగానే చిక్కులన్నియును ఊడఁగొట్టుదునని ఆయన అనియుండెను...అయ్యో! నామెడల ఆ మహామహునికి అంత పంతమేల కలిగెనో?...నాయందు కనికరము కలవాని వలెనే కనఁబడుచుండెనే. నా నోట అసత్యము పలికించిన వెనుకనే కాని ఆయన నామెడల కృపచూపలేక పోవునా?......నా నిమిత్తమున ఎందఱెందఱకు ఎన్నెన్ని బాధలు కలిగినవి? తండ్రిగారా నరకమందు—— అయ్యో! తండ్రీ, మా అందఱకంటె నీ దుర్గతి ఘోరతరమైనది. మేమందఱమును అశాశ్వతములైన ఐహిక

కష్టములను మాత్రమే పొందుచున్నాము; నీకా, పారలౌకికకష్టముల పాలైనావు గదా?...నీ యుసురే తగిలి మేము కష్టముల పాలగుచున్నాము కాఁబోలు...నీవు శపించినట్లు నాకు మాలతనము తప్పినది కాదు...కొడుకు మూలమున దుఃఖింపుమంటివి; ఏమి వచ్చునో అని బెంగగా ఉన్నది......ఆహా! కొడుకు మూలమున దుఃఖమనునరికి నా ఒడలు జల్లుమనినది: మనస్సులో చేయి పెట్టి కలఁచినట్లున్నది...ఏమి సంభవించునో?......నిన్నటి తెల్లవాఱు జామున వచ్చిన కలలో కూడ రోహితునకేమో జరిగినట్లనిపించినది...ఏమి జరిగినదో అది మాత్రము జ్ఞప్తి లేదు......ఆ వెనుక దేవిని తెగనఱుకుట మాననని అంటినఁట!...ఏల అంటినో అదియు జ్ఞప్తి లేదు.........అయ్యో! కలలలో అన్న మాటలైనను తప్పనన్న నియమము కలవాఁడనే, ఇది ఎట్లో తెలియకున్నది.

[దూరమున ఏడుపు వినిపించును.]

ఆహా! దూరమున ఎవరో ఏడ్చుచున్నట్లున్నది. ఈ నడిరాత్రి దహించుటకు శవమును తెచ్చిన నిర్భాగ్యులెవరో, పోయి చూచెదను. (నిష్క్రమించును.)

---

[ద్వితీయరంగము—కాశీ; స్మశానములో వేఱొకచోటు. రోహితాశ్వుని తొడలమీఁద పెట్టుకొని కూరుచుండి చంద్రమతియు ప్రక్కను నిలుచుండి కుమారభట్టును ప్రవేశింతురు.]

చంద్ర—(పెద్ద పెట్టున ఏడ్చుచుండును.)

కుమా—అమ్మా, ఏడవకు; ఊరుకో. నీ ఏడుపు విని నక్కలు అరుస్తూ వున్నవి; చెట్ల మీఁద గద్దలూ రాంబందులూ కదులుతూ వున్నవి. చితి పేర్చు; ఇంతలో రుద్రభట్టు నిప్పు తెస్తాఁడు.

చంద్ర—(గట్టిగా ఏడ్చుచు) అయ్యో! కొడుకా, కొడుకా, కొడుకా, నీకొరకు చితి పేర్చి దానిమీఁద నిన్నెక్కించవలెనఁటరా? తండ్రీ,

ఉ. మెత్తగ నున్న నీసొగసు మేనికి నొప్పి జనించునట్లుగా
ఒత్తునొ యంచు నెంచి, విడకుండిన మొగ్గలనేర్చి, పువ్వులే
ఒత్తుగ సెజ్జ పేర్చెదనయో! కటకుం గల కట్టెలేర్చి, నే-
నిత్తఱి నీకు కాష్ఠమిఁక నెట్లుగ పేర్చుదురా? కుమారకా. 171

ఓ అగ్నిభట్టారకా, నాఁడడవిలో కాలుచిచ్చు రూపముగా వచ్చి నా కొడుకును వాఁత వేసికొన వలెనని ఆశ పడితివి కాఁబోలు? ఇప్పుడు కాఁటి చిచ్చు రూపముగా పొట్టను పెట్టుకొనుచున్నావు...హా! కొడుకా, కొడుకా, కొడుకా,

చ. ముడుకులమీఁద నిన్నిటులె ముందు దినంబుల వేసికొంచు న-
గ్గిడి, యొడలెల్ల తోమి, యొకయించుక వెచ్చని నీరు పోయుచు;
న్నుడుకుల నుండనీయక, నినున్ దహియించెడు నిప్పులందు ని-
య్యెడ పడవేయఁగా వలసెనే? కొడుకా, కొడుకా, అయో! అయో!

(మూర్ఛిల్లును.)

[హరిశ్చంద్రుఁడు ప్రవేశించును.]

కుమా—(తనలో) అయ్యో! ఈమె మూర్ఛిల్లింది......ఎవరిదో అడుగుల చప్పుడు...రుద్రం కాఁబోలు; దీపం పట్టుకు రాలేదేం?...(ప్రకాశముగా) రుద్రం?

హరి—(తనలో) ఎవరీ రుద్రభూమియందు "రుద్ర" మనుచున్నారు? రుద్రజపము చేయ వచ్చిన మాంత్రికులు కారు గదా?......(ప్రకాశముగా) ఎవరది?

కుమా—నువ్వెవ్వరవు?

హరి—నేను వీరబాహునియోగమున ఈ కాఁటిని కాచుచున్నవాఁడను. నీవేల ఈ అర్ధరాత్రమున ఇచ్చటకు వచ్చితివి? ఇప్పుడేడ్చినవారు ఎవరు?

కుమా—ఇదిగో, ఇక్కడ పడి వున్న ఈ అమ్మ.

హరి—నీ కేమి కావలెను?

కుమా—నాకు ఏమీ కాదు. నేను బ్రాహ్మఁడిని; ఈవిడ దాసీది. ఈవిడ కొడుకు మేడమీఁద పాం పొడవఁగా చనిపోయాఁడు; అతగాఁడిని దహనం చెయ్యడానికి తీసుకు వచ్చింది; నేను సాయం వచ్చాను. దుఃఖం పట్ట లేక ఈవిడ మూర్ఛపోయింది.

హరి—అయ్యో, పాపము! ఎంతటి విపత్తు సంభవించినది! ఓ పరమేశ్వరా, ఇట్టి కసుగాయలను దుంచివేయుటలో నీ ఉద్దేశమేమో? ఇఁక ఈమె గర్భశోకమును ఎట్లు తరించునో కదా!...అబ్బాయీ, ఈమె దుఃఖమునోదార్చి ఎట్లయినను వేగముగా దహనకార్యమును చేయింపుము...ఈమె కాఁటి మాడ తెచ్చినదా?

కుమా—కాఁటి మాడా? అయ్యో! ఈవిడ కటిక బీదదే; కాఁటి మాడ ఎక్కడ

నుంచి లేస్తుంది? ఓయీ, కాఁటి కాఁపరీ, దిక్కు మాలిన ఈ బీదరాలి మీఁద దయ తలఁచి, ఈ అనాథప్రేతసంస్కారం నువ్వే చెయ్యించాలి. నీకు చాలా పుణ్యం వస్తుంది.

హరి—బ్రాహ్మణకుమారా, నా శరీరము తప్ప నా దగ్గఱనున్న మఱి ఏదియు నా సొత్తు కాదు. వీరబాహుఁడు కొనుకొన్న దాసుఁడను నేను. కాఁబట్టి నేనెక్కడనుండి తెచ్చి ఈమెకు సహాయము చేయఁగలను?

కుమా—నా వుద్దేశం అది కాదు; కాఁటి మాడ పుచ్చుకోకుండా సహాయం చేసి పెట్టు.

హరి—అయ్యో! అది ఎలాగున వీలగును? దహనమైన ప్రతిశవమునకును ఒక్కొక్క మాడ చొప్పున పుచ్చుకొందునని నా స్వామి వీరబాహునికి మాట ఇచ్చియుంటిని. ఆమాట ఎట్లు తప్పుదును?

కుమా—ఈ మూల ఈ శవం కాల్చారో లేదో ఎవరు చూడ వచ్చారు? ఈ మాత్రం గడిపి పెట్టు.

హరి—అయ్యో! అబ్బాయీ, చిన్నవాఁడవు కాఁబట్టి ఇట్లంటివి గాని, మనము చేయు తప్పు పనులు మనుష్యులు కాకున్న మఱి చూచువారు లేరే అనుకొంటివా?

తే. గీ. క్రింది భూమియు, పైమిన్ను, క్రిందుమీఁదు-
లనక చుట్టును గల గాలి, మనకు లోని
అంతరాత్మయు, లో వెలి నలరు దైవ,-
మనిశమును మన పనులకు సాక్షులు సుమి. 173

కుమా—నువ్వు చెప్పినది నిశ్చయమే కావచ్చును: కాని ఈవిడకింత గొప్ప మేలు చేస్తూ వున్నప్పుడు కొంచెం అసత్యదోషం వస్తే మట్టుకు నష్టమేం?

హరి—అబ్బాయీ, అదియును కూడదు. ఇటు జాగ్రత్తతో వినుః

క. ఒక ధర్మంబునకున్ బా-
ధకమగు వేఱొకటి యెంత ధర్మముగా నె-
న్నిక గన్న, అట్టిదానని-
వలదందురు సుమ్మి ధర్మమార్గజ్ఞులిలన్. 174

ఈ ధర్మమోక్షములతో ఏమి ప్రయోజనము? అయ్యయ్యో, ఈమెను లేపి, ఒంటి చిన్ననగ ఏదో పుచ్చుకొని, అమ్మి కాటి పాడను తెత్తు.

కుమా—ఈవిడ ఒంటను నగలు కూడానా? వస్త్రాలైనా లేవు. కావలిస్తే తేస్తావుంది, చూడు...అదిగో, రుద్రం దీపం పట్టుకు కూడా వస్తున్నాఁడు.

[రుద్రభట్టు దీపము పట్టుకొని ప్రవేశించును.]

చంద్ర—(మూర్ఛనుండి లేచి తనలో) ఆహా! ఏమిది? ఆర్యపుత్రుఁడు ఇంతసేపు నా చెవిలో ఏమో మాటలాడినట్లు అయినది!...నేనిప్పుడు ఎక్కడ ఉన్నాను? (ఇటు నటు చూచి) హా! కొడుకా, కొడుకా, కొడుకా, (అని ఏడ్చును.)

కుమా—ఓయీ కాటి కావలీ, చూచావా?

హరి—చూచినాను. అదిగో, ఆమె మెడను మంగళసూత్రము కనిపించుచున్నదే.

చంద్ర—(తనలో) హా! ఏమిది? ఆర్యపుత్రుఁడే. నా మంగళసూత్రమును గుర్తించువారు మఱెవ్వరు? (బిగ్గరగా ఏడ్చుచు) హా! కొడుకా, కొడుకా, రోహితాశ్వా, అదిగో నాన్నగారు వచ్చినారు. లేచి మాటలాడరా, తండ్రీ. (పెద్ద కేక వేసి మూర్ఛిల్లును.)

హరి—హా! హా! దేవిరయే. (రోహితాశ్వని పైఁబడి) హా! హా! కుమారా, రోహితాశ్వా, హా! మందభాగ్యుఁడను; చెడితినిరా నాయనా. (గట్టిగా కేక వేసి మూర్ఛిల్లును.)

రుద్ర—ఇదేమిటిరా ఈ ఘోరం? ఇతగాఁడు ఈవిడ పెనిమిటి కాఁబోలు. ''దేవీ'' అని అన్నాఁడు. రాజరికం చేసిన వాళ్లై కాఁబోలురా? పాపం, ఎలాంటి కష్టాల పాలయారురా? ఇద్దరూ మూర్ఛపోయారు.

కుమా—ఒరే రుద్రం, నువ్వు వీళ్లని చూస్తూ వుండరా. చుట్టు పక్కల ఎక్కడైనా నీళ్లు దొరుకుతవేమో; వీళ్ల మొగాల మీఁద చల్లడానికి తీసుకు వస్తాను.

(నిష్క్రమించును.)

రుద్ర—అమ్మా, లే. అయ్యా, ఊరడిల్లు.

చంద్ర—(మూర్ఛనుండి లేచి) హా! తండ్రీ, రోహితాశ్వా, ''నాన్నగారేరీ? ఎప్పుడు వత్తురే?'' అని మాటిమాటికిని పలవరించుచుండెడి వాఁడవే. ఇదుగో, నాన్నగారు వచ్చినారు. లేవవేమిరా? తండ్రీ, లేచి కౌఁగిలింపవేమిరా? నాయనా, నాన్నగారన్న ఇంత నిర్లక్ష్యమా నీ కెప్పుడును లేదు గదా; నా తండ్రీ, ఇప్పుడేల లేవవు? ఏల పలుకరింపవు? తండ్రీ, ''నాన్నగారిని మఱల

కలిసికొన్న తరువాత ఒక దినమంతయు చేతిని పట్టుకొని విడువక దగ్గఱనే ఉండు, ''నను చుంటివే; లేచి చేయి పట్టుకోవేమిరా నాయనా...హా! ఆర్యపుత్రా, ఆర్యపుత్రా, మిమ్ములను చివరకు ఇట్టి అవస్థలో చూచుటకా నా పాడు కన్నులు నోచుకొన్నవి? మీకు ఈ కాటికాపరితనమెట్లు వచ్చినది? దౌర్భాగ్యురాలను నేను కులదీపకుఁడగు మన చిన్ని కుమారుని కాటిలో కలుపుదునని ఎఱిఁగి వాని పెద్దనిద్దురకు కాపుండ వచ్చితిరా? ధాత్రీచక్రమంతయు ఏకచ్ఛత్రాధిపత్యముతో ఏలిన మీరిప్పుడు ఈ కాటిపై ఏలుబడి చేయ వలసి వచ్చెనా?

సీ. వందిమాగధుల కైవారంబులయ్యెనే
మీకు నక్కలు వేయు కేకలెల్ల?
మంత్రిప్రధానుల మంతనాలయ్యెనే
కాష్ఠముల్ చిటపిటన్ కాలుధ్వనులు?
నానానృపులొసంగు కానుకలయ్యెనే
జనులు మోయుచు తెచ్చు శవచయంబు?
ఆశ్రితసంచయంబయ్యెనే మీకు పీ-
న్గుల వీకి తినెడి గద్దల కులంబు?
భృత్యసంఘముగా తేలెనే పిశాచ
భూతబేతాళరాక్షసప్రేతగణము?
వెనుకఁ గల రాజ్యపదవి పోయిన, స్మశాన
రాజ్యపదవి గల్గెనె మీకు? ప్రాణనాథ. 175

అయ్యో! ఆర్యపుత్రా, ఆగర్భశ్రీమంతులైన మీకు నేఁడు రాజచిహ్నములన్నియు పోయి, ఇట్టి దౌర్భాగ్యలక్షణములు కాన వచ్చుచున్నవి గదా!

క. లేవేమి తూర్యరవములు?
రావేమీ గజతురంగరథసంఘంబుల్?
మీ వెంట నడుచుచును పా-
రావారై రాజభటులు రారేమిటికిన్? 176

రుద్ర—అమ్మా, ఎందుకో కొందఱు రాజభటులు కాలకౌశికుఁడి వెంట వస్తూ వున్నారు.

[కాలకౌశికవేషముతోఁడి విశ్వామిత్రుఁడు కొందఱు రాజభటులను వెంటఁబెట్టుకొని ప్రవేశించును.]

విశ్వా—(రాజభటులకు చంద్రమతిని చూపి) అదిగో, అదియే నా దాసి; పట్టుకొనుఁడు.

రాజభటులు—(చంద్రమతిని చుట్టు ముట్టుదురు.)

రుద్ర—పాపం! ఈవిడ నెందుకు పట్టుకొన్నారు? ఈవిడ ఏం నేరం చేసింది?

విశ్వా—ఇదిగో, ఇప్పుడే తెలియును, విను. అమ్మీ, ఈ చీర చెంగు ముక్క నీదేనా?

చంద్ర—అయ్యా, నాదే.

విశ్వా—రాజభటులారా, చూడుఁడు. ఈ చెంగు ఈమె చీరకు ఏలాగు అతుకుకొని పోవుచున్నదో! ఈమెయు తనదే అని ఒప్పుకొనుచున్నది...అమ్మీ, ఇది నీవు నాభార్య మెడకు కట్టినావా? లేదా?

చంద్ర—అయ్యా, ఆమె మెడనుండి—

విశ్వా—అదిగో, అక్కఱ లేని మాటలు వద్దు. కట్టినావా? లేదా?

చంద్ర—రక్తము—

విశ్వా—రక్తము మాట కాదు. కట్టినావా? లేదా?

చంద్ర—కట్టినాను.

విశ్వా—కట్టినావు గదా? ఇఁక ఈ పై ప్రశ్నకు ఉన్నది ఉన్నట్టుగా చెప్పు. నా భార్య మెడకు నీ చీర చెంగు కట్టి ఉరి పెట్టి, ఆ వెనుక ఎవరితో నైనను చెప్పి పైకి వచ్చినావా?

చంద్ర—అయ్యో! ఉరి—

విశ్వా—అదిగో, అదిగో, అడిగిన మాటలకే ప్రత్యుత్తరము చెప్ప వలెను. ఉరి మాట నిన్నెవ్వరు అడిగినారు? అది అప్పుడే తేలినది. ఆ వెనుక ఎవ్వరితో నైనను చెప్పి పైకి వచ్చినావా?

చంద్ర—అంతకు ముందే—

విశ్వా—ముందు మాట కాదు; ఆ వెనుక ఎవరితో నైనను చెప్పి పైకి వచ్చినావా?

చంద్ర—చెప్ప లేదు.

విశ్వా—చెప్ప లేదు గదా? నా భార్య గొంతుకకు నీ చీరచెంగుతో ఉరి పోసి ఎవరితోడను చెప్పకుండ పాతితో వచ్చినావా? ఏందుచేత ఇట్టి ఘోరకార్యము చేసినావు?

చంద్ర—అయ్యో! నా మాట చెప్పనియ్యరేల? నేను ఘోరము నెఱుగను. నేనురి పెట్టలేదు. మెడనుండి—

విశ్వా—అదిగో, అదిగో, అక్కర లేని ఆ సోది అంతయు ఎందుకు? నా భార్య నిన్ను బాధ పెట్టుచుండెనా?

చంద్ర—పెట్టుచుండెను.

విశ్వా—నీవు చీరచెంగు ఆమె గొంతుకకు ముడి పెట్టక ముందు నిన్ను కొట్టఁ బోయెనా?

చంద్ర—కొట్ట బోయినది. కొట్టఁబోవుట చేతనే—

విశ్వా—సరే, సరే, కొట్టఁ బోవుట చేతనే నీకు కోపము వచ్చి, ఇంత పని చేసినావు. భటులారా, ఆమెయే ఒప్పుకొనుచున్నది గదా? ఈమెను ధర్మాధికారియొద్దకు తీసికొని రండు. ఇట్టి ఘోరహత్యలు చేసినవారు ఏ నిమిషమున దొరకి నేరము ఋజువగునో ఆ నిమిషమే శిరశ్ఛేదమని ఈ యూరి శాసనము కదా? అట్లే చేయింతము రండు.

[చంద్రమతిని వెంటఁ బెట్టుకొని కాలకౌశిక వేషముతోడి విశ్వామిత్రుఁడును రాజభటులును నిష్క్రమింతురు.]

రుద్ర—అయ్యో! ఇదేమిటి ఈ ఘోరం? ఇదేదో కాలకౌశికుఁడిగాఁడి ఎత్తులాగు వుంది. రాక్షసి ముండ కలహకంటకి ఏమైనా చచ్చింది గదా? నా సాక్ష్యం చంద్రమతమ్మకు ఏమైనా పనికి వస్తుం దేమో, వెళ్తాను.

(నిష్క్రమించును.)

[దొన్నెతో నీళ్లు తెచ్చి కుమారభట్టు ప్రవేశించును.]

కుమా—(హరిశ్చంద్రుని మొగముపై నీళ్లు చల్లుచు) అయ్యా, లేవండి, లేవండి.

హరి—(మూర్ఛ నుండి లేచి) ఏమిది? ఇప్పుడు నేనెక్కడ ఉన్నాను? (లోహితాస్యుని శవమును చూచి) హా! నాయనా, లోహితాస్యా, హా! తండ్రి,

శా. 'నాన్న, నాన్న,' యటంచు నన్ బిలుచుచున్ నా యూరుయుగ్మంబు మీ-
ద న్నిండారు ముదంబెదం దవర నిత్యంబీవు కూర్చుండి, ఎ-
న్నెన్నో చిన్ని నుడుల్ వచింపుదువు; తండ్రీ, నేడు నే వచ్చినన్
కన్నుల్ విప్పవు, పల్కరింప విది బాగా? నాయనా, నాయనా.

హా! తండ్రీ, రోహితాశ్వా, నవ్వు వెన్నెలలతోడ కలకలలాడు కలువలరేని వంటి నీ ముద్దు మొగము మరల ఎన్నఁడు చూతునా అని యిన్నినాళ్లను ఉవ్విళ్లూరుచున్న నాకు, మృత్యుకళలతో వెలవెల పోవుచున్న నీ మొగము చూచుట తటస్థించినదా నాయనా? హా! తండ్రీ, నీకింతటి చిన్నతనములో ఇట్టి పాపపు చావు ఎక్కడనుండి వచ్చినది?

శా. "పారావారపరీతభూవలయమున్ పాలించుచున్ నీవిలన్
నూరేండ్లాయువుతో సుఖింపు" మని మౌనుల్ నిన్ను దీవించి; ర-
వ్వారల్ పల్కిన పల్కులున్ కటకటా! వ్యర్థంబులై పోవ, నీ-
వీరీతిన్ మరణింతువం చెఱుఁగ, నోరీ పుత్రకా, పుత్రకా. 178

అబ్బా! పుత్రా, ఎంత పని చేసినావురా? ఎంతటి ఘోరము జరిగినదిరా? నా కడుపున పుట్టినవాఁడవు నా కన్నులయెదుటనే కడతేరి పోయినావా? నీ చేతుల మీఁదుగా నా ఘటము పోవు అదృష్ట మెన్నఁడో అని కనిపెట్టుకొని ఉండఁగా, ఓ నా తండ్రీ, ఇట్లు నా చేతుల మీఁద నీవు పోవుట న్యాయమా?

క. నీ చేతి నీటిబొట్లకు
వేచుకొనుచు నేను నిల్వ, విడిపించెదవా
నా చేతనె యీ ముద్దుల
కూచీ, కన్నీటిబొట్లు? కూరిమి లేదా? 179

కబూ—అయ్యా, దుఃఖం మానండి.

హరి—అయ్యో! దుఃఖ మెట్లు మానుదును? ఓ నాయనా, నీవు నా కెట్లు మరల దక్కుదువురా?

సీ. పనుదవ్వులనె చూచి "నాన్న వచ్చె" నటంచు
ఎదురుగా నేఁగుదెంచెదవు నీవు;
నా వ్రేలి సందున నీ వ్రేలు చొనిపి లో-
నికి తోడుకొంచు చనెదవు నీవు;
"అమ్మరో, నాన్నగారరుదెంచిరే" అని
పిలిచి తల్లికిని చెప్పెదవు నీవు;
నేను కూర్చుండఁగానే నా యొడిని చేరి
ముదముతో కూరుచుండెదవు నీవు;
కూరుచుండి నేనంత వాక్రుచ్చునట్టి
వింతలెల్లను శ్రద్ధతో విందువీవు:
అక్కటా! ఇట్టి ప్రేమగలట్టి నీదు
మురిపెముల నెట్లు మఱతురా? ముద్దు కొడుక. 180

అయ్యో! కొడుకా, మఱవు వచ్చుటకు నీ ముద్దు చేష్ట లిన్నియు నన్నియును గనుకనా? ఏది తలఁచుకొన్నను దుఃఖము పొంగి పొరలి వచ్చుచున్నది. అయ్యో! నాయనా, నా మనస్సు సంతోషసాగరమున తేలియాడునట్లు అట్టి చేష్టలింక చేయువారు ఎవ్వరురా కుమారా?

సీ. కూరుచుండఁగ వెన్కకును వచ్చి, మెడమీఁది-
కెగఁబ్రాఁకఁ బోవు వారెవ్వరింక?
నిలుచుండ నా ముడుకులు గట్టిగాఁ బట్టి,
ఎత్తుకొమ్మనువార లెవ్వరింక?
పన్నుండ నా కాళ్లపై కెక్కి వచ్చి, ఉ-
య్యాల నూపుమనెడు వారెవ్వరింక?
పైకేగుతఱి కేలు పట్టి, నాతోడ తా-
నే తెంతునను వారలెవ్వరింక?

కథలు చెప్పుమంచును, "ఇది కావలె నది
కావలె" నటంచు కోరుచున్, తా విననవి
యెల్ల చెప్పుచున్, నా కెవ్వరింక మీఁద
ముదము గొల్పెదరయ్యా? ఓ ముద్దు కొడుక? 181

కుమా—అయ్యా, విచారించకు. విచారించి ఏం లాభం?

హరి—అయ్యో! కుమారా, రోహితాశ్వా, నా ఆశలన్నియును నిష్కారణముగా కూలఁద్రోసి పోయితివి గదరా. నీ ముఖమునందలి సహజతేజోవిలాసమును చూచి నీవు వంశకర్తయగు సూర్యుని మించు తేజస్సు గలవాఁడ వగుదువను కొంటిని. చిన్నతనమునందే నీకుఁ గల సుగుణసంపత్తిని చూచి నీవు మూలపురుషులగు ఇక్ష్వాకుప్రముఖులకంటె పేరు వడయుదువనుకొంటిని. ఏ పెద్దవారికిని లేని నీబుద్ధి విశేషము చూచి నీవు బృహస్పతిముఖ్యుల క్రిందు జఱతువని మురియుచుంటిని. ఓరీ నాయనా,

చ. అమితజరాభరంబున మదంగపటుత్వము తగ్గి రాజ్యభా-
రము వహియింప కష్టమగు ప్రాయము నాకొనగూడినంత, ధ-
ర్మము తలపోసి నిన్ భుజము మాఱుచుకొమ్మని చెప్పనుంటి: అ
క్రమముగ నిప్పుడీక్రమముగా నను బాసితివే? కుమారకా. 182

కుమా—అయ్యా, ఊరడిల్లు, ధైర్యం తెచ్చుకో.

హరి—అయ్యో! ధైర్యమునెట్లు తెచ్చుకొందును? ఎంత ప్రయత్నించినను మనస్సు తాళకున్నది. హా! కుమారా, రోహితాశ్వా, సంపూర్ణపౌర్ణిమాచంద్రుని వలె లావణ్యామృతము కురియుచున్న మొగమును, చేరలంతేసివై చెవులకొనలకు తాఁకుచున్న కన్నులును, కాటుక పిక్కల కంటె నల్లనై ఉంగరముల వలె చుట్టుకొనుచున్న ముంగురులును, వెడఁద యురమును, ఎగుభుజములును, సన్నని కౌనును, నీవు,—ఇప్పటికిని నాకన్నులయెదుట నిగనిగలాడు మణిభూషణములతో, జిగజిగలాడు జరతారు దుస్తులతో, ధగధగలాడు రవల తురాయితో, పొడఁగట్టుచున్నావురా నాయనా. కన్నులు మూసికొన్నను అదే రూపు; తెఱచినను అదే రూపు; ఎట్లు తిరిగినను అదే. ఇఁక నిన్నెట్లు మఱచి పోదును?

అయ్యయ్యో! ఎంతటి సుందరుఁడవురా నందనా? ఈ సౌందర్యమెల్లను నీకు కాటిలో కలియుటకే కలిగినదా? ఓ తండ్రీ,

ఉ. నీ సొగసున్ కనుంగొనుచు నిన్ను జనుల్ కడు మెచ్చి, "భేషు! సే-
బా! సితఁడౌ ననంగుఁ!" డని బాస యొనర్చిరి: అట్టి బాసలో
ప్రాసయొ దోసమో తగులఁ బట్టెనొ యిట్టులుగాఁగ నంగముం
బాసితివేమొ! లేనియెడ నల్వురు పెట్టిన దృష్టిదోషమో! 183

ఆహా! నాయనా, అట్టి నీ మోహనరూపము అరణ్యగమనాయాసము చేతను, సేవక జీవనము చేతను, ఇప్పుడు కలిగిన మరణము చేతను, ఎట్లుగా మాఱినదిరా తండ్రీ? అయ్యో! కొడుకా, కాశిలో మరణము చెందిన ఎట్టి ప్రాణికైనను ఈశ్వర సారూప్యము వచ్చునఁట! నీకు మాత్రమట్టిదవసరము లేకుండ, శవరూపము రాక మునుపే శివరూపము పొడమినది గదరా నాయనా!

సీ. బహుదినంబులనుండి పన్నెసంపర్క మె-
న్నఁడు లేమి, నీ నెఱుల్ జడలుకట్టె;
నీళ్లన్న మాట యెన్నాళ్లనుండియు లేమి,
కాయంబు బూడిదన్ కప్పఁబడియె;
తినుటకు కడుపు నిండిన తిండి యుండమి,
అసలు దేహంబు చిక్కి సగమయ్యె;
దేవి కన్నీళ్లెడ తెగకుండ మెండుగా
శిరసుపైఁ బడి గంగ చెలువు దాల్చె;
క్షీరకంఠుఁడ వన్నట్టి చిన్నలోప-
మొకటి యుండంగ, నీదు గొంతుకను పాము
కఱచి గరళకంఠుని చేయఁగా నదియును
తీఱెఁ గద? ఓరి తనయ, ఓరోరి తనయ. 184

హా! పరమేశ్వరా, నా కుమారునికి, పరమసుకుమారునికి చిక్కిన చెక్కులపాలు గాఱు ఈ కోమలశరీరునికి, కలిగిన అకాలఘోరమృత్యువునకు నీకైనను కనికరము కలుగ లేదా?......ఏల కలుగదు? ఓ ఈశ్వరా,

మ. ఉపదేశంబొనరింతు వంట చెవిలో ఓంకారమంత్రంబు తత్-
కృప కాశిన్ మరణించు జీవులకు; నా యీపుత్రు కర్ణంబులో
ఇపు "హో, ఓ!" అను పల్కు తప్ప, మఱి యేరీతి యత్నించినన్
చెవుమా "ఓ" మ్మను పల్కనం గలవొ? కాశీవాసవిశ్వేశ్వరా. 185

ఓ ఈశ్వరా, అద్భుతమహత్త్వభాస్వరా, అనంతకరుణాసాగరా, ఆశ్రితవశంకరా, శంకరా, హరా, నీవు తలఁచుకొన్నయెడల నా కొడుకును రక్షించుట నీకొక కష్టమా? నీవు మున్ను చేసిన అద్భుతములలో ఇది యేపాటిది?

శా. పాముల్ మస్తకమందు, పాములు మెడన్, పాముల్ శరీరంబునన్,
పామింకొక్కటి కేల, నున్నవహహా! బామేమియున్ లేని నీ-
వేమీ పాములవాని మాత్రముగ నేఁడీమాత్రపున్ కాటు ని-
న్నీ! మాన్పంగను లేక పోయెదవె? కాశీవాసవిశ్వేశ్వరా. 186

[దూరమున కాలకౌశికవేషముతోడ విశ్వామిత్రుఁడు ప్రవేశించును.]

విశ్వా—(తనలో) నా అలౌకికపు మాయ ఉపయోగింప వలసిన అవసరము లేకుండ వట్టి లౌకికపు మాయల వలననే చంద్రమతికి శిక్ష కలిగించినాను. దంతఘాతుఁడు చచ్చినప్పుడు కలహాకంటకీరూపము పోయి వాని స్వాభావికరాక్షసాకారము రానీయక పోవుటలోనే నా తపఃఫలము కొంచెము వినియోగించి పాడుచేయ వలసి వచ్చినది... అయ్యో! ఈ వంతమును పూనుకొన్నది మొదలు కలిగించిన అద్భుతములన్నిటికిని కొంచెము ఇంచుమించుగా నా తపస్సులో సగము వ్యయమై పోయినది. ఇప్పుడు నేను ఓడి పోయినయెడల, మిగిలిన సగమునకును నీళ్లు ధారయే. (ముందుకు పరిక్రమించును.)

హరి—ఓ మృత్యుంజయా, నీవు నా మొఱ్ఱ విని నా చిన్ని కుమారుని రక్షింతువేమో అని చూచుచుంటిని. అయ్యో! నీకేల దయ రాకున్నది? నీ కరుణయు, మహిమయు అనంతములు గదా!

మ. కడు లేఁ బ్రాయమునందె చావుగల మార్కండేయుప్రాణంబులన్
వెడలన్ లాగ యముండు కింకరులతో విచ్చేసి పాశంబు పై

పడవేయన్, కని యంతకాంతకుఁడవై బాలున్ కృపన్ బ్రోవవే?
చెడు చావొందిన నా సుతున్ మనుపు కాశీవాసవిశ్వేశ్వరా. 187

శా. కీలాజాలము మింటికంటుకొను భంగిన్ కాలకూటంబు లో-
కాళిన్ మ్రింగఁ దొడంగ, దానిని అనాయాసంబుగా మ్రింగి, ఆ
వేళన్ మృత్యువునున్ జయించితివి కావే? నా కుమారున్ కృపా-
శీలంబొప్పఁగ కావఁగాఁ గదవె కాశీవాసవిశ్వేశ్వరా. 188

కుమా—అయ్యా! నీ భార్య ఎక్కడికో వెళ్ళింది. ఆవిడ వచ్చే లోపుగా ఈపిల్లవాఁడి దహనకార్యం కానిస్తే ఆవిడ దుఃఖం కొంచెం తగ్గుతుంది. మొగవాఁడవు నువ్వే ఇలాగు ఏడుస్తూ కూర్చుంటే ఎలాగు? లే.

హరి—అయ్యా, బ్రాహ్మణకుమారా, అతిదుఃఖముచేత నా గుండె రాయియే అయిపోయినది. లేకున్నయెడల, ఈ పాటికి పగిలి ఉండదా? నాకు లోకముపై నిరక్తి పొడమినది. ఈ లోకపు శోకములు నన్నింక కలంపఁజాలవన్న మొండిధైర్యమొకటి పుట్టుకొని వచ్చుచున్నది......నా కుమారుని దహింపవలెనా? కాఁటి మాడ పుచ్చుకొనక నేనెట్లా పనిచేయుదును? దేవి పుస్తెలను అమ్మి సొమ్ము తెచ్చుటకే కాఁబోలు వెళ్ళినది.

కుమా—అయ్యా, ఇతఁడు నీ కొడుకే కదా? ఇతఁడిని దహించడానికి కూడా కాఁటి మాడ కావాలని పట్టు పడ్తావా? వీరబాహుఁడికి తెలిసినా నిన్నేమీ అనఁడే?

హరి—అనునో అనఁడో అన్న ఆలోచన ఏల? మాడ పుచ్చుకొనకిదియు ఎవ్వరినైనను దహించ నీయనన్న నేను ఆ మాట ఎట్లు దాటుదును? సత్యభయముచేతనే కాకున్నయెడల, నా కొడుకే బ్రదికి యుండునేమో! వీఁడు తుమ్మినప్పుడు వాడుక చొప్పున "చిరంజీవ" యనినయెడల తరువాత నా మాట ఎక్కడ అసత్యమగునో అని అనుమానించి మానితిని. ఆ అనుమానమే పెనుభూతమై నా తనయుని ఈ రీతిగా వాతను వేసికొనెను. నేనిప్పుడు మాడ నెట్లు పుచ్చుకొనకుందును?

క. అకటకట! కుమారక, కొలఁ-
తకు మించినయట్టి సకలధాత్రీస్థలి త-

వృక నీకే వలసిన నే-
నొక మూఁడడుగులు నొసంగ నోపనయితినా? 189

విశ్వా—నేను పంపినందుకు కుమారభట్టు వని తిన్నగానే నడిపినాఁడు గాని ఫలించ లేదు. ఇఁక నేను వెళ్లెదను. (దగ్గఱకు చేరి) ఎవరక్కడ?...ఓయీ హరిశ్చంద్రా, పాపము, నీ కొడుకునకు పాము కఱచినదఁట. నీ సంబంధుల మీఁద నేను దయ తలఁచవలసిన కారణము లేక పోయినను, నీ కొడుకును మంత్రము వేసి బ్రదికించుటకు వచ్చినాను.

కుమా—అయ్యా, హరిశ్చంద్రా, ఈయన గొప్ప మంత్రగాఁడు. తేలు కఱచిన వాళ్లను ఈయన, "నిన్ను తేలు కఱవ లేదు గదా" అని అడుగుతాఁడు. "లే" దని వాళ్లు అనఁగానే బాధ పోతుంది; నవ్వుతూ పోతారు. అలాగే పాం కఱచినప్పుడు వాళ్ల దగ్గఱ బంధువులలో ఎవరినో "మీ వాఁడిని పాం కఱచిందా?" అని ఈయన అడుగుతాఁడు. "లే" దని వాళ్లు అనఁగానే పాం కఱచి చచ్చిన వాఁడు బ్రదికి వేస్తాఁడు. ఎన్నో మార్లు నా కళ్లారా చూచాను.

విశ్వా—హరిశ్చంద్రా, నీ కొడుకును పాము కఱచినదా?

హరి—స్వామీ. కఱచెనని వింటిని.

విశ్వా—ఛీ, ఛీ, ఇట్లయినయెడల నీ కొడుకు బ్రదుకఁడు. పోనీ, నీ కొడుకు చని పోయెనా?

హరి—స్వామీ, నా దౌర్భాగ్యము చేత చనిపోయెను. నేనెట్లబద్ధమాడఁ గలను?

విశ్వా—మఱల అదే మాటా? చని పోయెనో, మూర్ఛ పోయెనో, నీకేమి తెలియును? కాఁబట్టి చని పో లేదనినను అసత్యము కాదు. ఆ మాట నీవనఁగానే ఇతఁడు బ్రతుకును గనుక చనిపోయెననుటయే అసత్యము. గనుక తిన్నగా ఆలోచించుకొని చెప్పు...నీకొడుకు చనిపోయెనా?

హరి—స్వామీ, ఇప్పటి వఱకును చనిపోయె ననియే నేననుకొనుచున్నాను.

విశ్వా—నీ కొడుకు బ్రదుక వలెనన్న కోరిక నీకున్నదా?

హరి—స్వామీ, ఆ మాట నన్ను వేఱుగా అడుగ వలెనా?

విశ్వా—అట్లయినయెడల, నీ కొడుకు చావ లేదని అనుము.

హరి—అయ్యా, కౌశికా, నా సత్యదీక్షను గుఱించి నా దేవిని కొనుక్కొన్న నీవు ఎఱుఁగవా? కాఁబట్టి, నేనసత్యమాడ నవసరము లేని మార్గమేదైనను ఉన్నయెడల ఆలోచింపుఁడు.

విశ్వా—పోనీ, నీ కొడుకు చచ్చెనో లేదో తెలియదనియైనను అనుము.

హరి—కుమారుఁడు మరణించెనని అనుకొనుచున్న నేనది మాత్రము ఎట్లందును?

విశ్వా—అట్లయినయెడల నాకు మఱి ఏయుపాయమును తెలియదు. హరిశ్చంద్రా, కొడుకు బ్రదుకనై ఉండఁగా ఏల నిష్కారణముగా పాడు చేసికొందువు? ఆలోచించుకొమ్ము.

హరి—అయ్యా, కుమారునిపై ఆశ ఎట్లును విడువనే విడిచితిని. సత్యమును కూడ ఎట్లు విడుచుకొందును?

కుమా—అదిగో, ఎవ్వరో కొందఱు జనులు పెద్ద మూకగా వచ్చుచున్నారు.

విశ్వా—(దూరముగా పోయి ప్రక్కకు తొలఁగియుండును.)

[వీరబాహుఁడు చంద్రమతితోను రాజభటులతోను జనుల
సమూహముతోను ప్రవేశించును.]

వీర—ఓ అరిసందయ్యా, ఇదిగో ఈ ఆఁడ మనిసికి తలకొట్టియ్యాలని రాజు గోరి ఆగె అయింది. ఇదిగో, నరికెయ్యి, (కత్తి చేతికిచ్చును.)

హరి—(కత్తి పుచ్చుకొని) హా! ఏమిది? ఏమిది? దేవీ, ఇదేమి? ఏ కారణముచేత నీవు ఇట్టి శిక్షకు పాత్రురాలవు కావలసి వచ్చినది?

వీర—ఏటి? ఈయిడ నీ బారియా? అయ్యో! పాపం! నరకొల్సి ఒచ్చిందే!

చంద్ర—ఆర్యపుత్రా, విచారింపకుఁడు. కాలకౌశికుని భార్య నన్ను కొట్టఁబోయి పడి చావఁగా, ఆమెను చంపిన నేరము కొన్ని కారణములచేత నామీఁద ఋజువైనది. నాదుఃఖములన్నియు మీ చేతితో కలిగెడు పుణ్యపు చావు వలన అంతమగునన్న సంగతి విన్నప్పటినుండియు నేను వెనుకటి విచారములన్నియు విడిచి సంతోషించుచున్నాను. మీరిఁక ఆలస్యము చేయక నన్ను రాజాజ్ఞను బట్టి శిరశ్ఛేదము చేయుఁడు. నేనింక వెంటనే పోయి, స్వర్గములో ఉన్న మన చిన్ని కుమారుని కలిసి కొనెదను.

హరి—హా! ఈశ్వరా, నీకు మామీఁద కరుణ తప్పినదేమో అని అనుమానించినాను గాని, ఇట్లు సంపూర్ణకటాక్షము నిలిచి ఉన్నదన్న సంగతి ఎఱుఁగ లేక పోయితిని; నా అజ్ఞానమును, అపరాధమును సహింపుము......దేవీ, నిన్ను చేతులార నఱుక వలసి నందుకు నేను విచారింప వలసినదానికి మాఱుగా, ఇట్లు సంతోషింపుచున్నానేమని నీవు ఆశ్చర్యపడుచున్నట్లు కనఁబడుచున్నావు.

నీవు నా అర్ధశరీరిణివే; నా బహిఃప్రాణమవే. అయినను కుమారుని చావు వలన కలిగిన దుఃఖము నణఁచుకొనుటలో నామనస్సునందు విరక్తితో కూడిన మొండి ధైర్య మొకటి పుట్టినది. సత్యమును చక్కఁగా పరిశీలించి చూడఁగా చావనఁగా ఏమి? మనుష్యుని జీవనమనఁగా ఏమి?

తేటగీతిమాలిక.

వసుధపై జనియించిన వారిలోన
పుట్టిన క్షణంబునుండియు గిట్టినట్టి
క్షణము వఱ కెల్ల వారు సంసారయాత్ర
సలుపుచున్నట్టి బాటసారులె గనుకను,
నేఁడొ రేపొ ఎల్లుండియో నిశ్చయముగ
పయనమును ముగియించును ప్రతిమనుజుఁడు;
ముందువెనుకలె కాని ఈ మందియందు
అందఱును యాత్ర చాలించి యరుగువారే.
ఎట్టి వారును పుట్టుట గిట్టుకొఱకె;
ఱట్టి కట్టి యూగెడు వారలొకరు లేరు:
మృత్యువెల్లరన్ తల పట్టి యీడ్చి, యీడ్చి,
చిట్టచివరకు తన పొట్టఁ బెట్టుకొనును.
చావనఁగనేమి? చచ్చిన జనుఁడు మిగిలి-
నట్టి ముగురికి మూన్నాళ్లు నగపడమి యె:
మూఁడు నాళ్లను కన్నులు మూసికొనఁగ
కలిసికొందు రందఱు కూడ కాఁటియందు.
చెట్టుపై రాత్రి చేరిన పిట్టలు విడి-
పోవె వేకువ? అట్టిదే చావు కూడ;
కట్టియలు రెండు నదిలోన కలిసి, కొంత
సాగి, అట వీడు: అట్టిదే చావు కూడ.

జననమరణముల్ భగవదిచ్ఛావిలాస-
ములుగ తలఁచి జనించిన మోదమును, గ-
తించిన విషాదమును లేక తిరుగునట్టి
జనులె తత్త్వ మెఱింగిన జ్ఞానధనులు. 190

దేవీ, ఇది స్మశానవైరాగ్యమని నీకు నవ్వు పుట్ట వచ్చును గాని ఇది నాకు నిశ్చయముగా తోచినది; జన్మమున్నన్ని నాళ్లును నా మనస్సులో నాటుకొని ఉండ వలసినది.

చంద్ర—అయ్యో! ఆర్యపుత్రా, నవ్వ వచ్చుటకు నేను మీ హృదయము నెఱుఁగని దాననా? కొడుకు చావువలనను, అన్యాయముగా నామీఁద పడిన అపనింద వలనను, నాకును శోకముపై విరక్తి పుట్టి, ఈ ప్రపంచమంతయు మాయయే అని బోధ పడినది. నన్ను చంప వలసి వచ్చినది కదా అని మీరెక్కడ దుఃఖింతురో అని మాత్రము భయపడుచుంటిని. ఇప్పుడు నాకు భయము గాని విచారము గాని లేక మనస్సు నిష్కల్మషముగా ఉన్నది.

హరి—దేవీ, నేను నీకు కలిగిన ఆపదకై విచారింపకుండుటకు కారణము తెలిసినది కదా? ఇఁక సంతోషించుటకు కారణమేమంటివేని,—నిన్నటి వేకువ నాకు ఒక కల వచ్చి, ఆకలలో నిన్ను తెగనఱికెదనన్నానఁట! కలలలో ఆడిన మాటనైనను తప్పనన్న దీక్షగల నేను, నీయెడల క్రూరత అవసరము లేకుండ ఎట్లా మాట నిలువఁ బెట్టుకొనఁ గలనా అని విచారించుచుండఁగా, రాజదండనమిష చేత అట్టి వీలు కలిగినది.

చంద్ర—ఆర్యపుత్రా, ఇప్పుడు నాజన్మము ధన్యమైనది. నేను మీకు భార్యనై ఉండి, అదృష్టకాలమున సౌఖ్యములనుభవించుటకే కాని, కష్టకాలమున ఏ విధముగాను పనికి రాక పోతిని గదా అని విచారముతో లోలోపల కుళ్లుచుండఁగా, ఈ విధముగా నాశరీరము వలన మీకయ్యెడి ప్రయోజనమును విని సంతోషము పట్ట లేకున్నాను. చూడుఁడు: నా శరీరము ఎట్లు పులకరించినదో! నేను చేసిన భాగ్యము మఱి ఎవ్వరును చేసి ఉండరు. చిన్ని కుమారుఁడు చనిపోయినాఁడన్న విచారము లేకుండ వానిని వెంటనే కలిసికొనఁ గలుగుదును. మీ చేతి పుణ్యపు చావు లభింపనై ఉన్నది; నా చావు వలన మీ మాట నిలువఁ బడును......ఆర్యపుత్రా, మఱి సంకోచింపకుఁడు; ఆలస్యము చేయకుఁడు; నా శిరస్సు తెగనఱుకుఁడు......మీ చేతి చావు పొందుటవలన

కలుగఁ జేయు పుణ్యము మూలమున మీకే నేను జన్మజన్మమునకు భార్య నగుదును గాక! మీ కొఱకు నేనును లోహితాస్యుఁడును స్వర్గమున కనిపెట్టుకొని యుందుము. మీరు నూరేండ్లును సుఖముగా వర్ధిల్లుదురు గాక!......ఆర్యపుత్రా, ఇదిగో కన్నులు మూసికొని పార్వతీ దేవిని ప్రార్థించెదను. నా ప్రార్థన కాఁగానే నా శిరస్సు ఖండింపుఁడు. (కన్నులు మూసికొని)

మ. ఇదిగో, నా కడసారి మ్రొక్కు గొను తల్లీ, తొల్లి నీ రీతినే
బ్రదుకుం బాసినయప్పుడే కరణిఁగా పైజన్మమందీవు నీ
హృదయేశున్ కలియంగఁ జాలితివొ, అట్లే నన్ను నానాథుఁ గూ-
ర్పఁ దలంపం గదె మీఁది మేనున, అపర్ణా, అన్నపూర్ణాసతీ. 191

ఆర్యపుత్రా, ఎల్లదైవములకంటెను మీరే నా కెక్కువ దైవములరు; మీకిదిగో నా కడసారి మ్రొక్కు......ఇఁక ఖండింపుఁడు. (తల ఒగ్గును.)

హరి—ఓ ఈశ్వరా! నీ అఘటనాఘటనసామర్థ్యము వలన నేను నా చేతులతో నా దేవిని విచారము లేకుండ వధింప వలసిన యవస్థ సంభవించినది గదా! నీ ఆనతిని కాదనక నెఱవేర్చుచున్నాను. ఇఁక మీఁద నీవే నాకు దిక్కు.

మ. తొలి దేహంబును బాసినట్టి సతి పొందున్ క్రమ్మఱన్ పొందఁగా
తలఁపున్ పూని, తపంబు చేసి, యటులే తన్వంగి నంగంబులో-
పలనే నిల్పుకొనంగం జాలితి గదా! ప్రాణంబులం బాయు నా
చెలువన్ నన్నును క్రమ్మఱన్ కలుపు కాశీవాసవిశ్వేశ్వరా. 192

[హరిశ్చంద్రుఁడు కత్తి యెత్తఁగా విశ్వామిత్రుఁడు నిజస్వరూపముతో సంభ్రమమున సమీపించి చేయి పట్టుకొనును.]

విశ్వా—హరిశ్చంద్రా, ఏమిది? ఏల ఈ సాహసము?

హరి—ఓహో! విశ్వామిత్రమునీశ్వరులు! స్వామీ, నమస్కారము. మీరేల నా పూనికకు అడ్డు వచ్చెదరు? నా చేయి వదలుఁడు. నక్షత్రకుఁడు ఋణధనము తెచ్చి ఇయ్యలేదా ఏమి?

విశ్వా—రాజా, ఋణము మాటకేమి? ఈమెనేల వధింపఁ బూనుకొంటివి? భార్యను నఱుకుకొను చండాలుఁడు ఎందైనను ఉండునా? మానుము, మానుము.

చంద్ర—(కన్నులు విప్పి) మునీశ్వరా, నమస్కారము. స్వామీ, నా నాథుని పూనికను మాన్పుఁడు. ఆయన చేతి పవిత్రపు చావు వచ్చునని ఆశించుకొని ఉన్నాను. నా ఆశను వమ్ముచేయవద్దు. కొడుకు మరణించి ఉన్న నాకు ఇఁక ఈ తనువుతో ఏమి ప్రయోజనము?

విశ్వా—హరిశ్చంద్రా, కొడుకు మరణించుటచేత కలిగిన విరక్తి నిన్ను తలతిక్క పనులకు దించుచున్నదా? మానుము; నీ కుమారుని బ్రదికించెదను.

హరి—స్వామీ, కుమారుని బ్రదికించినను బ్రదికింపక పోయినను, నేను ఈమె శిరస్సు ఖండించుట ఎట్లును తప్పదు. ఇది నిశ్చయము; నా చేయి వదలుఁడు.

విశ్వా—హరిశ్చంద్రా, నీ సాహసము నాకు భయము కలిగించుచున్నది. నీవు ఇప్పుడు నీ భార్యను చంపినయెడల, ఆపాపము వచ్చి నన్ను చుట్టుకొనును. నేను అప్పుకొఱకు బాధించుట చేతనే కదా నీకు ఈ అవస్థ తటస్థించినది? కాఁబట్టి నిన్ను నేను బ్రతిమాలుకొనుచున్నాను. నీవు ఈ ఘోరపాపకార్యమును మానినయెడల నీ కుమారుని బ్రదికించుటయే కాక, నీ తండ్రిని నరకమునుండి రప్పించి స్వర్గమునకు పంపెదను.

హరి—స్వామీ, మీ ఆనతి నెఱవేర్ప లేక పోయినందుకు నన్ను క్షమింపుఁడు. ఇఁక నా పూనికకు అడ్డు రాకుఁడు. (చేయి వదలించుకొని) దేవీ, కన్నులు మూసికొమ్ము; ఇదిగో, నఱుకుచున్నాను.

విశ్వా—రాజా, అట్లయినయెడల నఱుకుము. చేఁతనగునేమో చూతము.

హరి—ఇదిగో, నఱుకుచున్నాను. (నఱుకఁగా నఱుకు పడక పోవును.)...ఆహా! మునీశ్వరా, మీ మాయాప్రభావముచేత నఱుకు పడనీయక నాకసత్యదోషము కట్టఁ జూచుచున్నారా?...అయ్యో! ఏమి చేయుదును? నా సత్యమెట్లు నిల్చును?...ఓ ఈశ్వరా, ఏమి సాధనము?...................కానిండు, ఇట్లు చేసెదను.

శా. నానాధర్మములందు సత్యముసకౌన్నత్యంబు కద్దేనియున్,
నేనెల్లప్పుడు సత్యమున్ విడవనేనిన్, నిత్యమున్ నాపద-
ధ్యానంబేమఱకుండ నన్ గొలుచునిల్లాలీమె యౌనేని, ఎ-
ల్లేనిన్ నా కరవాల మీ పతి గళం బీమాఱు ఖండించుతన్. 193

[హరిశ్చంద్రుఁడు కత్తి యెత్తఁగా మఱల విశ్వామిత్రుఁడు
చేయి పట్టుకొనును.]

విశ్వా—హరిశ్చంద్రా, ఆఁగు, ఆఁగు...హా! భగవంతుఁడా, ఓడి పోయితిని; ఓడి పోయితిని...పంతమా నెగ్గినది కాదు; తపఃఫలమా పూర్ణముగా వ్యయమై పోయినది. అన్ని విధములను చెడితిని, చెడితిని, చెడితిని.

హరి—స్వామీ, ఇది యేమి? నా చేయి వదలుఁడు. నా కార్యమునకు ఏల అడ్డు తగిలినారు? మీ పంతమునకును నా కార్యమునకును ఏమి సంబంధము?

విశ్వా—హరిశ్చంద్రా, నిన్ను నేఁటి ఉదయము లోపుగా బొంకింతునని వశిష్ఠునితో పంతము పట్టినాను. ఎన్ని విధములను ప్రయత్నించినను బొంకక సత్యము కాపాడుకొన్నావు. పరీక్ష ఇఁక తీఱినది. నీకు ఇంతకు ముందు వచ్చిన చిక్కులన్నియు నేను తెచ్చినవే. ఇప్పటి ఈ చిక్కును నేను కల్పించినదే. చంద్రమతి నేరము చేసి యుండ లేదు. నా పంతము పోయి నేనోడినానని ఒప్పుకొనుచున్నాను. ఇఁక కత్తిని వదలుము.

హరి—స్వామీ, మీ పంతము పోవుటయు నిల్చుటయు నాకేల? నా సత్యమును నిలుపఁ బెట్టుకొనుట మాత్రమే నాకు కావలెను. మఱి అడ్డురాక నా కత్తిని విడువుఁడు.

విశ్వా—అయ్యో! ఇంకను చంద్రమతిని నఱికెదననుచున్నావా?...నా మాటలు నమ్మకున్నావు కాఁబోలు. అయినయెడల, ఋజువు పఱిచెదనుందుము......హా! భగవంతుఁడా, భగవంతుఁడా, ఇఁక వశిష్ఠునియెదుట సిగ్గు లేక ఓడినానని ఒప్పుకొన వలెను...అహా! ఎంతటి అవస్థ కలిగెను! ఇఁక నాకు నూయియో గోయియో తప్పదు...ఓ ఇంద్రాదిదేవతలారా, ఓ కశ్యపాదిమౌనులారా, మీరు ఆకాశమునుండి నా ఓటమిని, వశిష్ఠుని గెలుపును చూతురుగాని రండు... ఓ వశిష్ఠా, నీ శిష్యుని జయమునకు సంతోషించెదవు గాని రమ్ము.

[ఆకాశమున విమానములమీఁద దేవతలును మౌనులును చూచుచుండఁగా నేలను వశిష్ఠుఁడు ప్రవేశించును.]

వశిష్ఠుఁడు—

ఉ. పంతము తీర రేదనుచు ఘానములోపల నోయి కౌశికా,
చింతిలఁ బోకుమీ; గెలుపు చేకుతెనంచును గర్వబుద్ధితో

గంతువు నీకు సిగ్గు గలుగంగ నొనర్చెడి వాఁడఁ గాను;—ఏ-
మంత ప్రయోజకత్వము జయంబును పొందుట కేను చూపితిన్? 194

హరి—వశిష్ఠమహామునీశ్వరా, శిష్యుఁడు మ్రొక్కుచున్నాఁడు.

వశి—రాజా, జయముచే వర్ధిల్లుము.

తే. గీ. నిత్యసత్యహరిశ్చంద్ర, నీ మొగంబు-
నరయుటకు కూడ నాకు సిగ్గయ్యె నేఁడు;
పంతమను మిషచేతను పరమబాధ
పాలుగా నిన్ను జేసిన పాపినగుట. 195

చంద్ర—మునివర్యా, నమస్కారము.

వశి—దీర్ఘసుమంగళివి కమ్ము.

విశ్వా—రాజా, పంతము నిశ్చయమైనది గదా? ఈ చిక్కు నేను కల్పించిననే గనుక, ఇఁక కత్తిని విడువుము.

హరి—స్వామీ, మీ మాట నమ్మక నేను కత్తి విడువననుట లేదు. చిక్కు ఎవ్వరు కల్పించినదైనను నేను నఱుకుట మాత్రము తప్పదు.

విశ్వా—ఆహా! ఆహా! ఈ ఉపాయమునకు లొంగినావు కావా? ఆహా! ఎంత సత్యవంతుఁడవు రాజా! నిన్ను ప్రశంసింప నా తరము కాదు. ప్రభునియోగము గడుప వలసిన వాఁడవని కదా ఈమెను నఱికెదననుచున్నావు? ఓ వీరబాహూ, ఈమెను నఱుక నక్కర లేదనుము.

వీర—అరినందరరాజా, నంపనక్కర నేదయ్యా, నీ పుణ్యం ఉంటాది. ఈయిడిని ఒగ్గెయ్యి.

హరి—స్వామీ, ప్రభునియోగమును చూచి మాత్రమే నేను నఱికెదననుచుండుట లేదు. ఈమె మెడను ఖండించెదనని కలలో నేనంటిని. ఆ మాట తప్పలేను.

విశ్వా—ఇందాఁకనే నఱికినావు కదా?

హరి—వట్టి నఱుకుట కాదు; తెగనఱుక వలెను.

విశ్వా—అట్లయినయెడల, తెగనఱుకక మానవా ఏమి?...ఆహా! ఆహా! ఈ చివరి కిటుకునకును పడినావు కావు. నేను నీకు సర్వవిధములను ఓడినాను, ఓడినాను,

మున్నూటికిని ఓడినాను. ఇఁక పరీక్షలను నిశ్చయముగా మానుచున్నాను. ఓడినను, ఓడినానన్న విచారము లేదు. నీ పవిత్ర చరిత్రకు నా మనస్సులో సంతోషము పొంగి పొరలి ఇముడక వెలికుబ్బుచున్నది. ఏదీ? ఏదీ? నా సమ్మోదము తీఱ నిన్నొక్క సారి కౌఁగిలించుకొననిమ్ము.

హరి—స్వామీ, ముట్టకూడని చండాలుఁడనేమో?

విశ్వా—నీ వెక్కడి చండాలుఁడవు. అంత తలక్రిందులుగా తపస్సు చేసియు నేను సంపాదింపలేని బ్రాహ్మణ్యమును నీ సత్యదీక్ష వలన సాధింపఁగలిగినావు. నీవు బ్రాహ్మణులలో బ్రాహ్మణుఁడవు; పవిత్రులలో పవిత్రుఁడవు; సచ్చరిత్రులలో సచ్చరిత్రుఁడవు. ఏమి వసిష్ఠా?

వసి—నిశ్చయము వత్సా, నీవు బ్రాహ్మణాగ్రగణ్యుఁడవు.

ఉ. సాంద్రయశఃప్రభావిజితచంద్ర, నృపాలకచంద్ర, ఓ హరి-
శ్చంద్ర, భవద్గురుండనయి సన్నుతికెక్కితి; నీదు సత్యని-
ష్ఠం ద్రిజగంబులెల్ల పొగడంగఁ దొడంగె; నినుం గనంగ దే-
వేంద్రముఖాఖిలామరులదే యరుదెంచిరి మింటిత్రోవపై. 196

విశ్వా—హరిశ్చంద్రా, వీరబాహుని మూలమున నీకు మాలతనము వచ్చినదని సంశయించుచున్నావు కాఁబోలు. వీరబాహుఁడు మాలవాఁడు కాఁడు. వేఱొక శాపము చేత ఇట్లు వచ్చిన యముఁడు. నీ కుమారుని ప్రాణములను తిరిగి ఇచ్చుటతోడనే అతని శాపమునకు అంతము కలుగును. ఓ వీరబాహూ, నీ సహజ లోకమును పొందుము.

[మీఁది నుండి విమానము రాఁగా వీరబాహుఁడు ఎక్కి పైకి నిష్క్రమించును. రోహితాశ్వుఁడు చప్పున లేచి కూరుచుండును.]

హరి—హా! హా! ఏమిది? నా కన్నులతో చూచినదానిని కూడ నమ్మలేకున్నాను. ఓ దేవీ, దేవీ, లే లే; మన పుత్రుఁడు లేచినాఁడు; ఇదిగో, మన ముద్దులయ్య బ్రతికినాఁడు; మన కన్నతండ్రి మఱల మన కన్నుల పండువు చేయుచున్నాఁడు.

చంద్ర—ఆహా! ఏమీ? ఏమీ? ఆర్యపుత్రా, సంతోషము పట్టలేకున్నాను...కన్నులు తిరుగుచున్నవి...మతి తప్పుచున్నది......ఓ నా ముద్దు తండ్రీ, రోహితా

శ్వా, రారా నాయనా, నన్ను కన్న తండ్రీ, రారా; వచ్చి నన్ను గట్టిగా కట్టుకొమ్ము. తండ్రీ, తండ్రీ,—

రోహి—(నాలుగు దిక్కులను బెదరు చూపులను చూచి పరుగున వచ్చి చంద్రమతిని కౌఁగిలించుకొని) అమ్మా, నేనిప్పుడు ఎక్కడ ఉన్నానే? వీరందఱును ఎవ్వరు? ఇక్కడకు ఏల వచ్చినాము?

చంద్ర—తండ్రీ, అరుగో మీ నాన్నగారు; వారినడుగుము.

రోహి—నాన్నగారే, నాన్నగారే, నా నాన్నగారేరీ?...హా! నాన్నా, ఎన్నాళ్లకు మిమ్ము చూడఁ గలిగినాను? (మీఁద పడును.)

హరి—హా! తండ్రీ,—(మాట రాక బిగ్గరగా కౌఁగిలించుకొనును.)

రోహి—నాన్నగారూ, ఏడ్చుచున్నారేల? మమ్ము కలిసికొనుట వలన మఱల మీకు ఏమియు చిక్కులు రావు గదా? అట్లయినయెడల, మఱల కాలకౌశికునియొద్దకే పోయెదము.

హరి—(గద్గదికతో) చిక్కులేమియు లేవు తండ్రీ, ఇవి ఆనందబాష్పములు...నాయనా, ఇరుగో గురువుగారు; నమస్కరింపుము.

రోహి—ఆహా! వశిష్ఠులవారా?...గురువర్యా, నమస్కారము.(నమస్కరించును.)

వశి—నాయనా, దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము.

హరి—నాయనా, ఇరుగో విశ్వామిత్రులవారు; వీరికి నమస్కరింపుము.

రోహి—మునీశ్వరా, నమస్కారము. (నమస్కరించును.)

విశ్వా—(ఎత్తుకొని) హా! రోహితాశ్వా, నీకు నేనెంత ఘోరము చేసితిని! పాపాత్ముఁడను; క్రూరాత్ముఁడను. తండ్రీ, నీకు దీర్ఘాయువును, మహదైశ్వర్యమును, సర్వసౌఖ్యములును కలుగును గాక!

చంద్ర—ఆర్యపుత్రా, మన చిన్నికొడుకు బ్రదికినప్పటినుండియు నాకు చావవలెనన్న ఊహ తగ్గి పోవుచున్నది. అయ్యయ్యో! నాదేమి పాపపు మనస్సు! మీ మాట నిలువఁ బెట్టవలసి ఉన్నదని కూడ మఱచుచున్నాను.

విశ్వా—చంద్రమతీ, భయపడకు. నేను తెచ్చి పెట్టిన చిక్కులు నేనే విప్పెదను. గురువు తప్పులు చేసి దిద్దుకొనినట్లయినది నా బ్రదుకు...వశిష్ఠా, ఈ పిల్లవానిని కొంచెము దూరముగా తీసికొని పోయి అటు త్రిప్పి ఉంచుము.

వశి—అట్లే. (రోహితాశ్వుని కొంచెము దూరముగా తీసికొని పోయి ప్రక్కకు త్రిప్పి ఉంచును.)

విశ్వా—హరిశ్చంద్రా, నీ కత్తి ఇటు తెమ్ము; వాడి చాలదు కాఁబోలు. (కత్తి పుచ్చుకొని పదను చూచి తిరిగి ఇచ్చి) ఇప్పుడు నఱుకుము.

హరి—అయ్యో! దేవీ, క్షమించుము. నా పాపపు చేతులతో నిన్ను నఱుక వలసి వచ్చినది. మీఁద ఈశ్వరుఁడును, మునీశ్వరుఁడును, ఉన్నారు. కన్నులు మూసికొమ్ము...అయ్యో! శత్రురాజుల కంఠములను ఖండించుటకును జంకు చేతితో నీ కంఠమును నఱుక వలసి వచ్చెను...ఏమి చేయుదును?...దేవీ, కన్నులు మూసికొమ్ము; ఇదిగో, నఱుకుచున్నాను.

[హరిశ్చంద్రుఁడు చంద్రమతి కంఠమును తెగనఱుకఁగా, అది ఎప్పటి వలెనే అతుకుకొనును.]

ప్రజలు—ఆహా! ఆహా! ఏం అద్భుతం!

హరి—ఆహా! ఏమి అద్భుతము! కంఠము తెగియు అతుకుకొనినది. ఇదిగో, కత్తికి కొంచెము రక్తపు జీరయు తగిలినది! ఆహా! ఆహా!

విశ్వా—రాజా, ఆశ్చర్యమేమియు లేదు. దానికి నేను అమృతమును రాసి ఉంటిని.

హరి—ఆహా! ఆహా! దేవీ, నీవు నాకు దక్కినావు; మాటయు దక్కినది. లెమ్ము; నన్ను కౌఁగిలించుకొమ్ము.

చంద్ర—(సంభ్రమముతో లేచి) ఆహా! ఏమి భాగ్యము! ఏమి భాగ్యము! పుత్రకా, రారా, రారా; ఇప్పుడు నన్ను కౌఁగిలించుకోరా తండ్రీ. ఇప్పుడు మన మిద్దఱమును ఒకరొకరికి దక్కినాము. తండ్రీ, రా; నాన్నగారికి నమస్కరింతము...ఆర్యపుత్రా, ఇదిగో ఇప్పుడు మేము నిన్ను నిశ్చయముగా కలిసికొంటిమి. మా వందనములను గైకొమ్ము.

(రోహితాశ్వునితో కూడ హరిశ్చంద్రుని కాళ్లపై పడును.)

హరి—దేవీ, లెమ్ము, లెమ్ము; నా కౌఁగిలిలోనికి రమ్ము; పుత్రకా నీవును రమ్ము.

[చంద్రమతీ హరిశ్చంద్ర రోహితాశ్వులు ఒండొరులను సంతోష బాష్పములతో కౌఁగిలించుకొందురు.]

విశ్వా—ఓ మహాజనులారా, ఈ చర్య అంతయు మీకు చిత్రవిచిత్రముగా వినిపించి ఉండును. నిశ్చయమే; ఈ పవిత్రచరిత్రుని చరిత్రము చిత్రవిచిత్రమే. చెప్పెదను! మీ చెవులు పవిత్రములగునట్లు వినుఁడు.

[గణపతి వచ్చుచు సంభ్రమముతో ప్రవేశించును]

గణ—హా! తండ్రీ, రోహితాశ్వా, ఎక్కడ ఉన్నావోయి నాయనా? పాపపు పాము నిన్ను కఱువ వలెనా?...ఏఁడీ? ఏఁడీ?—

హరి
చంద్ర
రోహి } —గణపతీ, నమస్కారము.

గణ—(దిగ్భ్రమ చెంది) అహా! ఏమిది? నేను నిద్రపోతూ ఉన్నానా? మేల్కొని ఉన్నానా? ఇది స్వప్నమా? మతిభ్రమా? ఇంద్రజాలమా? రోహితాశ్వుఁడు పాము కఱచి చని పోయినాఁడని విన్నానే. ఏలాగు బ్రతికినాఁడు?

హరి—(విశ్వామిత్రుని చూపించుచు) గణపతీ, ఇది అంతయు ఈ మహామహుని ప్రసాదము.

గణ—ఐతే రోహితాశ్వుఁడు బ్రదికి ఉన్నట్టేనా? మీ చిక్కులన్నీ తీఱినట్టేనా? ఇది విశ్వామిత్రుఁడి ప్రసాదమా! అహా! వింతల మీఁద వింతలు; అవులింతల కంటె ఎక్కువౌతూ ఉన్నవే; సంతోషం, సంతోషం; ఆనందం; ఆనందం; ''ఆనందమానందమాయెనే?'' (తెయ్యిమని గంతును.)

విశ్వా—ఓయీ గణపతీ, నీ గంతులు కొంచెము సేపు చాలించు. ఇదిగో, ఇక్కడ మూఁగి ఉన్న ఈ మహాజనులకు హరిశ్చంద్రుని చరిత్రమును చెప్పుచున్నాను. నీవును విను:

ద్విపద.

ఓహో! వినండి మీరో జనులార,
ఈహరిశ్చంద్రుచే ఎట్లో బొంకింతు-
నని వశిష్ఠునితోడ నమరేంద్రసభను
పని లేని పాటుగా పంతంబు పట్టి,
ఈ నృపాలకుని పరీక్షించినాఁడ
నేనన్నా గతుల; అన్నియు వృధలయ్యె.
మొదట తండ్రిని స్వర్గముననుండి దింపి,
«ఇదె నరకమున నేనితనిని కూల్తు
బొంకవే," నని భయమున్ పెట్టినాఁడ;

బొంక కీతఁడు సత్యమును నిల్పుకొనియె;
మఱియొక మాఱు తా మాట తప్పుటయె,
ధరణి రాజ్యంబెల్ల ధారవోయుటయె,
అవసరంబైనప్పు డధిక రాజ్యంబు-
నవలీల వదలి సత్యము నిల్పుకొనియె;
ఆపైని కార్చిచ్చునందు చాకుండ
కాపాడుకొనుట కొక్కయసత్యమాడ-
వలసి వచ్చినను, చావఁ గొంచె; బొంకఁ
దలఁప కప్పుడును సత్యము నిల్పుకొనియె;
అటువెన్క బేతాళుఁ డాలుబిడ్డలను
మటుమాయ చేయ, క్రమ్మఱఁగను వాను
తన బొంకు వలననే తప్పక వత్తు-
రని యెఱిఁగియును సత్యము నిల్పుకొనియె;
ఆవెన్క నొకమాయయప్పును నాకు
ఏ విధినిన్ తీర్ప నితనికి వీలు
లేమిని, తన సుతున్, లేమను అమ్మె:
ఆమాఱు కూడ సత్యము నిల్పుకొనియె;
అక్కడకున్ తనయప్పెల్ల పోని
చిక్కు నేనొక్కటి చేకూర్ప, తాను
మాలని దాసుఁడై మానుపుకొనియె:
ఆలాగు కూడ సత్యము నిల్పుకొనియె;
పదపడి, "ఒక బొంకు పలికిన, నేను
బ్రదికింతు నీ ముద్దు పట్టి", నటంచు
ఆనను కల్గించి, అట్లాపినాఁడు:
ఆసమయమున సత్యము నిల్పుకొనియె;

తుదకు "స్వప్నములోనఁ ద్రింతు" నటన్న
సుదతిని, మీరెల్ల చూచుచుండఁగనె,
సహజధైర్యంబుతో సర్రున సతికి
అహహా! ఇప్పుడును సత్యము నిల్పుకొనియె;
అప్పుడిప్పుడటంచు ననక యీతండు
తప్పకెప్పుడును సత్యము నిల్పుకొనియె.
కలలోననైన బొంకని యింకొకండు
కలుగునే యిలయెల్ల గాలించి వెదుక?
సత్యహరిశ్చంద్రచక్రవర్తి యను
నిత్యయశస్సుచే నెగడుటె కాక,
ధాత్రిపై నత్యద్భుతంబగు తన చ-
రిత్రచే చిత్రహరిశ్చంద్రుఁడయ్యె!
ఇట్టి పుణ్యాత్మునకేను పెట్టితిని
అట్టిట్టి వన రాని అష్టకష్టములు.

(హరిశ్చంద్రుని వైపు తిరిగి)

అహా! హరిశ్చంద్ర, మహానుభావుఁడవు;
సహియించి నన్నిఁకన్ క్షమియింపుమయ్య. 197

(మోఁకరించును.)

ప్రజలు—ఓ విశ్వామిత్రా, నువ్వు నిశ్చయంగా కటిక వాఁడవు.

హరి—(విశ్వామిత్రుని లేవఁదీసి) అహా! మునీశ్వరా, నాకిట్లు మోఁకరించుట న్యాయమా?...ఓ మహాజనులారా, ఈయనను మీరేల దూషించెదరు? మొదట ఈయన పట్టిన పంతము ఎట్టిదైనను, తుదకు మాత్రము అది నాకు మేలుగానే పరిణమించినది. వీరు నాకు ఇట్టి కష్టములు పెట్టుట నా సత్యగుణమును బయలు పఱుచుటకు చేసిన యుపాయముగానే తేలినది. ఈయన నాకు అపకారి కాక పరమోపకారియే అయ్యెను; చూడుఁడు:

తే. గీ. భువి హరిశ్చంద్రుఁడను రాజు పుట్టెననియు,
మాట నిలుపఁ బెట్టుకొనంగ పాటు పడెన-
తండనియు, నాకిఁకన్ శాశ్వతంబుగాఁగ
కలుగు కీర్తి విశ్వామిత్రువలననె సుమ్ము. 198

విశ్వా—అహా! హరిశ్చంద్రా, నీ సుగుణసంపత్తికి నాకు మితి మీఱిన ఆశ్చర్యము కలుగుచున్నది...ఓ బ్రాహ్మణులారా, చూచెద రేల? గణపతీ, మీ మిత్రునికి బ్రహ్మరథము ఏల పట్టరు?

గణ—ఒరేవు విన్నస్సా, శంభుశాస్త్రీ, గంగాధరం, రండిరా రండి.

హరి—గణపతీ, ఉండుండు. నీకేమి వెఱ్ఱియా? నాకేమి బ్రహ్మరథము?

గణ—మిత్రమా, ఇది బలవంతపు బ్రాహ్మణ్యం; ఉండుండు.

[బ్రాహ్మణులు హరిశ్చంద్రునికి బ్రహ్మరథము పట్టుదురు.]

విశ్వా—అహా! ఆహా! నా కన్నులు ధన్యములైనవి...ఓ దేవతలారా, ఓ మానవులారా, ఏదీ, మీ జిహ్వలు పావనములగునట్లుగా ఒక్కమాఱు హరిశ్చంద్రుని ప్రశంసింపుఁడు.

దేవతలు-
మునులు-
ప్రజలు-

శంకరాభరణము—ఆది.

మేలు హరిశ్చంద్ర- హా! హా! హా!॥ మేలు॥
మేలు నీదు సత్య- శీలమెల్ల నెన్నఁ।
జాల మింతయేని- హా! హా! హా!॥ మేలు॥
నిన్ను కన్న మాదు- కన్నులకు చాల।
పున్నె మబ్బె నేఁడు- హా! హా! హా!॥ మేలు॥
ధాత్రి ఎంతయో ప- విత్రమయ్యె జగ-।
న్మిత్ర, నీవు పుట్ట- హా! హా! హా!॥ మేలు॥

[దేవదుందుభులు మ్రోఁగును; పుష్పాల వాన కురియును.]

విశ్వా—ఓ త్రిశంకూ, రమ్ము రమ్ము; నీ కుమారుని ఘనతను చూచెదవు గాని రమ్ము.

[నేలలోనుండి త్రిశంకుఁడు పైకి వచ్చును]

హరి—(బ్రహ్మరథమునుండి దిగి) తండ్రీ, నమస్కారము. నాయనా, రోహితాశ్వా, తాతగారికి నమస్కరింపుము.

రోహి—తాతగారూ, నమస్కారము. (నమస్కరించును.)

త్రిశంకు—తండ్రిలారా, దీర్ఘాయుష్మంతులు కండు...ఇదుగో, వశిష్ఠవిశ్వామిత్రులు; మౌనీశ్వరులారా, నమస్కారము. నాకు పాతాళవాసము ఎట్లు తప్పినది? నాకొడుకు అసత్యమాడుటకు చివరకు ఒప్పుకొనెనా?

విశ్వా—ఓయీ త్రిశంకూ, నీ కొడుకు సత్యవాక్యపరిపాలనమును దేవతలును మానవులును ప్రశంసించుచున్నారు. అతని సత్యసంధత వలననే నీకు ముక్తి కలిగినది.

త్రిశంకు—ఆహా! ఏమి చల్లని మాట వింటిని! ఎంతటి సుదినము!...మునిసత్తమా, నా కొడుకు అయోధ్యలో లేఁడేమి?

విశ్వా—ఆహా! సంతోషపారవశ్యము చేత చేయ వలసిన కార్యములు మఱచుచున్నాను...ఓయీ హరిశ్చంద్రా, రమ్ము; మఱల నీరాజ్యమును నీవు పైకొమ్ము.

హరి—స్వామీ, నాకు రాజ్యమక్కర లేదు. ఒకరికి దానమిచ్చినది మఱల నేనెట్లు పైకొందును? అదియును గాక, ఈ నడుమ జరిగిన సంగతుల నన్నిటిని చూచి నాకు లోకముపై విరక్తి పుట్టినది; సుఖములనుండి విముఖుఁడనైతిని. ఈ కాశిలోన శ్రీ విశ్వేశ్వరసన్నిధానమున సతీసుతులతో కాలము గడిపెదను. ఈ రోహితాశ్వుఁడు పెద్దవాఁడైన వెనుక, మీకు కరుణ ఉన్న యెడల, వీనికి పట్టము కట్టుఁడు.

గణ—మునీశ్వరా, ఒక్క మనవి: అపాత్రంగా రాజ్యాన్ని దానం పుచ్చుకొన్న మాలపాత్రలను మీరు ఈ హరిశ్చంద్రనాటకం లోకి దింపినారే, వారేమైనారు?

విశ్వా—ఓయీ గణపతీ, నిష్కారణముగా అనేక పాపములకు ఒడిగట్టుకొన్నాను. పరీక్షార్థము నేను వారిని పంపఁగా, వారియిద్దరును నిజముగానే హరిశ్చంద్రుని మీఁద అపరిమిత మోహమును పొంది విరహబాధకు ఆఁగలేక, నా ప్రాణమునకు ఉసురుమని, అడవిలో చెట్లకు తీఁగెలతో ఉరి పెట్టుకొని చచ్చిరి.

గణ—శివశివా! ఎంతటి ఘోరమైన సంతోషవార్త! నేనన్న మాస్తరు అతను

రాజ్యసంకట మనుభవించడానికే పోయినారు కాఁబోలు! అడవిలో చెట్లతో నే తమసంసారం అని ఇంతకు ముందు అన్నట్లే వాళ్లు ఘనతనులను వదల లేక కట్టుకొని ఉయ్యాలలూగినారు. స్వామీ, ఇదంతా వాళ్ల పాండిత్యప్రభా వం సుమండీ. ఇందుకే బుద్ధిమంతులు స్త్రీవిద్య కూడదంటారు.

విశ్వా—హరిశ్చంద్రా, రోహితాశ్వుఁడు ఎదిగిన వఱకును రాజ్యము ఎవరి అధీన ము చేయవలెను?

హరి—స్వామీ, మీ అనతి అయినయెడల సత్యకీర్తిని గణపతిని రాజ్యము చూచు చుండు మనెదను.

గణ—ఏమయ్యోయ్! మిత్రమా, నిన్ను విడిచి నేను మాత్రం వెళ్తానా? అంతే కాకుం డా, ఈ కాశీలో నా కొక సంబంధం కూడా కలిసి వచ్చింది. మా బంధువుల పిల్లనే ఒకదానిని,—చిన్నతనాన్నే వైధవ్యం పొందిన దానిని,...మొన్న మొ న్ననే రజస్వల అయిన దానిని,—నాకు మా మేనమామ చేస్తానంటున్నాఁడు. కాఁబట్టి నేను వెళ్లను. మీ వెంట మీ సత్యకీర్తి మంత్రిలాగు ఉండడం ఎలా గూ తప్పదు గనుక, ఆ సత్యకీర్తే అక్కడ రాజ్యం చూడనియ్యండి.

హరి—మునీశ్వరా, అలాగే కానిండు.

విశ్వా—హరిశ్చంద్రా, అట్లే చేసెదను...ఇదిగో, మీ గురువు గారితోడి పంత మును బట్టి నీవిషయమై నా తపస్సులో సగము వ్యయపఱచవలెను. నా త్రి యాజకత్వము మూలమున సగమప్పుడే వ్యయమైపోయినది. తక్కిన సగమును వినియోగించి, నీకు పదునాల్గు మన్వంతరములు ఇంద్రుని అర్ధసింహాసనమున కూర్చుండు అర్హతను కలిగించెదను, రమ్ము.

హరి—స్వామీ, అదియు నేనొల్లను. ఫలాపేక్షతో నేను సత్యనియమమును పూన లేదు.

విశ్వా—హరిశ్చంద్రా, ఏమిది? మాట నీవే నిలుపఁ బెట్టుకొనవలెను గాని మే మె వ్వరమును కూడదా? నేను మీ గురువుతో పట్టిన పంతమును బట్టి నీనిమిత్తమై నా తపస్సులో సగము ధారపోయక తప్పదు.

హరి—స్వామీ, అట్లయినయెడల నాకు చేయఁగలఁచిన మేలు నా తండ్రిగారికి కలిగింపుఁడు. వారికెట్లయినను స్వర్గము వచ్చునట్లు ప్రయత్నింతునని మాట కూడ ఇచ్చి ఉంటిని.

త్రిశంకు—అహా! హరిశ్చంద్రా, ఎంతటి బుద్ధిమంతుఁడవు? నీవంటి సుపుత్రుఁ

డొక్కాడు చాలడా? నిక్కమని నేను తలంచితిని. ఆహా! నీవంటి పుణ్యాత్మునా నేనప్పుడు నిష్కారణముగా తిట్టి శపించినాను? నేను నిజముగా చండాలుడనే.

విశ్వా—హరిశ్చంద్రా, నీకు నేను పెట్టిన చిక్కుల నాలోచించుకొని, నీవేమి చేయుమన్నను కాదనక చేయుదును. నా వలన నీవు స్వయముగా ఏదియు ఉపకారము పొందనెంచినట్లుగా కనిపించదు. కానీ: మీ వంశములో పుట్టఁబోవు నీ వంటి సత్యగుణాభిరాముని ఎవనినో నా శిష్యునిగా చేసికొని, నీకు ఎన్ని అశుభములు కల్పించినానో, అతనికన్ని శుభములు కల్పించెదను...ఓ వశిష్ఠా, ఇదిగో మునుపటి నా ప్రతిజ్ఞ ప్రకారముగా నా తపస్సులో సగము హరిశ్చంద్రుని విషయమై వ్యయపఱుచుచున్నాను. ఇందు వలన త్రిశంకునకు నిజస్వర్గము కలుగును గాక!...ఓ ఇంద్రాదిదేవతలారా, ఇప్పుడైనను ఇతనికి స్వర్గమిచ్చెదరా?

దేవతలు—(ఆకాశముననుండి) విశ్వామిత్రా, నీ తపోవ్యయము అవసరము లేకుండ హరిశ్చంద్రుని సత్యమహిమయే అతని తండ్రి పాపములనన్నిటిని పోఁగొట్టినది. తండ్రియే కాదు; ఇరువది తరముల వారును, ఇరువది తరముల వారును అతని మూలమున తరింతురు......ఓ త్రిశంకూ రమ్ము.

వశి—విశ్వామిత్రా, నీ ప్రతిజ్ఞ చెల్లినది; తప ఫలమును నిలిచినది. నీవును ధన్యుఁడవు.

[మీఁదినుండి విమానము రాఁగా అందు త్రిశంకుఁడెక్కి పోవును.]

హరి—తండ్రీ, నమస్కారము. (చేతులు మోడ్చును.)

విశ్వా—లోహితాశ్వా,—అయ్యో! నీకు ఎంత బాధ కల్గించితినోయి నాయనా? నేను చేయు మేలు మీనాన్నగారు ఒక్కటియు ఒప్పకున్నారు. నీవైనను నా వలన ఏదో ఒక మేలు పొందవా? నీకు ఏమి కోరిక గలదు?

లోహి—స్వామీ, నా తల్లిదండ్రుల ఆజ్ఞలను సదా శిరసావహించుచు నడుచుచుండు బుద్ధి నాకుండ వలె నన్న కోరిక తప్ప నాకు మఱే కోరికయు లేదు.

విశ్వా—చంద్రమతీ, నీవైనను కోరుకొనవా?

చంద్ర—స్వామీ, నా కొకటియే కోరిక:

ఉత్సాహ.

పతిపదద్వయమ్మె నాకు పరమగతిగ నమ్మి, నే-
నతని నెల్ల గతుల దైవమ్ముగా నె చూచుచున్,
క్షితిని జీవనంబు దాల్చిన దినంబులెల్ల నే-
నతని దివ్యసన్నిధానమందె యుండఁ గావుతన్. 199

విశ్వా—ఓయీ హరిశ్చంద్రా, నీవట్టి నిష్కళంకుఁడవు, నీవారందఱును అట్టివారే, ఇట్టివారు గనుకనే మీరు సత్యమును కాపాడుకొనఁ గలిగినారు. నీవంటి పుణ్యపురుషుఁడు నిశ్చయముగా నభూతో నభవిష్యతి. నాచేత ఒక్క మేలును పొందవా? నీకు ఒక్క కోరికయు లేదా?

హరి—స్వామీ, నా మనస్సునందు ఒక్క కోరిక ఎప్పటికిని ఉన్నదే.

విభూతి.

నిత్యమున్ మహిన్ సుహా
దిత్యమై, మహా జన-
స్తుత్యమై, సుకృత్యమై,
సత్యమే జయించుతన్.

షష్ఠాంకము సర్వమును సంపూర్ణము.

